
అమృతాంజన్
తలనొప్పులకు, జలుబులకు, ఒళ్లునొప్పులకు
ఇంటింటా ఉండవలసిన దివ్య ఔషధము
తలనొప్పులకు, జలుబులకు. ఒళ్ళు నొప్పులకు ఉపశమనం
కలిగించే అమృతాంజన్‌ను బాధగా ఉన్న
చోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న
పది శ్రేష్ఠమైన ఔషధాలు నిమిషాల మీద గుణం
కలిగిస్తాయని మీరు తెలుసుకొంటారు. అదాచేసే
పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ
వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.
AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.
అమృతాంజన్ 80 సంవత్సరాలకు
పైబడిన నమ్మకమైన దివ్య ఔషదము.
అమృతాంజన్ లిమిటెడ్
AM 1912

విజయలక్ష్మీ ఆర్ట్ పిక్చర్స్

# బంగారు చెల్లెలు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
**టి. త్రివిక్రమరావు** B.A.,(Hons)

దర్శకత్వం:
**బోయిన సుబ్బారావు** B.Sc.,



సంగీతం: కె.వి. మహదేవన్

ఛాయాగ్రహణం: వి.యస్.ఆర్. స్వామి

LAKSHMI PUBS

లక్ష్మీ ఫిలింస్

# ఆంధ్రపత్రిక

## సిద్ధార్థినామ
## సంవత్సరాది సంచిక

[ అరువది తొమ్మిదవ సంచిక ]

[ 1979 – '80 ]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథున నాగేశ్వరరావు

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[ 1938 – '72 ]

*

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 3


ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 28-3-'79**
**Regd. No. H/VJ No. 49.**

# సిద్ధార్థినామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక 69 సంవత్సరము 1979-'80



ముఖచిత్రం : శ్రీ కొండపల్లి శేషగిరిరావు

# స్వవిషయం

ఆంధ్రపత్రిక సిద్ధార్థి సంవత్సరాది సంచికలో భారత దేశం ఆర్థికవ్యవస్థ, అత్యవసర పరిస్థితిలో పత్రికల పరిస్థితి — వీటిని గురించి వ్యాసాలు ఉండటం పాఠకులు గమనిస్తారు. వర్తమాన దేశాలలో ఒకటి కాబట్టి భారత దేశంలో ఆర్థికాభివృద్ధి, వ్యక్తిస్వాతంత్ర్యాలని గురించి ఎంతో కొంత జరుగుతూనేఉంది. ఆంధ్రదేశంలో జరుగుతూ వచ్చినదంతా తెలుగువారికి వీటిమీద అంత శ్రద్ధ లేదా అన్న అనుమానాన్ని కలిగించేట్లుగాఉంది. అందుచేతనే, తెలుగులో రాసేవారు కొందరయినా వాటిని గురించి పట్టించుకొనటం కొంత తెరిపిగా ఉంటుంది. ఆధునిక కాలానికి అనుగుణంగా ఎంతో వేగంగా మారి పోతున్న తమ చుట్టూ ప్రపంచాన్నీ, మార్పువలన తమలో కలిగే పరిణామాలనీ గురించి తెలుగులో చదవాలని అనుకునేవారందరికీ విద్యాసంస్థలు అందుబాటులో ఉండవు. ఇటువంటి వారిని ఉత్తేజపరచటం మేధావి వర్గానికి చెందిన తెలుగువారి కర్తవ్యం అంటే తప్పులేదు వారి ఈ కర్తవ్య నిర్వహణలో తోడుపడటం ఆంధ్రపత్రిక ధ్యేయాలలో ఒకటి.

సిద్ధార్థి సంవత్సరాది సంచికలో పడిన ఆర్థిక, రాజకీయ వ్యాసాల విషయమయి ఇంత రాయవలసివచ్చింది. అదికాక కవిత్వం, కథలు, సాహిత్య విమర్శ మొదలయినవి ఈ ఉగాది సంచికలో పుష్కలంగానే ఉన్నాయి. సిద్ధార్థి సంవత్సరాది సంచికకి తమ రచనలు పంపిన వారందరికీ కృతజ్ఞులము.

ఈ సంచిక తయారవుతూ ఉండగా కోడూరి రామమూర్తిగారు మరణించినట్లు తెలిసింది. ఆయన ఎన్నో విధాలుగా ఆంధ్రపత్రిక శ్రేయోభిలాషులు. శిల్పం, చిత్రకళలంటే ఇష్టంఉన్న తెలుగువారందరికీ ఆయన మరణం ఒక తీరని లోటుని కలిగిస్తోంది. కోడూరి రామమూర్తిగారు పరమపదించిన కొన్ని రోజులలోనే రాళ్ళ పల్లి అనంత కృష్ణశర్మగారు అస్తమించారు. శర్మగారు తెలుగు సాహిత్యానికి, సంగీతానికి చేసిన సేవని వర్ణించటానికి ఇది అదనుకాదు. వ్యవధి అంతగా లేకపోయినప్పటికి ఈ సంచిక కోసం శ్రీ తిరుమల రామచంద్ర రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి మీద ఒక చిన్న వ్యాసం రాసి పంపగా దానిని వేస్తున్నాము. కీ. శే. అనంతకృష్ణ శర్మగారి రచనలని గురించి మరింత లోతుగా అనుశీలన జరుగవలసిఉంది.

ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వెలువడటం మొదలుపెట్టి ఇంచుమించు డెబ్బయి సంవత్సరాలు అయింది. ఇంతవరకు అందరి వద్దా లభించిన సహకారమే ఇక ముందు కూడా లభించగలదని ఆశిస్తూ అందరికీ ఉగాది శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాము.

# మహారణం

## శ్రీ పజ్ఝల కాళిదాసు

దానవత్వం కుతకుత ఉడుకుతూ
ఆవేశంతో ఆవేగంతో
ఆకాశానికి పొంగుతూ
అవనీతలాన్ని మింగుతూ
విజృంభించి
వీరవిహారం చేసింది

భూమ్యాకాశాలమధ్య
అగోచరంగా అగమ్యంగా
అరుస్తూ గాండ్రిస్తూ గోండ్రిస్తూ
వీర కిరీటం ధరిస్తున్నాది సృష్టి
మహావీరుల్ని
వీరాధి వీరుల్ని
కంటున్నాది తింటున్నాది
ఈ మహాయుద్ధం

*   *   *

కదన కుతూహలం
గానం చేసి వినిపిస్తూంది
గతులస్థాయి హెచ్చిస్తూ
ఖడ్గాలకి మత్తెక్కిస్తూ
మద్యం గ్రోలిందన్నట్లు
వాద్య విశేష సమ్మేళనం

*   *   *

దానవుడుగా మారిన మానవుడా
ప్రాణాలు దేనికి పణం పెడుతున్నావు ?
నీవు విసిరిన ఈ బల్లెం
ఏ కన్నతల్లి కడుపులో
కార్చిచ్చులు రేపునో
నీవు దూసిన ఈ ఖడ్గం
ఏ యిల్లాలి మంగళసూత్రం
త్రెంచి పారవేయునో
నీవు కురిపించిన బాంబులు
ఎన్ని పచ్చని సంసారాలలో
కారుచిచ్చులు రేపునో !

*   *   *

ప్రపంచం మూలుగుతున్నది
బాధగా భయంగా
హృదయ విదారకంగా;
దూసుకొని చొచ్చుకొని
మనసు లోతులకి గుచ్చుకొ టున్నవి
మూలుగుల ముళ్లు !
నిర్విణ్ణంగా
నిద్రాణంగా
నిశ్శబ్దంగా
నిశ్చేష్టంగా పడిఉన్న
మానవత్వం కదిలింది
జ్ఞాన నేత్రం విడింది

ఆ విరులు క్రక్కి
ఆక్రోశించిన అవనీతలం
అలిసిపోయింది, అలమటించింది !

అణిగిపోయిన భువి
ఆవలించి తడబడి లేచింది

దిగమింగిన దుఃఖాన్ని చీల్చుకొని వచ్చిన
దీర్ఘ నిశ్వాసాల జాలి గాలితో
ఆకలి కడుపుల అంతరాల పొంగిన
ఆవేదనల అక్కటికపు కెరటాలలో
హరించుకొని పోతున్న ధ్వనులు
అంతటా మృత్యు ముఖరిత నిశ్శబ్దం
ఆఖరయింది మహాయుద్ధం
మహారణం మారణం !

*   *   *

పుడమితల్లి పునర్జన్మ గాంచింది
మ్రోడు చిగురు తొడిగి పుష్పించింది.

ఆరుద్ర

# ఆంధ్రులపై జైనమత ప్రభావం; జైనమతానికి ఆంధ్రుల సేవ

అత్యంత ప్రాచీన చారిత్రక కాలంనుంచీ జైనమతం ఆంధ్రదేశంలో ఉంది. ఏ ఒక్క ప్రాంతంలోనో కాదు, కళింగం, వేంగి, వెలనాడు, పాకనాడు, అరువనాడు, పులుగులనాడు, మార్జవాడి, సబ్బినాడు ఒకటేమిటి నేటి యావదాంధ్రదేశంలో అర్హత మతం వ్యాపించింది. ఈనాడు సుమారు పద్దెనిమిది తెలుగు జిల్లాలలోని 84 ఊళ్ళలో జైన స్థావరాల అవశేషాలు కనబడుతున్నాయి. ఇప్పటికీ కొన్ని ఊళ్ళలో జినాలయాలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. కొలనుపాక వంటివి నేటికీ జైనుల యాత్రాస్థలాలే. శివగంగ, ఆర్యవటం, నేమం, భోగాపురం, హనుమకొండ, వరంగల్లు కోట మొదలైన చోట్ల ఏనాడో జైనులు తవ్వించిన తటాకాలు ఈనాడూ చల్లని జలాలు ఇస్తున్నాయి. దాహం తీరుస్తున్నాయి.

'కవిత్వమొక తీరని దాహం' అని కవిగారు చెప్పొచ్చు. చారిత్రక కుతూహలం అంతకన్నా తీరని దాహం. ఒకనాడు ఆంధ్రదేశం అంతటా వ్యాపించిన జైనమత ప్రభావం ఆంధ్రులమీద ఎంతఉంది? ఆంధ్రులు జైనమతానికి చేసిన సేవ ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానాలు వెదకడం సముచిత కర్తవ్యమేకాక, కృతజ్ఞతాసూచకం కూడా అవుతుంది. ఏమంటే జైనులే తెలుగువాళ్ళకి అక్షరాభ్యాసం చేసిన గురువులు. అందుకే 'సిద్ధం నమః' అనే నమస్కారాన్ని నేటికీ విడిచిపెట్టక మనం విద్యారంభం చేస్తున్నాం. మనకి లెక్కలు నేర్పిందీ జైనులే! ఎక్కాలు అనే మాట ఆ సంగతినే జ్ఞాపకం చేస్తుంది. ప్రాకృతంలో ఎక్కాలను 'మగ్గలు' అంటారు. అందులో ప్రతీదీ 'ఎక్కస' అని మొదలవుతుంది. (ఎక్కస వర్గో ఎక్కా బియ్యస వర్గోచారి అంటూ) మగ్గలు మరుగుపడినా ఎక్కాలు మనకు దక్కాయి. ఒకనాడు జైనగాథలను తెలుగులోనే తెలుగువాళ్ళు చదువుకొనేవారు. ఆ జైన సాహిత్యం తరువాత కవుల దృష్టిలో 'గాసట బీసటే' అయింది. ఎర్రయ్యగారు తమ నృసింహపురాణంలో 'గాసట బీసటే' చదివి గాథలు త్రవ్వు తెనుంగు వారిని పేర్కొన్నారు. (1-9) నాడు తవ్విన గాథలు నేడు కాలగర్భంలో కలిసిపోయినా వాటిని మళ్ళా తవ్వి తలకెత్తుకోవాలి.

ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాని సత్యం.

హరిసేనుడు 'బృహత్కథాకోశం' అనే గ్రంథంలో చెప్పిన కొన్నికథలు ఆంధ్రదేశానికీ జైనమతానికీగల సంబంధాలు చెప్తాయి. నయసేనుడు 'ధర్మామృతం'లో తెలుగు దేశానికీ జైనులకు గల మరికొన్ని కథలు చెప్పాడు. ఇవి కేవలం కథలే అయినా వీటి నివురులో చారిత్రక సత్యాల నిప్పు కప్పబడి ఉన్నట్టు పరిశోధకులు భావిస్తారు.

ఇటీవల గుంటుపల్లిలో బయటపడ్డ ఖారవేలుని శాసనంవల్ల హాథీ గుంఫ శాసనంలో ఆంధ్రుల గురించి చెప్పినవన్నీ ఎక్కడో దక్షిణ మహారాష్ట్రంలోకాక నేటి ఆంధ్రలోనే జరిగినవని స్పష్టమవుతోంది. ఖారవేలుడు జయించిన పిథుండను గుంటుపల్లిగా చరిత్రకారులు గుర్తించారు. గుంటుపల్లి తొలిపేరు గుడ్డుపల్లి. దానినే 'పృథు అండ' అని సంస్కృతీకరించారు. గుంటుపల్లిలో గుహాలయంలో సుజ్ఞాననాధుడనే జైనాచార్యుడు క్రీ. పూ. రెండవ శతాబ్దిలో ఉండేవాడు. అతని శిష్యురాలు సానాదా అనే అజ్జిక ఆ గుహాలయంలో సోపాన పంక్తిని కట్టించింది. శాసన ప్రమాణాల వల్ల తెలియవచ్చే ఆంధ్రదేశపు ప్రాచీనతమ జైనులు వీరు.

మహాపద్మనందుడు మగధ దేశానికి ఎప్పుడో తీసుకుపోయిన కళింగ జిన విగ్రహాన్ని ఖారవేలుడు మళ్ళా పట్టుకువచ్చినట్టు హాథీ గుంఫ శాసనం చెప్తుంది. కళింగ రాజ్యానికి ముఖలింగం రాజధాని. ఇది నేటి ఆంధ్రదేశంలోనే ఉంది. కళింగరాజ్యం ఒకనాడు గోదావరి దాకా ఉండేది. నందరాజు సంగ్రహించిన కళింగ జిన విగ్రహం పదవ తీర్థంకరుడైన శీతలనాధుని ప్రతిరూపం అని చరిత్రకారులు చెప్తారు. శీతలనాధుడు కళింగ రాజ్యంలోనే జన్మించి కైవల్యం చెందాడు. ఇరవై నలుగురు తీర్థంకరులలో ఒకరు ఆంధ్రదేశంలోనే జన్మించడం విశేషమే.

హాథీగుంఫ శాసనాన్ని పరిష్కరించిన జయస్వాలుగారు శీతలనాధుని జన్మస్థానం భాదలపురమని అదే భాద్రపురం లేక భద్రాచలమనే గుర్తింపును ఆమోదించారు. త్రిషష్టి శలాకాపురుష చరిత్రలోని శీతలనాధుని చరిత్ర కూడా అతని జన్మస్థానం దక్షిణ భారతంలోనే ఉన్నదని చెప్తుంది. దిగంబర జైనాచార్యుల పట్టావళులలో ఒకటి భాదలపురం దక్షిణంలోనే ఉన్నదని ధృవపరుస్తోంది. భద్రాచలం ఒకనాడు జైన స్థావరమే అని భావించడానికి ఆధారాలు లేకపోలేదు.

గ్రామనామాల చివర 'పాడు' అనేమాట ఉంటే దానిని జైనగ్రామంగా పరిగణించడానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు. భద్రాచలం తాలూకాలో బైరాగులపాడు, కూడలిపాడు, రేగులపాడు, వేపలపాడు అనే గ్రామాలు నేటికీ ఉన్నాయి. గోదావరి అద్దరిని భద్రాచలం ఉంటే ఇద్దరిని బూర్గంపాడు ఉంది. అది తాలూకా కేంద్రం. ఆ ప్రాంతంలో ఇంకెన్ని పాడులున్నాయో తెలియదు. భద్రాచలం తాలూకాలో పెదశీతనపల్లె అనే గ్రామం కూడా ఉంది. ఈ పేరులోని 'శీతన'కూ, శీతలనాథునికీ ఏదైనా సంబంధ ముందేమో చూడాలి.

భాదలపురం శీతలనాథుని జన్మస్థానం మాత్రమేకాదు. దిగంబర జైనుల ఆచార్యులలో తొలి పదహారుమందీ అక్కడే నివసించారనీ పట్టావళులలో ఒకటి పేర్కొంటూంది. భద్రబాహుడు, గుప్తిగుప్తుడు, మేఘనంది, జినచంద్రుడు, కుందకుందాచార్యుడు మొదలైన ఈ పదహారుమంది ఆచార్యులూ భాదలపురంలో కాక పోయినా దక్షిణ భారతంలోనే ఉండేవారు. వీళ్ళలో కుందకుందాచార్యుడు అచ్చంగా ఆంధ్రుడు.

అనంతపురం జిల్లాలో గుంతకల్లుకు నాలుగుమైళ్ళ దూరాన కొనకొండ్ల అనే గ్రామం ఉంది. క్రీస్తుపూర్వం మొదటి శతాబ్దంలో ఆ ఊళ్ళో ఎల్లయ్యో, ఏలయ్యో అనే ప్రతిభావంతుడు జైనం స్వీకరించి పద్మనంది అనే పేరు పెట్టుకొన్నాడు. గెద్ద ఈకల పింఛాన్ని చేతపట్టుకొనేవాడు. మెడ కొంచెం వంకరగా ఉండేది కాబోలు. అతణ్ణి పద్మనంది, వక్రగ్రీవుడు, గృద్ధపింఛుడు, ఏలాచార్యుడు అని పిలిచేవారు. అయినా కొనకొండ్ల గ్రామవాసి కనుక ఆ వూరిపేరుతోనే ఆతడు ప్రసిద్ధుడయ్యాడు. కొనకొండ్లకు ఒకప్పుడు కొండకుంద అనే పేరు ఉండేది. అందుకే ఏలాచార్యుడు కొండకుందాచార్యుడయ్యాడు. ఆ పేరు సంస్కృతీకరణంపొంది కుందకుందాచార్యునిగా మారింది.

కుందకుందాచార్యుడు మహాపండితుడు. 'సమయాచారం, ప్రవచనసారం, పంచాస్తికాయసారం' అనే సారత్రయగ్రంథాలను, నియమసారమనే ఎనిమిది గ్రంథాల సంకలనాన్నీ, 'రయనసారం, అష్టపాహుడ, బరసానువాకం, దాసభక్తి మూలాచారం' అనే గ్రంథాలను రచించాడు. వీటిలో చివరది జైన గ్రంథాలలో అత్యంత ప్రాచీన ప్రామాణిక గ్రంథం. కుందకుందాచార్యుడు దిగంబర జైనులకు గురుపీఠం. అతని శిష్య పరంపర తామర తంపర. తమది కుందకుందాన్వయమని ఎందరెందరో జైనయతులు చెప్పు కొన్నారు. నేటికీ కుందకుందాచార్యుని పేరు జైనులు స్మరిస్తారు. జైనసభల ప్రారంభంలో చదివే మంగళా శాసనంలో ఆ పేరు కన బడుతుంది.

మంగళం భగవాన్ వీరో<br>
  మంగళం గౌతమో గణిన్<br>
మంగళం కుంద కుందార్యో<br>
  జినధర్మోస్తు మంగళం.

మహావీరుని, గౌతములతోబాటు ఒక్క కుందకుందాచార్యుణ్ణే పేర్కొని స్తుతించడంలోనే అతని విశిష్టత తెలుస్తుంది. ఇతడు ఇంతటి మహావ్యక్తి కనుక ఇతడు మా వాడంటే మా వాడని కన్నడులు, తమిళులు ప్రయత్నించారు. తిరుక్కురళ్ రచించిన వళ్ళువర్ మరెవరోకాదు కుందకుందాచార్యులే అని తమిళ పండితుల వాదన. అయితే శాసన ప్రమాణాలవల్ల ఈ వాదనలు నిలిచేవికావు.

కొనకొండ్ల గ్రామంలోనే శిథిలమైన శాసనాలు ఉన్నాయి. వాటివల్ల తన అనే కాంతవాదంతో దిగ్విజయం చేసిన పద్మనంద భట్టారకుల జన్మస్థానం కావడంవల్లనే ఆ గ్రామం జగద్విఖ్యాత మైనదని తెలుస్తుంది. ఆ మహనీయుని నివాసం కనుకనే అది జైనులకు తీర్థయాత్రా స్థలమైందని కూడా ఒక శాసనం చెప్తుంది. కొనకొండ్లను కొండకుందేయతీర్థం అంటారు. బౌద్ధ మతానికి ఆచార్య నాగార్జునుణ్ణి ఇచ్చిన ఆంధ్రదేశం జైనానికి కుందకుందాచార్యులను ఇచ్చింది. నాగార్జుని శూన్యవాదం బౌద్ధానికి ఎంత విలువైనదో...కుందకుందాచార్యుడి అనేకాంతవాదం అంత బలమైనది. నేటికీ జైనదార్శనిక పరిశోధకులు కుందకుందాచార్యుని గ్రంథాలనుంచి విరివిగా ఉదాహరణలిస్తూ ఉంటారు.

కుందకుందాచార్యులు 95 సంవత్సరాలు జీవించాడు. ఆత్మత్వాన్ని వివరించాడు. వీతరాగాన్ని ప్రబోధించాడు. దివాకరుడు ప్రతిపాదించిన అభేదవాదాన్ని తీవ్రంగా ఖండించాడు. కుందకుందాచార్యుడు దార్శనిక చర్చల్లో ఉగ్రుడు. పరసమయఖండన తీవ్రంగా చేసేవాడు. దేశం నలుమూలలా సంచరించాడు. అతని శిష్యులు కూడా అతనంత పాండిత్యం గలవారే. నూరులే కాక ప్రవార శూరులు.

కుందకుందాచార్యుని శిష్యులలో బలాకపింఛుడు, కుందకీర్తి, సామంతభద్రుల ముఖ్యులు. వీళ్ళలో కుందకీర్తి 'సూత్రావతారం' అనే వ్యాఖ్యాన గ్రంథం రాసి విఖ్యాతుడయ్యాడు. సామంతభద్రుడు శాస్త్రచర్చలోనూ, తర్కంలోను ఘటికుడు. తమిళదేశంలో జైన మత ప్రచారానికి ఇతడే బాధ్యుడు. కుందకుందాచార్యుని ఇతర శిష్యులు ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలకు వెళ్ళి మూలసంఘశాఖలు విస్తరింపచేశారు.

క్రీస్తుశకం ఒకటవ దశాబ్దంలోనే బెజవాడలో జైనమూల సంఘ శాఖ ఉండేది. ఆనాడు జైనులు బెజవాడను వేణాకతటీపురి అని పేర్కొనేవారు. ఆచార్య అర్హబలి ఆనాటి సంఘాచార్యులలో మహోన్నతుడు. అతని ఆధ్వర్యంలో ఆనాటి దక్షిణ భారతంలోని దిగంబర జైనులు వేణాకతటీపురంలో సమావేశమై జైన సిద్ధాంతాన్ని సంకలనం చేయదలిచారు. సిద్ధాంత క్రోడీకరణకు ఏర్పాటుచేసే సభలను సంఘయానం అంటారు. ఇటువంటిదే ఇంతకుముందు ఖారవేలుడు ఏర్పాటు చేశాడు. కాలంగడుస్తున్న కొలదీ సంఘంలో దేశంలో వచ్చే మార్పులను గమనించి సమాధించడానికో నిరాకరించడానికీ ఇటువంటి సంఘయానాలు అవసరం. బెజవాడలోని ఆనాటి సభలో అనుమానాలు వచ్చాయి. వాటి నివృత్తికోసం ఆచార్య అర్హబలి, పుష్పదంతుడు, భూతబలి అనే ఇద్దరు యతులను పరమ ప్రామాణికుడైన ఆచార్య ధరసేనుని వద్దకు పంపించాడు. ధరసేనుడు గిరినగరంలోని చంద్ర

గుహవాసి. ఇది సౌరాష్ట్రంలో ఉంది. జైన నిగమాగాల సాంగో పాంగాలలో ధారాసేనుడు నిష్ణాతుడు. అష్టాంగమహిమానిమిత్త జ్ఞుడు. బెజవాడనుంచి ఆంధ్రజైనులు ఇతని దగ్గరకు వచ్చి సందేహ నివృత్తి కావించుకొన్నారు. ఆచార్యుని ప్రబోధాలను 'మహా కర్మ ప్రకృతి ప్రభావం' అనే గ్రంథంగా భద్రపరచి బెజవాడకు తీసుకువచ్చారు. ఈ ప్రవచనాలను ఆంధ్ర సంఘంముందు నివేదించారు. ఈ సంఘ యానంలోనే మూలసంఘంలోని దేశిగణం నంది సేన, దేవభద్ర అనే శాఖలుగా వర్తించడానికి సంఘాచార్యులు అనుమతించారు. ఇంతకుముందే మూల సంఘం నుండి సితాపట సంఘం, కాష్ఠ సంఘం, ద్రావిడ సంఘం, యాపులీ సంఘం పుట్టాయి.

యాపులీ సంఘాన్నే యాపనీయ సంఘం అని కూడా పిలుస్తారు. యాపనీయ జైనులు విలక్షణమైనవాళ్ళు. శ్వేతాంబరుల లాగ స్త్రీలకు కూడా మోక్షం లభిస్తుందని నమ్ముతారు. దిగంబరుల లాగ వస్త్రాలను నిరసిస్తారు. ఆంధ్ర జైనులలో యాపనీయులు కూడా ఉన్నారు. అసలు ఆ శాఖ ఆంధ్ర కర్ణాటకాలలోనే ఉద్భవించింది. ధారసేనుని సంఘయానంలో చాలా ప్రముఖపాత్రను వహించింది. ఈ యాపనీయులు ఉత్తరోత్తరా యక్షిణీ దేవతల ఉపాసనలో మంత్రసిద్ధులూ మహిమలూ మొదలైన వ్యామోహాలలో పడ్డారు. యాపనీయులను గోప్యులని కూడా పిలుస్తారు.

జైనయతులు సాధారణంగా బాగా చదువుకొన్నవాళ్ళు జైనాగమాలేకాక జ్యోతిష్యం, సర్పవిద్య, అసురవిద్య, వశీకరణ విద్య మొదలైనవాటిలో ఆరితేరినవాళ్ళు. ముఖ్యంగా వాళ్ళ జ్యోతిష్యవిద్య వల్ల సాధారణ ప్రజల నుండి చక్రవర్తులదాకా అందరూ సమ్మోహితు లయ్యేవారు. శాతవాహనుల కాలం నుంచి కాకతీయుల కాలం వరకు జైనులకు రాజాశ్రయం లభిస్తూ వచ్చింది. మండలేశ్వరులు, మహా మండలేశ్వరులు, రాజ విషయాధ్యక్షులు, దండనాథులు జైన బసదులకూ, జినాలయాలకు ఎన్నో గ్రామాలను దానం చేశారు.

జైన యతులకు రాజాశ్రయం లభించితే ఆశ్చర్యం లేదు. జైనయతులు రాజులకు ఆశ్రయమిచ్చి వాళ్ళ రాజ్యస్థాపనకు కారకు లయిన ఉదంతాలు ఆంధ్ర చరిత్రలో లేకపోలేదు. కడప మండలం పేరూరులో సింహనంది అనే జైనాచార్యుడు ప్రసిద్ధుడు. ఇక్ష్వాకు వంశ పాలన అంతరించాక దడిగ, మాధవులనే ఇద్దరు ఇక్ష్వాకు సోదరులు సింహనందిని ఆశ్రయించారు. వాళ్ళకు రాజ్యపాలనా విద్యలో శిక్షణనిచ్చి సింహనంది వాళ్ళచేత తలకాడలో గాంగరాజ్య స్థాపన చేయించాడు. అందుకే పేరూరుకు గంగపేరూరు అనేపేరు వచ్చింది.

రాజపుత్రులకేకాక సాధారణ ప్రజలకు కూడా జైనులు విద్యాదానం చేసేవారు. రాయదుర్గం యాపనీయులు స్త్రీ పురుషులకు సామూహికంగానూ, విడి విడిగానూ, పాఠాలు చెప్పే దృశ్యాలు అక్కడి శిల్పాలపై నేటికీ నిలిచి ఉన్నాయి. మూలసంఘం, బలాత్కారగణం, కొండకుందాన్వయ సరస్వతి గచ్ఛకు చెందిన అమరకీర్తి ఆచార్యులు, అతని శిష్యుడు మాఘనంది ఒకనాడు రాయదుర్గంలో ఉండేవారు. చాలా జైన బసదులలో విద్యాదానం ఉన్నా భారతదేశంలోని పద్మా

లుగు కేంద్రాలనే జైనులు మహావిద్యా స్థానాలుగా పరిగణిస్తారు. అందులో పెనుగొండ ఒకటి. జినభూషణ భట్టారక దేవర వంటి యతులు పెనుగొండలో ఉండేవారు. ఈ యతులలో సంఘాచార్యులు, గణాచార్యులు,ఉపాధ్యాయులు, వాచకాచార్యులు, ఉచ్చారణాచార్యులు, పృచ్ఛకాచార్యులు ఉండేవారు. వీళ్ళు జైన సిద్ధాంతాన్ని పరిరక్షణ కావించేవారు.

జైన బసదులలో సత్రాలయాలు ఉండేవి. ఇందులో అన్నదానం చేసేవారు. ఈ బసదులు యమనియమ స్వాధ్యాయన మౌనానుష్టాన జప సమాధి శీల సంపన్నులు, శాస్త్ర, సిద్ధాంత, సమయ కోవిదులు అన్ని వర్ణాలయకులు, శ్రావకులు, తుల్లకులు, క్షపణకులు అజ్జకులు గౌరవించే ఆచార్యుల ఆధిపత్యంలో ఉండేవి. వర్ణభేదం లేని మతంగా ప్రారంభమైన జైనంలో చాతుర్వర్ణ్యాలు ప్రవేశించాక హైందవ మతానికీ జైనానికీ తేడాలు తగ్గసాగాయి. హిందూ సంఘంలోలాగే జైనుల్లో కూడా తొలి మూడు వర్ణాల వాళ్ళకే దీక్షాధికారం ఉందనే పతనానికి జైనసంఘం మారిపోయింది. జైన శూద్రుడు హిందూ శూద్రుని కన్నా ఏమీ ఎక్కువ బావుకొనే స్థితిలో లేడు. సమాజంలోని అత్యధిక సంఖ్యాకులకు నిరుపయోగమైన మతం ప్రజాదరణకు నోచుకోలేదు.

భూతదయను, అహింసను బోధించే మతం యుద్ధాలవల్ల బతికే దండనాధులకు అభిమతం అయిందంటే విడ్డూరమే. ప్రతిష్టానపురం శాతవాహన రాజాస్థానంలోఉండే 52 మందియోధులు తమ పేర 52 జినాలయాలను నిర్మించారని జిన ప్రభాసూరి 'కల్ప ప్రదీపం'లో చెప్పాడు. గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగడు జైనుడే. అతని సంతతివాళ్ళూ ఆయుధోప జీవులే. పండ రంగని మనుమడు దుర్గరాజు సైనిక స్థావరమైన కటకాధిపతి. తన పేర కటకాభరణ జినాలయం కట్టించాడు. రెండవఅమ్మరాజు సామంతులలో భీమనరవాహనులు సైన్యాధిపతులే. ఈ సోదరుల విన్నపం మీదనే రెండవ అమ్మరాజు జయసేనభట్టారకులకు పెదగాదెలవర్రు దానం చేశాడు.

వేంగీదేశంలో తూర్పుచాళుక్యులలాగ సబ్బినాడులో వేములవాడ చాళుక్యులు జైనపోషకులే. కన్నమనాడులో జైనమతాన్ని స్వీకరించిన వాళ్ళు సబ్బినాడుకు వలసపోయేటంత ఆశాజనకంగా ఆప్రాంతం ఉండేది. తెలుగు కవులను కన్నడ భాషకు దత్తపుత్రులుగా ఇచ్చిన ఘనత ఆంధ్ర జైనానికే దక్కింది. కన్నడ రత్నత్రయ లోని పంప, పొన్నకవులు తెలుగులోకూడా జినేంద్రపురాణం, ఆదిపురాణం రచించి నట్టు రెండు మూడు పద్యాలను తన సంకలన గ్రంథంలో ఒక అజ్ఞాత సంధాత చేర్చాడు. పంపకవి సోదరుడు జినవల్లభుడు తెలుగు కవే. అతని గంగాధర శాసనంలో కందపద్యాలు ఉన్నాయి. ఇవే ఇప్పటికి తెలుగు భాషలో కనబడే ఆదిమ కందాలు.

పంపడు కమ్మనాడులోపుట్టి సబ్బినాడులో జీవించినా సన్యాసం స్వీకరించి శుభచంద్ర అనే పేరుతో ఇందూరు సీమలోని బోదనలో మరణించాడు. బోదన అతి ప్రాచీన జైనక్షేత్రం. పురుదేవ కుమారుడైన భరత చక్రవర్తి ఈ క్షేత్రంలో 525 ధనుస్సుల పొడుగున్న బాహుబలి శిలావిగ్రహాన్ని చెక్కించాడు. ప్రతిమచుట్టూ

కీకారణ్యం పెరిగి కుక్కుట సర్పాలు చేరాయి. అందుచేత దాన్ని కుక్కుటేశ్వరమని పిలిచేవారు. కాలక్రమాన ఆ ప్రతిమ కాలగర్భంలో కలిసిపోయిందంటారు. ఈ పౌదన పురంలోని గోమటేశ్వరుని విగ్రహాన్నిచూసే నేడు విశ్వవిఖ్యాతమైన విగ్రహాన్ని చాముండరాయలు శ్రావణ బెళగోళలో ప్రతిష్టించాడు.

ఈ పౌదన ప్రభావంవల్లనే తెలంగాణాలో జైన తీర్థంకరుల బృహత్ ప్రతిమలు కనబడతాయి. సోమదేవసూరి తెలుగు గడ్డమీద జైనగ్రంథాలు సంస్కృతంలో రాశాడు. తెలంగాణాలో మతప్రచారం చేశాడు. దాని ఫలితంగా తెలంగాణాలో జైనం విశేషంగా వ్యాపించింది. పోట్లచెరువు దగ్గర ఎన్నో జినాలయాలు, శిధిల శిల్పాలు నేటికీ కనబడతాయి. ఒకనాడు అక్కడ అయిదు వందల జైన బసదులు ఉండేవి. వీరశైవ విజృంభణలో దేవర దాసయ్య ఈ అయిదు వందల బసదుల్నీ నాశనంచేశాడు. ఈ సంగతినే పాలకురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్రలో ఇలా చెప్పాడు:

> దేవర దాసయ్య భావ జాంతకుడ
> దైవంబనుచు జైన తర్కంబు నూకి
> .......... ......................
> పాస పరిద్రట్టిల్ల చోట్ల చెర్వునను
> వసదు వేణ్ణూరును వచ్చి వైపించి
> వెస జిన ప్రతిమల విటతాటమాడి
> యెసగునాడే జైను లెక్కడ ననిరి ?

(పండి–1–పుట 590)

పోట్లచెరువు జైనులు ఎక్కడి కెళ్ళారోగాని రాజ రాజ నరేంద్రుడు రాజమండ్రిలో జైనులను హింసించినపుడు వాళ్ళు కాందిశీకులై కాకతీయుల శరణుజొచ్చారు. కాకతీయులు తొలినుంచీ జైనులే. వాళ్ళ వంశ పురుషుడు మాధవవర్మ యక్షేశ్వరీదేవి దయవల్ల సైన్యసంపదను పొందాడని మేడరాజు గోవిందపురం శాసనంలో ఉంది.

> అష్టౌ సహస్రాణి మతం గజానాం
> దశాశ్వ కోటీరమితం పదాతిం
> జినాజ్ఞయా మాధవ చక్రవర్తీ
> యక్షేశ్వరీ దత్తనరాత్స లౌఖే

ఈ శ్లోకంలోని యక్షేశ్వరి ఎవరైనా కాకతీయులు తొలి దగ్గర్నుంచీ దిగంబర జైనాభిమానులని తెలుస్తూంది. దిగంబర జైనులే శాసన దేవతలలో షోడశ విద్యాదేవులను చిత్రిస్తారు. (శ్వేతాంబరులు మూడవపాలు కూడా వాడరు.) హేమచంద్రుడు చెప్పిన షోడశ విద్యాదేవుల పేర్లు ఇవి:

| | |
|---|---|
| 1. రోహిణి | 9. గౌరి |
| 2. ప్రజ్ఞాప్తి | 10. గాంధారి |
| 3. వజ్ర శృంఖల | 11. సర్వాస్త్ర మహాజ్వాల |
| 4 కులిశాంకుశ | 12. మానవి |
| 5. చక్రేశ్వరి | 13. వైరోట్య |
| 6. నరదత్త | 14. అచ్ఛుప్త |
| 7. కాళి | 15 మానసి |
| 8. మహాకాళి | 16 మహామానసిక |

ఈ షోడశ దేవులే తంత్ర విద్యలో ప్రవేశించారు. పూజలు పొందుతున్నారు. కాకతీయులు పూజించిన యక్షేశ్వరి ఆదిలో చక్రేశ్వరి కావచ్చు. పద్మాక్షిగా ప్రచారంపొందింది. వరంగల్లులోని పద్మాక్షి గుడిలోఉన్నదిమాత్రం వేరే దేవత. జైనవిగ్రహాలకువేరేపేర్లు పెట్టి పూజించడం తెలుగువాళ్ళకి కొత్తకాదు. దానవులపాడులోని పార్శ్వనాథ విగ్రహానికి 'ఎల్లయ్య' అనేపేరు పెట్టి నేడు సంతానంకోసం పూజిస్తున్నారు జానపద గేయాలు ఆ విగ్రహానికి చేసే జాతరలో వినిపిస్తాయి. ఈ పూజలు చేసేది జైనులు కాదు. జైనుల సంహారాన్ని సహించిన హిందువులే అని చరిత్రకారు డొకాయన ఎత్తిపొడుస్తున్నాడు.

దానవులపాడు నిజంగా జైనుల శ్మశానం. సల్లేఖన కోసం అక్కడ యతులు శ్రావకులు పలుప్రాంతాలనుంచి కోరి చేరేవారు. శైవుల భృగుపాతాన్ని ఖండించిన సోమదేవసూరి ఈ జైనాచారం సంగతి మర్చిపోయినట్టుంది. పరులదోషాలను పరుషంగా ఖండించే జైనులు తమ ముప్పు కొనితెచ్చుకొన్నారు. ఒకవంక వైష్ణవులు, మరొకవంక వీరశైవులు, ఇంకొక పక్కనుంచి వైదిక మతాభిమానులు జైనంపై విరుచుకుపడ్డారు హంపీనగరాన్ని బుక్కరాయలు స్థాపించుతున్నప్పుడు అక్కడ వైష్ణవులకూ జైనులకూ చాలా వివాదాలు ఏర్పడ్డాయి. భవ్యులను భక్తులు దారుణంగా,అన్యాయంగా చంపేస్తున్నారని బుక్కరాయలకు జైనులు మొరపెట్టుకొన్నారు. వాళ్ళ వివాదాన్ని సామరస్యంతో పరిష్కరించాడు.

కన్నడ శాసనాలలో జైనులకు భవ్యులనే పేరు కనబడుతుంది. తెలుగుదేశంలో కూడాఈ పేరు ప్రచారంలో ఉండేదని చెప్పవచ్చు. పాల్కురికి సోమనాథుడు తన రచనల్లో జైనుల్ని ఎప్పుడూ 'భవి' అనే పేర్కొంటాడు. వాళ్ళంటే ఎప్పుడూ రోత ఉండాలన్నది అతని మతం.

శివభక్తులయెడ భయమును
శివునెడ నతి వీరగుణము శీలంబులయం
దవికల్పంబును చలమును
భవియెడ రోతయును వలయు భక్తులకెందున్.

(అనుభవ–58)

అని అనుభవసారంలో చెప్పాడు. వర్ణభేదాలు పాటించి హీనవర్ణాల పట్ల ఉదాసీనత చూపించే మతంపై సాధారణులకే సద్భావం ఉండదు. వీరగుణం భక్తుల కుండాలనే మతంవాళ్ళు రోత పెంచుకోక ఊరుకొంటారా? వీరశైవంలో భక్తులకు జాతిభేదాలు లేవు. స్త్రీ పురుష విభేదాలులేవు. అంతా సమానులే. కులగోత్రాల ప్రమేయంలేదు. కలిమి లేముల పట్టింపులేదు. చదువు సంధ్యల అవసరం అంతకన్నా లేదు. శివభక్తుడైతే చాలు; శివుడికన్నా గొప్పవాడు. ఇటువంటి మతబోధనలో జనులు జైనులపై ధ్వజమెత్తడంలో వింతలేదు. దేవర దాసయ్యలాంటివాళ్ళు అంతేచేశారు. కాకతీయ గణపతిదేవుడూ జైనసంహారం చేయించాడు. అయితే సంఘంలోవున్న తారతమ్యాలు నిర్మూలించి సమానత్వాన్ని ప్రతిపాదించే వీరశైవ బోధనలవల్లకాదు. వైదిక మతావలంబియైన తిక్కనగారి వాదపటిమవల్లనే.

ముఖంమీద కోపంకొద్దీ ముక్కుకోసుకొన్న సామెతలాగ జైనులమీద పగతో ఆంధ్రదేశం ఆనాటి సాహిత్యాన్ని అక్షరాలా మంటకలుపుకొంది. తమిళ భాషలో ఎన్నో జైనకావ్యాలు ఉండగా తెలుగులో ఏమీ దక్కలేదంటే ఆనాటి ఆంధ్రుల దురహంకారమే అందుకు కారణం. మల్లికార్జున పండితారాధ్యుడు ఇతర మతాల పుస్తకాలను తగలబెట్టమని ఆదేశించాడు.

శివనిందచేసే పాపులను ఆలోచించకుండా చంపివెయ్యాలి. శివనింద చేసే అవమానకరమైన పుస్తకాలను విచారించకుండా తగలబెట్టివెయ్యాలి. ఆ పుస్తకాలను చెప్పినవాణ్ణి చంపివెయ్యాలి అని 'శివతత్త్వసారం'లో స్పష్టంగా ఆజ్ఞాపించాడు.(275 6)

(శివతత్త్వసారాన్ని 1968లో పునర్ముద్రించిన ప్రకాశకులు ఈ పద్యాలలో గ్రంథపాతాలు ఉన్నాయని నమ్మింపజేయడానికి అక్కడక్కడ చుక్కలు పెట్టారు. ఆదిలో కొమర్రాజువారు పరిష్కరించిన ప్రచురణలో ఈ రెండు పద్యాలు సంపూర్ణంగా ఉన్నాయి. మేధావులుసైతం ఇలాంటి స్థితికి దిగజారబట్టే మన సాహిత్యలోకం అనారోగ్యవంతంగా ఉంది.)

చాప చిరిగినా చదరంత అని ఎంత విధ్వంసం జరిగినా తెలుగు జీవితంపైనా, తెలుగు సాహిత్యంపైనా జైనప్రభావం తగుమాత్రం మిగిలిపోలేదు. తెలుగువాళ్ళ మొదటి ఛందోగ్రంథం జైన రచనే. అది మల్లియ రేచన రాసిన కవిజనాశ్రయం. దీనిని లాక్షణికులు భీమనఛందం అని పేర్కొన్నారు. వేములవాడ భీమకవి దీనిని రాసి రేచన పేరుపెట్టాడనే అపప్రథ చాలాకాలం ప్రచారంలో ఉంది. నిజానికి శాపానుగ్రహ సమర్థుడు తిట్టుకవి అయిన భీమకవికీ దీనికీ సంబంధంలేదు. అతడు శైవుడు. జైనుడైన రేచనకు సహాయం జైనుడే చేయాలి. ప్రాణసమాన మిత్రుడీ కృతికి సహాయుడుగా ఉంటే రేచన ఈ లక్షణ గ్రంథాన్ని రాశాడు. ఆ మిత్రుడు భీమన కావచ్చు. అందుకే కవిజనాశ్రయం భీమన ఛందంగా చలామణీ అయింది. అయితే ఆ భీమన దాక్షారామ భీమకవి కాడు. పంపడి తండ్రి భీమన కావచ్చు. ఇదే నిజమైతే నన్నయగారి భారతం కన్నా కవిజనాశ్రయమే తెలుగు భాషలో ఆదిగ్రంథ మవుతుంది.

ఆంధ్రసాహిత్యం అనువాద సాహిత్యంగా ప్రారంభం కావడం చేత సమకాలిక సమాజం అందులో అట్టే ప్రతిఫలించలేదు. అయినా తొలి తెలుగు గ్రంథాలు రెండు మూడింటిలో సమకాలిక ప్రభావం కొద్దిగానైనా కనబడుతుంది. మూలఘటిక కేతన, మంచెనలాంటి వాళ్ళు జీవించినకాలంలో తెలుగు దేశంలో జైనం ఉధృతంగానే ఉంది అందుకే దశకుమార చరిత్రలో, కేయూరబాహు చరిత్రలో ఆ యిద్దరు కవులూ జైన పల్లెలను, జైన జీవితాన్నీ పేర్కొన్నారు. కేతన నీచంగానూ, మంచెన కొంచెం మంచిగానూ జైనులను చిత్రించారు. ఆంధ్ర ప్రాచీన శతకాలలో నేటికీ సజీవమైన సుమతీశతకం జైనరచనే. తెలుగులో రచించిన ఏకైక జైనకావ్యం శ్రావణ బెలగొలాలో ఉంది గాని అది ముద్రణభాగ్యం నోచుకోలేదు. ఆదిలో జైనులను నిర్గ్రంథులని పిలిచేవారు. ఆంధ్ర జైనులు మాత్రం ఇప్పటికీ నిర్గ్రంథులుగానే ఉండిపోయారు.

జైనదర్శనం నిరీశ్వరమైనా మతం మట్టుకు సంకుచితం అయింది. విగ్రహారాధన, ఆచారవిధులు పూజలు పురస్కారాలు అతివేలమై నేడు జైనానికి హైందవానికి తేడాయే కనబడదు. జైనవిశ్వాసాలు కొన్ని హిందూమతంలో కలిసిపోయాయి. కర్మసిద్ధాంతం పునర్జన్మలో నమ్మకం మొదలైనవి జైన ప్రచారం వల్లనే గట్టిపడ్డాయి. ఆంధ్రులపై జైనప్రభావం ఇంకా ఎవరూ గట్టిగా తలపెట్టని పరిశోధనా విషయం. మానవశాస్త్ర పరిశోధనా పద్ధతులపై కృషిచేస్తే తెలుగుదేశంలో జైనప్రభావం గురించి చాలా విశేషాలు వెల్లడి అవుతాయి.

ఉదాహరణకు నిత్యకల్యాణం పచ్చతోరణం అనే సామెత తీసుకొంటే ఇది జైన సంపర్కంవల్లనే పుట్టిందని చెప్పవచ్చు. జైన తీర్థంకరులకు కల్యాణోత్సవాలు జరుపుతారు. కల్యాణమంటే పెళ్ళికాదు. జన్మ మొదలు కైవల్యందాకా ఉన్న అంచెలను స్మరించే జయంతులు. జైనబసదులలో నిత్యకల్యాణాలు జరగడంబట్టి ఈ సామెత పుట్టింది. మరొక తార్కాణం. తెలుగువాళ్ళు వర్జ్యం చూడనిదే ఏ పనీ చేయరు. ఈ విశ్వాసం యాపనీయజైనులు ఆంధ్రులకు విడిచిపెట్టారు. లేపాక్షి చిత్రకళకు జైన చిత్రకళ ప్రోద్బలమని చరిత్రకారుల ఊహ.

తెలుగు పురుషులమీదకన్నా తెలుగుస్త్రీలమీద జైనప్రభావం ఎక్కువ వుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. స్త్రీల రామాయణం పాటలలో విడ్డూరాలవలె కనబడే ఘట్టాలు చాలావరకు జైన రామాయణంనుండి సంక్రమించినవే. 'రాముడికి సీత ఏమౌతుంది?' అనే నా వ్యాస పరంపరలో ఈ విషయాన్ని నేను విపులంగా చర్చించాను. రంగనాథ, భాస్కర రామాయణాలలో కనబడే అవాల్మీకాలకూ జైన రామాయణానికీ సంబంధంఉంది.

తెలుగుదేశంలో విరివిగా ప్రచారం పొందడంవల్లా, గ్రంథాలు రచించిన జైనులు తెలుగుదేశంలో నివసించడంవల్లా మహాతలవర అనేపదం జైనసూత్ర గ్రంథాలలో కనబడుతుంది. ఆచార్య హేమచంద్రుడు తన దేశినామమాలలో పేర్కొన్న వాటిలో చాలా తెలుగు మాటలు ఉన్నాయి. వీటిన్నీ తెలుగుభాషా పరిశోధకులు గుర్తించారు.

ఆంధ్రదేశంలో జైనమత చరిత్రగురించి సమగ్ర పరిశోధనలు అవసరం. ప్రాకృత సంస్కృత జైనగ్రంథాలూ, పాశ్చాత్యులు వాటిపై రాసిన వ్యాఖ్యలు, కన్నడ కావ్యాలూ నిశితంగా పరిశీలించనిదే ఇది సాధ్యంకాదు. ఆంధ్రజైనం గురించి పరిశోధించినవారిలో బుర్రా శేషగిరిరావుగారు ఆద్యులు. భావరాజు వెంకటకృష్ణారావుగారూ, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ప్రాథమిక కృషి చేశారు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు చాలా శ్రమించి ఎన్నేళ్ళ పరిశోధన ఫలితంగానో యావదాంధ్ర దేశంలోఉన్న జైన స్థావరాల గురించి విపులగ్రంథం రాశారు. బి. యస్. ఎన్. హనుమంతరావుగారు తమ 'రెలిజిన్ ఇన్ ఆంధ్ర' అనే గ్రంథంలో జైనమతం గురించి విస్తరించి రాశారు. ఇంకా చెయ్యవలసిన పరిశోధనలు ఎన్నో ఉన్నాయి. అవి ఎవరు చేస్తారో మరి!

# సిద్ధార్థి: ప్రసిద్ధార్థి

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

శ్రీ సిద్ధార్థి వినూత్న వత్సరమ! మా శ్రేయంబునే కోరుచున్
భాసింపంగదె నామసార్థకత సంభావింపఁగా నెల్లరున్
మా సంతోష సుఖంబులే యగుత! యుష్మత్సౌఖ్య సంతోషముల్
వాసిన్ గూర్పుము సౌఖ్యముల్ శుభములున్ భాగ్యంబు లాంధ్రాళికిన్.

సిద్ధార్థిరో! సుప్రసిద్ధార్థివై సమస్తార్థమ్ములం గూర్పు మతిశయముగ
దారిద్ర్య దుఃఖ సంతప్తులం జేయకు మొసఁగుమీ ఆర్థికాభ్యున్నతి కడు
అర్థ దృష్టిని బరమార్థదృష్టి నొసంగి ఇహపరసుఖముల నీయఁజూడు
సంకుచితం బగు స్వార్థ దృష్టిని బాపి సమకూర్పుము పరార్థ విమలదృష్టి.

నీతి ధర్మ విశేష విఖ్యాత సత్య
సచ్చరిత్ర పెంపొందింపు జనుల కెందు
దూర మొనరింపు మీ దూష్య దుష్టబుద్ధి
అమలు సిద్ధార్థిరో! ప్రసిద్ధార్థి వగుము.

కాలంబె దైవంబు కాలాంశ వగు నీవు దైవాంశ వగుట తథ్యంబు నీవు
నూతనాబ్దమవో పురాతనాబ్దమవో వినూతనత్వం బెందొ చూతుముగద!
చర్విత చర్వణ చరితమే నీదైన విస్మృత సాగర వీథిఁ బడుదు
వంతియే నీగతి యర్వదేండ్లకు మఱియొకసారి నీరాక ఉర్విపైకి.

ఉన్ననాల్నాళ్లు పదిమంది కుపకరించి
సార్థకాభిఖ్యతోఁ ప్రశస్తముగ మనుము
ప్రజలకందఱి సంతోష పఱుపఁగనుము
అమల సిద్ధార్థిరో! ప్రసిద్ధార్థి వగుము.



డాక్టర్ బి. ఆర్. కె. రావు

# ఆర్థిక ప్రణాళికా రచన ఆశయాల విజయం!?

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడపిన జాతీయ, సోషలిస్టు శక్తులు ఇద్దరూ, స్వతంత్ర భారతంలో వేగంగా ఆర్థికాభివృద్ధిని సాధించి, పేదరికాన్ని పారద్రోలాలని ఆశించారు. జాతీయవాదులు ఆర్థిక వృద్ధిని సాంఘిక న్యాయంతో కలిపి సాధించాలని ఎంచగా, సోషలిస్టులు ఆర్థికాభివృద్ధిని, ఆర్థిక సమానత్వాన్ని ఏకోన్ముఖంగా సంప్రాప్తం చెయ్యాలని వాంఛించారు. అందువల్ల ఆర్థికంగా అల్పాభివృద్ధి స్థితిలో ఉన్న స్వతంత్ర భారతదేశంలో, జాతీయ ప్రభుత్వం, ఆర్థికాభివృద్ధితో పాటు ఆర్థిక న్యాయాన్ని వేగంగా సాధించి ప్రపంచ దేశాలమధ్య తన బలాన్ని, పరువు ప్రతిష్ఠల్ని ఇనుమడింప జేసుకోవడానికి ఆర్థిక ప్రణాళికా రచనను చేసి అమలు చేయడానికి పూనుకుంది. అసలీ ఆర్థిక ప్రణాళికా రచన సాధారణోద్దేశ్యాలేమిటి? భారతదేశంలో ప్రణాళికా రచన ఆశయాలేమిటి? తెలుసుకుందాము.

## సాధారణ ఆశయాలు :

ఆర్థిక ప్రణాళికా రచనను అమలు చేయడం ద్వారా వివిధ దేశాలు విభిన్న ఆశయాలను సాధించడానికి ప్రయత్నిస్తాయి అయినా అవన్నీ కూడ (1) ఆర్థిక జీవితం నిలకడగా సాగడాన్ని (2) ఉత్పత్తి సమర్థవంతంగా సాగడాన్ని (3) పంపిణీ న్యాయ సమ్మతంగా—అనగా సమత్వంతో కూడి సాగడాన్ని—సాధించడానికి కృషి చేస్తాయి. విల్ హెల్మ్ కైల్ హా తన "ప్రిన్స్‌పుల్స్ ఆఫ్ ప్రయివేట్ అండ్ పబ్లిక్ ప్లానింగ్" (పే. 50) అనే గ్రంథంలో ప్రణాళికా రచన ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుంటుందని వ్రాసారు : (1) మనం భవిష్యత్తులో సంతృప్తి పర్చుకోదలచిన కోర్కె స్వభావము (2) ఈ వాంఛను సంతృప్తి పర్చుకోదలచిన కాలము (3) ఈ కోర్కెను సంతృప్తి పర్చడానికి కావలసిన భౌతిక వస్తువులు, పరసనల్ సేవలు (4) ఈ వస్తువులను, సేవలను ఉత్పత్తి చేయడానికి, సమకూర్చడానికి తగిన పద్ధతి (5) సాధించ నెంచిన ఫలితాలను పొందడానికి చేయవలసిన త్యాగాలు (6) సాధించ నెంచిన ఫలితాలకు, అందుకు చేయవలసి వచ్చే త్యాగాలకు మధ్య పరసనల్ లేక సాంఘిక ప్రమాణాన్ననుసరించి సమతౌల్యాన్ని ఏర్పర్చుట (7) ఈ ఫలితాల సాధనకుగాను అమలు జరపాలనిగాని, ఆపివేయాలని గాని ఎంచబడిన కార్యక్రమాలకు సంబంధించిన తీర్మానము (8) ఈ తీర్మానం ధనాత్మక (పోజిటివ్) మయితే, దాన్ని అమలు జరపడానికి తగిన ప్రణాళిక. బి. సి. ఘోష్ తన "ప్లానింగ్ ఫర్ ఇండియా" (పే.1,2, 6–7) అనే గ్రంథంలో ఆర్థిక ప్రణాళికా రచన ప్రధాన ఆశయాలు (1) స్వల్పకాలీన వ్యవధిలోనే కాకుండా దీర్ఘకాలీన వ్యవధిలో సహితము ఉత్పత్తి, పంపిణీలను ఒక సాంఘికోద్దేశ్యాన్ని నెరవేర్చడానికి నిర్వహించడము (2) సంపూర్ణ ఔద్యోగితను, ప్రజా జీవన ప్రమాణాల్లో పురోగామిక మెరుగుదలను సాధించడము (3) దేశాన్ని పారిశ్రామికీకరణ చేయడము అని వ్రాశారు. మొత్తం ఆర్థిక వ్యవస్థ అంతటిమీద అనగా ఉత్పత్తి, వినియోగము, పంపిణీ, ద్రవ్యము మొదలైన వాటిమీద సంపూర్ణంగా నియంత్రణ చేయడము సంపూర్ణ ప్రణాళికాయుక్త ఆర్థిక వ్యవస్థ అవుతుందని ఆర్.వి. రావు తన "ఎకనమిక్ ప్లానింగ్ ఇన్ ఇండియా" (పే. 10) అనే గ్రంథంలో వ్రాసారు. ప్రజల జీవన ప్రమాణాలను మెరుగుపర్చడము, ఆర్థిక వనరుల్ని బహుముఖంగా అభివృద్ధిచేసి ప్రజలకు బహుముఖ సంతృప్తిని, సంపూర్ణ జీవితాన్ని అనుభవించే అవకాశాలను ఏర్పర్చడము ప్రణాళికా రచన ఆశయమని పి. ఏ. వాడియా, మర్చెంట్ వ్రాశారు. వీలైన గరిష్ఠ స్థాయికి ఉత్పత్తిని పెంచి, ప్రజల జీవన ప్రమాణాలను పెంచడం ప్రణాళికా రచన ప్రధానోద్దేశ్యమని ఆర్దేషీర్ దలాల్ వ్రాసారు. వివిధ రకాల ప్రణాళికా రచనల ముఖ్యోద్దేశ్యాలీ విధంగా ఉంటాయి : (1) ప్రణాళికాధికార సంస్థ ముందుగానే కొన్ని ఆశయాలను, అదను గుణ్యమైన లక్ష్యాలను ఏర్పరచుకుని వాటి సాధనకు జరుగుతున్న వివిధ ప్రయత్నాలను సమన్వయ పరుస్తుంది. దేశంలోని సాంఘిక—ఆర్థిక చట్టాన్ని, అవసరాలను, ఆనాటికున్న లోపాలను, ఆర్థిక చెడును దృష్టిలో ఉంచుకుని ప్రణాళికాధికార సంస్థ ఆశయాలను, ఉద్దేశ్యాలను ఏర్పరుస్తుంది. (2) ఆర్థిక ప్రణాళికా రచన కనిష్ట ఖర్చులతో ఉత్పత్తి నిర్వహణను సంభవంచేయడానికి ఉద్దేశిస్తుంది. ఇందువల్ల ఎక్కువఉత్పత్తి చేయడంద్వారా ఖర్చులను తగ్గించడానికి, వినియోగస్థాయిని పెంచడానికి కృషిచేస్తుంది. ఈ విధానంద్వారా ఉత్పాదక సామర్థ్యాన్ని పెంచాలని ముందుగానే నిర్ణయించబడుతుంది. (3) వస్తువులు, సేవలు, అవకాశాల సప్లయి, డిమాండ్ల మధ్య ఎక్కువ అనుగుణ్యమైన సర్దుబాటు చేయడానికి నిర్ణయం జరుగుతుంది. ప్రణాళికాబద్ధంగాని ఆర్థిక వ్యవస్థలోని చెడునంతటిని తొలగించడానికి ఈ నిర్ణయం అవసరం. డిమాండ్ సప్లయిల మధ్య మరింత సర్దుబాటు జరిగితేనేగని ఆదాయ, అవకాశ, జీవన ప్రమాణాలను సమంగా లభ్యం చేయడానికి వీలుకాదు.

## ఆశయాలమధ్య పోటీ :

అశోక్‌మెహతా వ్రాసిన 'ఫేసెట్స్ ఆఫ్ ప్లానింగ్' అనే గ్రంథం (పే 57-67) లోని రైవల్ ఆబ్జెక్టివ్స్ ఇన్ ప్లానింగ్ అనే అధ్యా

యంలో ఉదహరించబడిన వివిధ అర్థశాస్త్రవేత్తల అభిప్రాయాలను పొందుపర్చడంద్వారా ఆశయాల మధ్యనున్న పోటీ ఎలా ఉంటుందో తెలిసికొందాము. (1) ఎక్కువ ఉత్పత్తి, ఎక్కువ ఔద్యోగిత కావాలనే ఆశయాలమధ్య పోటీ ఉంటుంది. (ఎ) ఆర్థికవృద్ధి తేవడానికి అవసరమైన త్యాగము వినియోగాన్ని మాని మాట్లాడకుండా ఉండటం రూపంతోనే గాక అనవాయిగా వస్తున్న జీవనాన్ని, ఉద్యోగాన్ని చెదరగొట్టినపుడు అనుభవించవలసిన కష్టంరూపంలో కూడా ఉంటుందని డెన్నిస్ రాబర్ట్‌సన్ వ్రాసారు. ప్రణాళికా రచనలోని వివిధ భాగాలలో అనేక మార్పులు సంభవం కావచ్చు. ఆర్థికాభివృద్ధిలోని ఔద్యోగితా విషయాన్ని పరిశీలించినపుడు, అంతకంటె ఔద్యోగితా దృష్టిని పరిశీలించినపుడు అనవాయిగా వస్తున్న జీవన, ఔద్యోగితల తీరులో వచ్చే మార్పును గమనించగలము. ఆర్థికాభివృద్ధి నిర్వహణకు నిరుద్యోగులను, అల్పఔద్యోగితలో ఉన్న వారిని సమీకరించినపుడు ఆ తీరులో వచ్చే మార్పు కన్పిస్తుంది. (బి) జనాభావృద్ధి రేటును అధిగమించగల పెట్టుబడి రేటుకు ఆర్థిక వ్యవస్థ పూనుకోకపోవడంవల్ల వచ్చున్న నిరుద్యోగితా సమస్య ఏర్పడుతుంది అని సి. యన్. వకీల్ వ్రాసారు. ప్రణాళికల్లో ఎటువంటి పెట్టుబడి చేయడానికి సలహా ఇవ్వాలనే విషయాన్ని గూర్చి రెండుసార్లు ఆలోచించాలి. భారీపరిశ్రమలకు ప్రాధాన్యత నిచ్చినట్లయితే సంబద్ధీకరణ జరగడంవల్ల ఉత్పాదనకు సాంకేతిక మార్పులు తేవడంవల్ల, మూలధనసాంద్ర పద్ధతుల్ని అవలంబించడంవల్ల నిరుద్యోగిత ఎక్కువగా ఏర్పడుతుంది. కాగా చిన్నతరహా పరిశ్రమలను, శ్రామిక–సాంద్ర పరిశ్రమలను అవలంబించినట్లయితే వేగంగా ఆర్థికవృద్ధిని సాధించడానికి ఆటంకాలు కాగలవు. రెండు పద్ధతుల్ని ఏకోన్ముఖంగా నడిపించడంవల్ల ఔద్యోగితా విస్తృతికి ఆటంకం రాకుండా ఆర్థికవృద్ధి వేగంగా సాధించబడుతుంది. ఈ అభిప్రాయంపై ఆలోచన సాగిస్తున్నప్పుడు, "అభివృద్ధి నిరుద్యోగితను పెంచుతుందని వాదించబడుతోంది. ఆర్థిక పురోగమనం ప్రవేశ పెట్టే మార్పులు సాంప్రదాయ సాంఘిక సంస్థలను మార్చడంవల్ల, వచ్చున్న నిరుద్యోగిత బట్టబయలవుతుంది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, కుటుంబ జీవితము బీటలు వారుతాయి. ఉద్యోగాన్వేషులై గ్రామీణులు గ్రామాలనుండి బయటకు పోతూఉంటారు" అనే వాజ్మూలాన్ని గూర్చి జాగ్రత్తగా ఆలోచించాలి (సి) అల్పాభివృద్ధి ఆర్థిక వ్యవస్థల్లో ఔద్యోగితా సమస్య పరిమాణంలో పెరుగుతూ పోయూ ఉంటుంది. ఆర్థికాభివృద్ధి పురోగమనంలో భౌతిక, మానసిక వాతావరణం మారడంవల్ల, పాత సాంఘిక వ్యవస్థ అవశేషాలు తనలో బ్రతుకుతున్న అధిక శ్రామికుల్ని బయటకు పంపివేస్తాయి మరో మాటల్లో చెప్పాలంటే ఆర్థికవృద్ధి అర్థికమార్పు జరిగినప్పుడు, జనాభా పెరగక పోయినా ఔద్యోగితను కోరే శ్రామికుల సరఫరా నాటికి పెద్ద రేటులో హెచ్చుగా ఉంటుంది అని కె. యన్. రాజ్ వ్రాసారు. అందువల్ల నిరుద్యోగితా సమస్యనంతటిని తీర్చడానికి పెద్ద ఎత్తున పెట్టుబడి అవసరము. అయితే వివిధ రంగాలలో ఔద్యోగితావకాశాలను అనుపాత రీతిని, సంతులన రీతిని పెట్టుబడులు పంచబడటము జరగవచ్చు. (డి) గ్రామాలలో ఉన్న అధిక శ్రామికు

ఇంకా ఇలా చెప్పారు. "మూలధన సంచయనానికి పనిలేకుండా ఖాళీగా ఉన్నకాలము మంచి మూలము. అధిక సంఖ్యతో కూడి ఉన్న రైతు సమూహాల్లో అధిక శ్రామికుల రూపంలో ఖాళీ సమయం కన్పిస్తు ఉన్నది. ఈ అధిక శ్రామికుల్ని ప్రస్తుత పని నుండి మూలధనం చేసే పనికి మార్చడంవల్ల ఇప్పుడనుభవిస్తున్న హీన జీవన ప్రమాణాల్లో జరిగే సహించరాని త్యాగమేమీ ఉండదు. వ్యవసాయరంగంలో పని చేస్తున్న ప్రతి ఒక్కరు కూడా కొంతకాలాన్ని మూలధనంచేసే

పని చేస్తున్న ప్రతి ఒక్కరు కూడా కొంత కాలాన్ని మూలధనంచేసే

పనిచేయడానికి వినియోగించవచ్చు." ఈ అధిక శ్రామికుల్ని గ్రామాల్లో ఉపయోగించడానికి చాలా మార్గాలు సూచించబడినవి. అయితే ఈ సూచనలన్నింటి ఉద్దేశ్యము, ఆశయము ఒకటిగానే కన్పిస్తుంది. తక్కువ పెట్టుబడిద్వారా ఎక్కువ ఔద్యోగిత ఆ ఆశయమని చెప్పవచ్చు. ఔద్యోగిత, పెట్టుబడి అని రెండు మార్గాలుగా కాక ఔద్యోగిత సమకూర్చే పెట్టుబడి అనేది ఒకే ఒక మార్గంగా ఉండాలి.

(2) సాంఘిక సేవకు, పరిశ్రమకు మధ్య వచ్చే పోటీ రెండవది. (ఎ) "ప్రజల సంక్షేమాన్ని పెంపొందించడానికి చేసే పెట్టుబడి అత్యంత లాభదాయకమైనదని వాదించవచ్చు. ఆరోగ్యాన్ని విద్యను, గృహవసతిని పెంచడం మంచి పౌరులను ... ... ... ... మంచి నైపుణ్యము, ఉత్పాదకతాశక్తి గల శ్రామికుల్ని తయారు చేయడానికి తోడ్పడుతుంది" అని అశోక్ మెహతా వ్రాసారు. దీనినే "మనుష్యులపై పెట్టుబడి చేయడము" అని జవహర్‌లాల్ నెహ్రూ అన్నారు. పై వాజ్మూలాన్ని కాదనడానికి వీలుకాదు. ఇతర కారణాలతో పాటు, తక్కువ కేలరీ శక్తిగల ఆహారాన్ని తీసుకోవడంవల్ల శ్రామికుల్లో అసమర్థత, బద్ధకము, అనుపస్థితి (ఆబ్సెంటీయిజము), వ్యాధి, త్వరగా అలసిపోవడము వంటి ప్రవృత్తులు కన్పిస్తున్నవి. అల్పాభివృద్ధి దేశాల్లో ఇప్పుడు తీసుకునే సగటు కేలరీశక్తి (2100 కేలరీలు రోజుకు)ని ఇరవై ఒక్క శాతం హెచ్చిస్తే ఉత్పత్తి యాభై శాతం పెరుగుతుందని నిపుణులంటున్నారు. 1942 కి 1945 కి మధ్య జర్మనీలో క్రాట్, ముల్లర్ అనేవారు జరిపిన అధ్యయనాలవల్ల లోపలికి తీసుకునే ఆహారంలోని కేలరీ శక్తికి, ఉత్పాదకతకు ప్రత్యక్ష సంబంధమున్నదని తేలిందని హారీ లైబెన్‌స్టైయిన్ తన 'ఎకనామిక్ బాక్‌వర్డ్‌నెస్ అండ్ ఎకనామిక్ గ్రోత్' (పే. 65) అనే పుస్తకంలో వ్రాశాడు. (బి) సంతులితమైన మంచి ఆహారం విషయంలో నిజమైనదంతా, కొంతవరకు, విద్య, ఆరోగ్యము, వినోద సౌకర్యము, గృహవసతి మొదలైన సాంఘిక సంక్షేమానికి సంబంధించిన విషయాల్లో నిజమే. "విద్యారీత్యా వెనుకబడి ఉన్నదేశాలకు, అదే రీత్యా పురోగమించిన దేశాలకు మధ్య ఆర్థిక ప్రగతి రేట్లలో కన్పిస్తున్న వ్యత్యాసాలు, రైతు – వ్యవసాయ దేశాలను, పట్టణ–పారిశ్రామిక దేశాలుగా మార్చడానికి అక్షరాస్యత, విద్య ప్రసారితం కావాలని తెలియచెబుతున్నవి' అని వైలె డబ్ల్యూ షెప్పన్ తన 'అండర్ డెవలప్డ్ ఏరియా' (పే. 113) అనే గ్రంథంలో వ్రాశాడు. మానవ శక్తికి సర్వ సౌకర్యాలు, సాంఘిక సేవలు సమకూర్చాలనే అభిప్రాయానికి అనుకూలంగా యింకా

రంగాలలో శ్రామిక సామర్థ్యాన్ని, ఉత్పాదనను పెంపొందించడానికి వివిధసౌకర్యాలను, అల్పాభివృద్ధి ప్రాంతాల్లో శ్రామికులకెలా లభ్యం చెయ్యాలా అనేదే పెద్ద ప్రశ్న. ఎక్కడ నుండి ప్రాణ ప్రదాతలైన అర్ధ ద్రవ పదార్థాలను శ్రామికుల వద్దకు ప్రవహింప చేయాలి? ప్రభుత్వ సహాయంతోపాటు వ్యవసాయ, పారిశ్రామిక రంగాలిందుకు తోడ్పడాలి. అయితే ఈ రంగాలు అభివృద్ధిచెందితే మినహా సాంఘిక సేవలు పెరిగే అవకాశం తక్కువ. అందువల్ల సాంఘిక సేవ, పరిశ్రమల మధ్య ఎంపిక కాకుండా సాంఘిక సేవను, పరిశ్రమను కలిపి ఏకోన్ముఖంగా ఎంపిక చేయడం మన నిర్ణయమౌతుంది. మనం చేసేఎంపిక ఎంతవరకు సమంజసమో, అంతవరకే ప్రణాళికా రచన విజయవంత మౌతుంది. ప్రణాళికా రచనలోని ప్రత్యామ్నాయ విషయాల మీద వివిధ ఆలోచనలమధ్య పోటీ ఉండవచ్చు. ఆర్థికవృద్ధికి సంబంధించినంతవరకు మాత్రం రెండు అభిప్రాయాలుండటానికి వీలులేదు. ఆర్థికవృద్ధిద్వారా ఆర్థికాభివృద్ధిని పొందడం ఆర్థిక ప్రణాళికా రచన ప్రధాన ఆశయమవ్వడమే ఇందుకు కారణము.

## కేంద్ర ఆశయము :

భారత కేంద్ర ప్రభుత్వము ప్రచురించిన ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ప్లానింగ్ కమిషన్ ప్రణాళికా రచన కేంద్ర ఆశయాన్నీ విధంగా ప్రకటించారు : (1) ప్రజల జీవన ప్రమాణాలను పెంచి వివిధ రకాల సుఖానుభూతుల్ని కల్గించి జీవితాన్ని మరింత సంతోష ప్రదం చెయ్యాలి. ఇందుకుగాను అందుబాటులో ఉన్న మానవ, భౌతిక వనరుల్ని మరింత సమర్థవంతంగా ఉపయోగించి, మరిన్ని వస్తువుల్ని, సేవల్ని ఉత్పత్తిచేసి, తగిన పంపిణీ ద్వారా సంపద, ఆదాయ, అవకాశాల లభ్యతలో అసమానత్వాలను తొలగించాలి. (2) ఆర్థికాభివృద్ధి ప్రథమ దశల్లో ఉత్పత్తిని హెచ్చించే ప్రణాళిక రచనమీద జోరు చూపాలి. ప్రణాళికా రచనను అనుసరించే ప్రారంభ దశల్లోకూడా అప్పటికున్న సాంఘిక – ఆర్థిక చట్టం లోపలే ఆర్థిక కార్యక్రమాన్ని తీవ్రతరం చేసే ప్రయత్నంతో సరిపెట్టుకోకూడదు. అసలు అప్పటికున్న సాంఘిక ఆర్థిక చట్టాన్ని పునఃనిర్మాణం చేయడం ద్వారా సమాజంలోని మనుష్యులందరికి రోజురోజుకు హెచ్చుగా విద్య, అశక్తతను కల్గించే వ్యాధి మొదలైన వ్యతిరేక శక్తులనుండి భద్రతను, తగిన ఆదాయాన్ని ఔద్యోగితను లభ్యపర్చాలి. (3) గరిష్ట ఉత్పత్తిని, సంపూర్ణ ఔద్యోగితను, ఆర్థిక సమత్వాన్ని, సాంఘిక న్యాయాన్ని సాధించాలి. ప్రస్తుత పరిస్థితుల్లో పరస్పర సంబంధంగల ప్రణాళికా రచన ఆశయాలుగా ఇవి గుర్తింపబడినవి. దేశం వీటి సాధన కొరకు తప్పక ప్రయత్నించాలి. అయితే ప్రారంభదశల్లో వీటన్నిటిని ఒక్కతిఫాగా సాధించ నెంచడము అవాస్తవిక దృష్టి క్రిందకి వస్తుంది. పరిమిత కాలవ్యవధిలో ఒక ఆశయం మరొక ఆశయంతో పోటీ పడుతుంది. అందువల్ల జాగ్రత్తగా ఆలోచించి పూర్వ నిర్ణయం ప్రకారం ఆశయ సాధనకు [illegible] పూనుకోవాలి. పనిలేకుండా ఉన్న మానవ శక్తినంతటిని పూర్తిగా ఉపయోగించడం ప్రణాళికా రచన ప్రధాన ఆశయంగా ఉండాలి. కాని ద్రవ్యోల్బణ స్థితి

అసమానత్వాలను తగ్గించే ప్రయత్నపు నడకను జాగ్రత్తగా సర్దుబాటు చేసుకోవాలి. ఆర్థిక సమానత్వ సాధన అనే అంతిమ లక్ష్యం మంచిదే. కాని దీని సాధన కవలంబించే విత్త ఆది చర్యలు ఉత్పత్తి కార్యక్రమాలను చెదరగొట్ట కూడదు; క్రమబద్ధమైన ఆర్థిక వృద్ధికి ఆటంకం కారాదు. (5) ప్రణాళికా రచన ద్వారా వివిధ రంగాలన్నింటా ఏకోన్ముఖ పురోగమనం సాగించాలనడం ముఖ్యోద్దేశ్యమే. అయితే దేశంలో ఉన్న వనరులు పరిమితం కాబట్టి పూర్వనిర్ణీత ప్రాధాన్యతా క్రమాన్ననుసరించి అత్యవసర కార్యక్రమాలను ముందుగా చేబట్టి, ప్రతి కార్యక్రమంలోను పెట్టుబడి చేసిన వనరుల్ని గరిష్ట ఫలితాలను సాధించేటట్లు ఉపయోగించాలి. (6) పై ఆశయాల సాధనలో చాలావరకు ముందుకు పోవడము, చాలా వేగంగా ముందుకు పోవడము ఎంత ప్రమాదమో, తగినంత వేగంగా ముందంజ వేయకపోవడం కూడా అంతే ప్రమాదకరం. ప్రధానమైన వ్యవస్థా చట్ట సంబంధమైన మార్పుల శక్తి క్రింద ఐక్యతను ప్రదర్శించడానికి సమాజం ఎంత గొప్ప శక్తిని ప్రదర్శిస్తుందో అంత వేగంతో ఆర్థిక వ్యవస్థ ముందంజ వేయగలుగుతుందని బ్రిజ్ గోపాల్‌గుప్త తన 'ఫస్ట్ ఫయివ్ ఇయర్ ప్లాన్ యల్ఫ్రీడ్' అనే గ్రంథంలో వ్రాసారు.

## మొదటి ప్రణాళిక ఆశయాలు :

భారతదేశపు ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఆశయాలీ విధంగా ఉన్నవి : (1) రెండవ ప్రపంచ యుద్ధంవల్ల, దేశవిభజనవల్ల ఆర్థిక వ్యవస్థలో ఏర్పడ్డ అసమతౌల్యాన్ని సరిదిద్దుట (2) ఆర్థిక వ్యవస్థను భవిష్యత్తులో తగినట్లుగా ఉంచేందుకు [illegible] ఆర్థిక వికాసప్రక్రియను, సంతులన ఆర్థిక వృద్ధి కార్యక్రమాలను ప్రారంభించుట (3) ఆహార పదార్థాల ఉత్పత్తిని, ముడి పదార్థాల ఉత్పత్తిని పెంచుట (4) ఆర్థిక సాంఘిక వ్యవస్థాపనలను సృష్టించడానికి, ఔద్యోగితావకాశాలను పెంచడానికి పథకాలను అమలు జరుపుట. ఇందుకుగాను రవాణా, నీటిపారుదల సౌకర్యాలను ఏర్పరచుట, బహూళార్థసాధక నదీ లోయ పథకాలను అమలు జరుపుట. (5) సాంఘిక సేవాసౌకర్యాలను విస్తృతంగా ఏర్పర్చుట (6) [illegible] అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరిపేందుకు, [illegible] పరిపాలనా యంత్రాన్ని ఏర్పర్చుట. (7) ద్రవ్యోల్బణాన్ని అరికట్టుట (8) రాజ్యాంగ నిర్దేశకసూత్రాల ప్రకారం సాంఘికన్యాయాన్నేర్పర్చుట. (9) రైల్వేలలోచెడిన పెట్టెలను బాగు చేయుట.

## రెండవ ప్రణాళిక ఆశయాలు :

రెండవ పంచవర్ష ప్రణాళిక ఆశయాలిలా ఉన్నవి : (1) [illegible] జీవన ప్రమాణాలను పెంచడానికి జాతీయాదాయాన్ని తగిన పరిమాణంలో పెంచుట (2) [illegible] మీద జోరు పెట్టి వేగంగా దేశాన్ని [illegible] (3) ఔద్యోగితావకాశాలను విస్తారంగా పెంచుట [illegible] ఆదాయాలలోని అసమానత్వాలను తగ్గించి, ఆర్థికశక్తి [illegible]

## మూడవ ప్రణాళిక ఆశయాలు :

మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికలను అమలు జరపడం వల్ల ఏర్పడిన అనుభవాలను పురస్కరించుకుని, మూడవ పంచవర్ష ప్రణాళిక ఆశయాలివిధంగా ఏర్పర్చబడినవి : (1) జాతీయాదాయంలో సాలీనా 5 శాతం వృద్ధిని ఏర్పర్చుట. ముందొచ్చే పంచవర్ష ప్రణాళికల్లో కూడా సాలీనా జాతీయ వృద్ధి అంతకు తగ్గకుండా ఉండేటట్లుగా పెట్టుబడి పద్ధతిని ఏర్పర్చుట. (2) ఆహార పదార్థాల లభ్యతలో స్వయం సంపూర్ణతను ఏర్పర్చుట. పరిశ్రమల అవసరాలను, ఎగుమతుల అవసరాలను తీర్చేవిధంగా వ్యవసాయోత్పత్తిని పెంచుట (3) ప్రాతిపదిక పరిశ్రమలైన ఉక్కు, ఇంధన, విద్యుచ్ఛక్తి పరిశ్రమలను విస్తృతంచేయుట. యంత్రాలను నిర్మించే పరిశ్రమల శక్తిని విస్తృతపర్చుట. ఇందుమూలంగా పది సంవత్సరాల్లో ప్రధానంగా దేశం స్వంత వనరులతోనే ముందు కాలంలో జరగవలసిన పారిశ్రామికీకరణకు కావలసిన అవసరాలను సమకూర్చుట. (4) దేశంలోని మానవ వనరుల్ని వీలైనంత ఎక్కువగా ఉపయోగించుట. ఉద్యోగితావకాశాల లభ్యతను చెప్పదగినంతగా విస్తృత పర్చుట. (5) సంపద, ఆదాయాలలోని అసమానత్వాలను తగ్గించి ఆర్థిక శక్తి పంపకీని హెచ్చు సమతులంగా సాగించుట.

## నాల్గవ ప్రణాళిక ఆశయాలు :

దేశం అవసరాలను, గత ప్రణాళిక అమలు వల్ల వచ్చిన అనుభవాలను దృష్టిలో పెట్టుకుని, నాల్గవ పంచవర్ష ప్రణాళిక ఆశయాలీవిధంగా చెప్పబడినవి : (1) నిలకడగల పరిస్థితుల మధ్య, భిన్నని అనిశ్చితతో అభివృద్ధి వేగాన్ని వేగిత్వరణచేయుట (2) నాల్గవ ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తిలో ఒడుదుడుకులు, విదేశ సహాయంలో అనిశ్చితత రాకుండా రక్షణలను ప్రవేశపెట్టుట (3) జాతీయాదాయం పరిమాణాన్ని పెంచడానికి ఆర్థిక వృద్ధి రేటును పెంచుట (4) ఆహారపదార్థాల లభ్యతలో స్వయం సంపూర్ణతను సాధించుట (5) దేశం లోపలి వనరుల్ని హెచ్చుగా పెంచుట (6) విదేశాలకు పోయే ఎగుమతుల రేట్లను పెంచుట (7) జాతీయ ఆర్థికవ్యవస్థలో ఎక్కువ సంతులనాలను (బేలన్సెస్) ఏర్పర్చుట (8) ఉద్యోగితావకాశాలు, ఆర్థిక వృద్ధిరేటులతో సహా సర్వతోముఖ వికాసాన్ని సాధించుట.

## అయిదవ ప్రణాళిక ఆశయాలు :

అయిదవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో ఆ ప్రణాళిక ఆశయాలీవిధంగా ఇవ్వబడినవి : (1) జాతీయ ఆర్థిక వ్యవస్థలో ఐక్యతను తెచ్చి బలపర్చుట (2) ఇది వరకటి ప్రణాళికల ఆర్థిక వృద్ధిరేటు కంటె ఈ ప్రణాళిక ఆర్థిక వృద్ధిరేటు పడిపోకుండా చూచుట. ఆర్థిక వ్యవస్థ సాలీనా 5.2 శాతము కాంపౌండ్ వృద్ధి

రేటుతో పెరుగుట. (3) పేదరికాన్ని తొలగించుట (4) స్వయం నిర్భరతను ఏర్పరుచుట (5) రాజకీయ ప్రజాస్వామిక వ్యవస్థను ఐక్యపర్చి బలపరుచుట (6) ఆర్థికశక్తి కొద్దిమంది చేతుల్లో కేంద్రీ కృతం కాకుండా చేయుట (7) ఆస్తి, ఆదాయాలలోని అసమానత్వాలను తొలగించుట (8) కనీస దైనికావసరాలైన ఆహారము, సామాన్య విద్య, పారిశుద్ధ్యము, వైద్య సౌకర్యము, త్రాగేనీరు, వ్యవసాయ నిర్వహణకు నీటిపారుదల సౌకర్యాలను ఏర్పరుచుట, ప్రభుత్వ, ప్రయివేటురంగాల్లోను, స్వంత పనులలోను ఔద్యోగితావకాశాలను ఏర్పరుచుట (9) సంతులిత ప్రాంతీయ ఆర్థికాభివృద్ధిని సాధించుట (10) దేశీయోత్పత్తిని పెంచుట (11) ఎగుమతులను పెంచుట (12) దిగుమతులను తగ్గించుట (13) జనాభా వృద్ధిరేటును తగ్గించి తలసరి ఆదాయాన్ని పెంచి, పేదరికాన్ని తగ్గించుట.

## ఆరవ ప్రణాళిక ఆశయాలు :

ఆరవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో చెప్పబడిన ఆశయాలీ విధంగా వున్నవి :

(1) నిరుద్యోగాన్ని, ప్రముఖంగా కన్పించే ప్రచ్ఛన్న నిరుద్యోగాన్ని తొలగించుట (2) జనాభాలోని అత్యంత బీదల జీవన ప్రమాణాల్లోచెప్పదగినంత పెరుగుదలను, మెరుగుదలను ఏర్పరుచుట (3) ఈ బీదలకు — బీదలుగా ఉంచిన ఆదాయాలుగల సముదాయాలకు — త్రాగడానికి పరిశుభ్రమైన నీరు, ఆరోగ్య రక్షణ, సదుపాయాలు, వయోజన విద్య, ప్రాథమిక విద్య, గ్రామీణ రోడ్లు, భూమిలేని గ్రామీణులకు గ్రామీణ గృహ వసతి సౌకర్యాలు, పట్టణాల లోని మురికివాడలకు కనీస సేవా సౌకర్యాలు ఏర్పరుచుట. (4) ప్రజలలోని అత్యధిక సంఖ్యాకుల జీవన ప్రమాణాలను మెరుగుపర్చుట. ఈ ఆశయాల సాధనకై లక్ష్యాలను సాధించాలి : (1) ఇదివరకు జరిగిన ప్రణాళికలలో కంటె ఉన్నత ఆర్థికవృద్ధి రేటును పొందుట. (2) ఆస్తి ఆదాయాల వ్యత్యాసాలలో చెప్పదగినంత తగ్గుదల వైపుకు పయనించుట. (3) స్వయం నిర్భరతా సాధనలో ధారావాహిక పురోగమనాన్ని సాధించడానికి హామీ యిచ్చే ఫలితాలను సాధించుట. (4) ప్రతి స్థలాభివృద్ధికి తగిన ప్రణాళికా కార్యక్రమాలను (ఏరియా ప్లానింగ్) అమలుజరిపి ఔద్యోగితావకాశాలను ఎక్కువగా పెంచుట.

## అసమానత్వాల తొలగింపు :

(1) ఆస్తులలోను, వృత్తులలోను, అవకాశాలలోను, సాంఘిక హోదాలలోను ఉన్న అసమానత్వాలను తగ్గించడము, వీలైతే పూర్తిగా తొలగించడము ప్రణాళికా రచన ముఖ్యోద్దేశాలలో మరొకటిని కేంద్ర ప్రభుత్వ 'డైరెక్టరేట్ ఆఫ్ ఎడ్వర్టయిజింగ్ అండ్ విజ్యుయల్ పబ్లిసిటీ' శాఖ, మినిస్ట్రీ ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ అండ్ బ్రాడ్ కాస్టింగ్‌వారు ప్రచురించిన ''టువర్డ్స్ ఈక్వాలిటి'' అనే గ్రంథంలో సచిన్ చౌధురి వ్రాసారు. భారతదేశంలో ఆర్థిక అసమానత్వాలు, సాంఘిక వ్యత్యాసాలు ఎక్కువగా ఉన్నవి. వీటివల్ల సహించరాని నిరుపేదరికం ఏర్పడింది. స్వాతంత్ర్య సిద్ధి పిదప మహారాజులు, జమీందారులు, చాలా పెద్ద భూస్వాములు తొలగించబడ్డారు. కాని వీరి స్థానంలో పెద్ద పారిశ్రామికులు వ్యాపారులు వచ్చారు, పెద్ద లాభాలు గడించారు. వారి వద్దకు అపారమైన కొనుగోలు శక్తి వచ్చి పడింది. అంతలో ఆర్థిక వ్యత్యాసాలు ఎక్కువగా పెరిగినవి. ఉన్నవారికి లేనివారికిమధ్య మరింత అఘాతం ఏర్పడింది. దీన్ని తగ్గించే ప్రయత్నం పాక్షిక ఫలితాలను మాత్రమే ఇవ్వగల్గింది. (2) గ్రామీణ, పట్టణ ప్రజలమధ్యనున్న అఘాతం సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక రంగాలలో అసమానత్వాన్నేర్పర్చింది. ఆర్థిక వ్యవస్థా చట్రంలోని అసంతులన స్థితి ఈ అసమానత్వానికి కారణము గ్రామీణులు హీన ఉత్పాదకతగల వ్యవసాయం మీద ఆధారపడుతున్నారు. వారి చేతివృత్తులు క్షీణించినవి. ఇందుకు భిన్నంగా పట్టణాలలోని పరిశ్రమల్లో హెచ్చు ఉత్పాదకత ఉన్నది. పంచవర్ష ప్రణాళికలు ఈ అసంతులన స్థితిని సరిచేసేందుకు కృషి చేస్తాయి. రాజకీయ సాంఘిక అశక్తతలను తొలగించడానికి మన రాజ్యాంగం పని చేస్తుంటే వివిధ ప్రజా సమూహాల ఆస్తి, ఆదాయాల్లో ఉన్న విశాల వ్యత్యాసాలను తొలగించడానికి మన ఆర్థిక ప్రణాళికా రచన పని చేస్తుంది. మన ఆర్థికాభివృద్ధి ప్రయివేటు ఆస్తి, కంట్రాక్టు చేసుకొనే స్వేచ్ఛ, స్వేచ్ఛగా ధరలను ఏర్పాటు చేసుకునే వీల మీద ఆధారపడింది. ఈ స్వేచ్ఛలవల్ల అవకాశాలులేని ప్రజలకు నష్టం వాటిల్లింది. అసమానత్వం పెరిగింది.

## సమానత్వ సాధనకు :

మామూలుగా చెడును ఏర్పాటుచేసే శక్తుల్ని తొలగించితే చెడు తొలగిపోతుంది. అందువల్ల మన దేశంలోని అసమానత్వాలను తొలగించి ఆర్థిక సమానత్వాన్ని సాధించడానికీ చర్యలు అవసరమని వాదించబడుతున్నది. (1) కంపెనీ లా ను సంస్కరించుట. అధికంగా కేంద్రీకృతమై ఉన్న స్వామ్యాన్ని (ఓనర్‌షిప్) నివారించుట, పారిశ్రామిక యూనిట్లను నియంత్రణ చేయుట అవసరము. (2) బ్యాంకులను, ఇతర విత్త సంస్థలను జాతీయం చేయుట. సమాజం సంచయనం చేసిన ధనాన్ని ఇందుమూలంగా పబ్లిక్, స్వయం ఉపాధి రంగాలలో పెట్టుబడి చేయవచ్చు. (3) ఫైనాన్స్ కార్పొరేషన్లను ఏర్పాటు చేయుట. ఇందువల్ల పరిశ్రమలకు ధారాళంగా మూలధనం లభ్యమౌతుంది. కొత్త పారిశ్రామికులకీ సౌకర్యము మరింత మంచిని కల్గిస్తుంది. (4) పరిశ్రమలను జాతీయము చేయుట. సోషలిస్టు పద్ధతి సమాజాన్ని నిర్మించడానికి ఆర్థిక సమానత్వము కావాలి. అందుకుగాను ప్రభుత్వం పారిశ్రామిక రంగంలో ప్రవేశించాలి. ప్రస్తుత స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థలో పెద్ద పారిశ్రామిక యూనిట్లు ఇంకా విస్తృతమౌతున్నవి. చిన్న యూనిట్లు క్షీణిస్తున్నవి. ఇందువల్లమరింత ఆర్థిక అసమానత్వం ఏర్పడుతోంది. ఈ అరిష్టాలను తొలగించడానికి ప్రభుత్వ స్వామ్యంలో విస్తృతమౌతున్న ప్రభుత్వ రంగంలో కీలక, భారీ, ప్రాతిపదిక పరిశ్రమలను నిర్మించాలి. (5) పారిశ్రామిక వికేంద్రీకరణ. చిన్న పరిశ్రమలను, గృహ పరిశ్రమలను సహకార రంగంలో నిర్మించాలి. (6) వ్యవసాయ రంగంలో ఆర్థిక మెరుగుదలకు తోడ్పడే మార్పులు ప్రవేశ పెట్టుట. ఇందులో అసమానత్వాలను తొలగించాలి. ఇందుకుగాను [illegible]

ప్రవేశపెట్టవలెను. పరపతి నివ్వవలెను. కమ్యూనిటి ప్రాజెక్టుల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలు సాగించవలెను. జాతీయ విస్తరణ సేవల (నేషనల్ ఎక్స్‌టెన్షన్ సర్వీసెస్) ద్వారా దేశమంతటా వ్యవసాయ ఉత్పాదకతను పెంచవలెను. (7) పన్నుల విధింపుద్వారా ఆర్థిక అసమానత్వాలను తొలగించవలెను. ప్రత్యక్ష పన్నులు పురోగామికంగాను, పెద్దవిగాను ఉండి ఇందుకు సమర్థవంతంగా తోడ్పడ గలవు. ఎస్టేట్ డ్యూటీ, కేపిటల్ గెయిన్స్ టాక్స్ మొదలైన వాటిని, ఆర్థిక వ్యత్యాసాలను తొలగించడానికి విధిస్తున్నారు. (8) ఆదాయాల గరిష్టపరిమితిని తగ్గించి, కనిష్టపరిమితిని హెచ్చించడం ద్వారా అసమానత్వాల తొలగింపుకు ప్రయత్నాలు జరుగుతున్నవి. (9) ఔద్యోగితావకాశాలను పెంచడానికి చర్యలు తీసుకొనుట. ఇందుకుగాను వ్యవసాయోత్పాదకతను పెంచుట, విద్యాభ్యాసావకాశాలను హెచ్చుగా కల్పించుట, సాంకేతిక శిక్షణ అవకాశాలను పెంచుట, సాంఘిక సేవలను విస్తృతపర్చుట అవసరము. తద్వారా సోషలిస్టు పద్ధతి సమాజము నిర్మాణమై ఆర్థిక సమానత్వము ఏర్పడుతుంది. (10) ఆర్థికవృద్ధి నడకను వేగిత్వరణ చేయుట సమానత్వ స్థాపనకు పరోక్షంగా తోడ్పడుతుంది.

## సోషలిస్టు నమూనా సమాజ నిర్మాణము:

జాతీయస్వాతంత్ర్యోద్యమంలో ఒకప్రముఖ భాగంగాఉన్నసోషలిస్టులు1934నుండి కాంగ్రెసుపార్టీని సోషలిజంవైపుకు నడపడానికి తీవ్ర కృషిచేసారు. 1954లో జరిగిన ఆవడి కాంగ్రెస్ మహాసభలో "ఉత్పత్తిని హెచ్చుగా పెంచడం, జీవన ప్రమాణాలను పెంచడం, ఉద్యోగావకాశాలను ఎక్కువగా ఏర్పర్చడంఅనే ఆశయాలను సాధించడం ద్వారా పది సంవత్సరాలలో సంపూర్ణఔద్యోగితకచేరి ఆర్థిక, సాంఘిక రంగాలలో చెప్పదగిన పురోగమనం సాగించాలని" తీర్మానం చేయబడింది. "జాతిలక్ష్యం సంక్షేమ రాజ్యం, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ.........జాతీయాదాయాన్ని తగినంతగా పెంచడంద్వారాను, ఉత్పత్తిని హెచ్చింపడం ద్వారాను, అనేక ఉద్యోగావకాశాలను ఏర్పర్చడం ద్వారాను దీన్ని సాధించవచ్చు" అని అంటూ ఆ తీర్మానం ఇంకా ఇలా చెప్పింది: సోషలిస్టు సమాజంలో "ప్రణాళికా రచన, ఆర్థికాభివృద్ధికి చెందిన విషయాల్లో రాజ్యాంగ యంత్రం గట్టి పాత్రను నిర్వహిస్తుంది. విద్యుచ్ఛక్తి, రవాణా ఆది సౌకర్యాలను అందించడానికి పెద్ద ఎత్తున పథకాలను నిర్వహిస్తుంది. వనరుల మీద, సాంఘిక ఆశయాలమీద, ప్రవృత్తుల మీద నియంత్రణ చేస్తుంది. ఊహాత్మకమైన నియంత్రణ ద్వారాను, ప్రయివేటు ట్రస్టులను, కార్టెల్స్‌ను నియంత్రణ చేయడం ద్వారాను, శ్రామిక, ఉత్పత్తి ప్రమాణాలను పోషించటం ద్వారాను క్రమరాహిత్యంగా పారిశ్రామికాభివృద్ధి జరగడాన్ని నిరోధించి, ఆపుతుంది. ప్రభుత్వ రంగం పోను పోను హెచ్చుపాత్రను నిర్వహించాలి. ముఖ్యంగా ప్రాతిపదిక పరిశ్రమల స్థాపనలో ఈపని జరగాలి. ప్రయివేటు రంగానికి, ప్రభుత్వేతర రంగానికి, ఐచ్ఛిక పరిశ్రమలకు, సహకార, చిన్నతరహా పరిశ్రమలకు ముందులాగానే ప్రాముఖ్యత కొనసాగుతుంది."

శ్రీమన్నారాయణ్ అగర్‌వాల్ తన 'సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీ' (అధ్యాయం 3, పే. 7–11, డిశంబర్ 1955, అఖిలభారత కాంగ్రెస్, న్యూఢిల్లీ) అనే గ్రంథంలో సోషలిస్టిక్ నమూనాసమాజం ప్రాతిపదిక వివరాలను ఆశయాలను ఈవిధంగా ఇచ్చారు: (1) సమానావకాశాలు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయముగల సాంఘిక–ఆర్థిక వ్యవస్థను నిర్మించుట (2) సంపూర్ణ ఔద్యోగితాస్థితిని ఏర్పర్చడానికవసరమైన పరిస్థితులను ఏర్పాటుచేయుట (3) దేశం అత్యున్నత ప్రయోజనాల దృష్ట్యా ప్రధాన ఉత్పాదన మాధ్యమాలను, భౌతిక వనరులను రాజ్యాంగయంత్రం తన స్వామ్యంలో ఉంచుకోవడముగాని, సమర్థవంతంగా నియంత్రణ చేయడంగాని చేస్తుంది. (4) సమిష్టి ప్రయోజనాలను దెబ్బతీసేవిధంగా సంపద, ఉత్పాదన మాధ్యమాలు కేంద్రీకృతం కాకుండా ఉండేరీతిలో సమాజం తన ఆర్థికవ్యవస్థను నిర్మిస్తుంది. (5) మొత్తం దేశ సంపద ఉత్పాదనను పెంచడానికి, వేగిత్వరణ చేయడానికి క్రమబద్ధమైన ప్రయత్నాలు జరుగుతాయి. (6) సంపద న్యాయసమ్మతంగా పంచబడడమేగాక ప్రస్తుతమున్న ఆర్థిక వ్యత్యాసాలు కనిష్టస్థాయికి తేబడుతాయి. (7) పై జెప్పిన సాంఘిక, ఆర్థిక మార్పులు శాంతియుత పద్ధతులద్వారా తేబడతాయి (8) పెద్ద ఎత్తున రాజకీయ, ఆర్థికాధికారాలు వికేంద్రీకరించబడతాయి. ఆల్ ఇండియా రేడియో సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీమీద నిర్వహించిన ఉపన్యాస కార్యక్రమంలో 1955 జూన్ 11వ తేదీన శ్రీమన్నారాయణ అగర్‌వాల్ ఇచ్చిన మొదటి ఉపన్యాసంలో సోషలిస్టిక్ పద్ధతికి చెందిన ఏడు సూత్రాలను (సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీ, డిశంబరు 1955, అధ్యాయం5, పే 17-22, అఖిల భారత కాంగ్రెస్ కమిటి, న్యూఢిల్లీ) ఈవిధంగా చెప్పారు: (1) సంపూర్ణ ఔద్యోగిత, ప్రతివానికి పని చేసే హక్కు (2) జాతీయ సంపదను గరిష్టస్థాయిలో ఉత్పత్తి చేయుట (3) గరిష్టస్థాయిలో జాతీయ స్వయంనిర్భరత (4) సాంఘిక, ఆర్థిక న్యాయాలు (5) శాంతియుత, అహింసాత్మక, ప్రజాస్వామిక పద్ధతులను ఉపయోగించుట (6) గ్రామ పంచాయితీలను, పారిశ్రామిక సహకారసంఘాలను ఏర్పర్చడంద్వారా ఆర్థిక రాజకీయ అధికారాన్ని వికేంద్రీకరించుట (7) చివరమనిషి వరకు న్యాయం జరగాలి అనే గాంధీజీసూత్రము. సోషలిస్టు సమాజంలో జనాభాలో అత్యధిక పేదవారికి, అట్టడుగున ఉన్నవారికి తక్షణ అవసరాలను అందించాలని అట్టడుగున ఉన్నవానికి మొదట, అందరికంటె పైనున్న వారికి చిట్టచివరకు అవసరాలు అందాలని జగ్‌ప్రవేష్‌చంద తన 'ఇండియాన్ సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటి' (పే. 13) అనే గ్రంథంలో వ్రాసాడు.

## మన ప్రణాళికల్లో సోషలిస్టు పద్ధతి:

ఆశయాలు, పద్ధతులను గురించి చెబుతూ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా సోషలిస్టిక్ పాటరన్ సమాజం ఆశయాలనీ విధంగా వివరించింది: వాటినే కొద్ది మార్పులతో మూడవ, నాల్గవ, అయిదవ ప్రణాళికలుకూడ ఆస్వాదించినవి. ఈ విషయంలో నేడు ప్రజాస్వామ్యము, సోషలిజము అనే వానిమీద జోరు చూపబడుతోంది. (1) జీవిత ప్రమాణాలను పెంచుట, ఇది అంతిమలక్ష్యం

కానప్పటికి భౌతిక శ్రేయస్సు చాల ముఖ్యము. ఇది **మేధా**శక్తికి, సంస్కృతికి చెందిన జీవితానికి మార్గము. తన శ్రామిక శక్తినంతటిని, తన పని గంటలన్నింటిని కేవల ప్రాథమికావసరాల ఉత్పత్తికి ఉపయోగించే సమాజము ఉన్నత లక్ష్యాలవైపుకు పరిమితంగానే సాగుతోందని చెప్పాలి. సమాజం ఉత్పాదక శక్తిని, విస్తృతం చేయడానికి, తమ అభిప్రాయాలను బయల్పర్చే అవకాశాలను ఇవ్వగల వాతావరణాన్ని సృష్టించడానికి, తమ కోర్కెలను, శక్తిసామర్థ్యాలను అనువర్తింపజేయడానికి కావలసిన అవకాశాలను ఏర్పర్చడానికి ఆర్థికాభివృద్ధి కావాలి. (2) సాంఘిక — ఆర్థిక సంస్థల రూపాన్ని మార్చుట. అల్పాభివృద్ధి దేశాలు అప్పటికున్న సాంఘిక — ఆర్థిక సంస్థల చట్రంలో మంచి ఫలితాలను సాధించడమే గాక, ఈసంస్థలను మార్చి విశాలమై, మరింత అర్థవంతంగా ఉండే సాంఘిక విలువలను సమర్థవంతంగా సాధించడానికి మార్గాన్ని ఏర్పాటు చెయ్యాలి. (3) సాంఘికలాభాన్ని ముందంజ వేయించాలి. ఆర్థిక లాభం కేవలం ప్రయివేటు లాభానికి కాకుండా, ఎక్కువగా సాంఘిక లాభానికి జరగాలి. జాతీయాదాయము, ఔద్యోగితావకాశాలు పెంపొందడానికి తోడ్పడేవిధంగాను, ఆస్థి ఆదాయాలలో సమత్వం ఏర్పర్చడానికి **తోడ్పడే** విధంగాను అభివృద్ధితీరును, సాంఘిక—ఆర్థిక సంబంధాల చట్రాన్ని ఏర్పరచాలి. (4) ఐక్యం చేయబడిన నియంత్రణ, వనరుల కేటాయింపు, ఆధునిక సాంకేతిక పద్ధతుల్ని ఉపయోగించడానికి పెద్దతరహా ఉత్పాదన, ఐక్యం చేయబడిన నియంత్రణ (యూనిఫయిడ్ కంట్రోల్), ప్రధాన ఆర్థిక కార్యక్రమాలమధ్య తగినరీతిని వనరుల కేటాయింపు అవసరము. ఆర్థిక వ్యవస్థ వృద్ధిరేటును ప్రధానంగా నిర్ణయించే ఖనిజాలను, ప్రాతిపదిక, మూలధన వస్తు పరిశ్రమలను పూర్తిగా ఉపయోగించుకోవాలి. వీటి అభివృద్ధికి రాజ్యాంగ యంత్రము పూర్తిగా బాధ్యత వహించాలి. నూతన సమాజ పద్ధతికి అనుసారంగా పాత పారిశ్రామిక యూనిట్లుకూడా నడుచుకోవాలి సాంకేతిక విషయాలు ఆస్థి, ఆర్థికశక్తుల కేంద్రీకరణకు దోవతీసే సందర్భాలలో పూర్తిగాగాని, పాక్షికంగా గాని ప్రభుత్వ స్వామ్యము, ప్రభుత్వ నియంత్రణ, యాజమాన్య నిర్వహణలో ప్రభుత్వానికి భాగము కావాలి.

## ఔద్యోగితావకాశాల కల్పనాశక్తి :

ప్రణాళికా రచయితలందరు సంపూర్ణ ఔద్యోగితను ఆదర్శంగా పెట్టుకొంటారు "ఔద్యోగిత ప్రకృతి వైద్యుడు, మానవ సౌఖ్యానికిది అవసరము" అని గలెన్ చెప్పిన విషయం సంపూర్ణ యదార్థమేగాక చాల ఉచితమైన సబబుగా ఉన్నది. సంపూర్ణ ఔద్యోగితా భావన అనేక విధాలుగా నిర్వచించబడింది. "పూరించబడని ఉద్యోగ ఖాళీలు నిరుద్యోగులకంటె తక్కువగా ఉండని పరిస్థితులు, అందువల్ల నిరుద్యోగము ఒక వ్యక్తి ఉద్యోగాన్ని కోల్పోయి మరొక ఉద్యోగంలో చేరడానికి పట్టేకాలము మామూలు వ్యవధిగా ఉండుట" సంపూర్ణ ఔద్యోగితా స్థితి అని "ఎంప్లాయిమెంట్ పాలసీ అండ్ ఆర్గనైజేషన్ ఆఫ్ ఇండస్ట్రీ ఆఫ్టర్ ది వార్" అనే విషయము మీద నప్ఫీల్డ్ కాలేజి ఇచ్చిన రాజ్ఞాపత్రంలో చెప్పబడింది. "ఉద్యోగులకంటె ఖాళీగా ఉన్న ఉద్యోగాలు ఎక్కువ ఉన్న పరిస్థితులు" సంపూర్ణ ఔద్యోగితా స్థితి అని సర్ విలియం బెవరెడ్జి '**ఫుల్** ఎంప్లాయ్‌మెంట్ ఇన్ ఎ ఫ్రీ సొసైటీ' అనే గ్రంథంలో వ్రాసారు. అంతేగాక "ఉద్యోగాలు న్యాయమైన వేతనాలమీద, అనుకూలమైనచోట్ల దొరకడంవల్ల నిరుద్యోగులు ఆ ఉద్యోగాల్లో చేరతారని అనుకోవడం సహేతుకమే. అందువల్ల ఒక ఉద్యోగాన్ని కోల్పోయి మరొక ఉద్యోగంలో చేరడానికి పట్టే **మామూలు** వ్యవధి చాల తక్కువగా ఉంటుంది" అని బెవరెడ్జి అదే గ్రంథంలో వ్రాసాడు. సంపూర్ణ ఔద్యోగిత అంటే నిరుద్యోగులకు, పనిచేయగల్గినవారికి, వారు కోరిన పరిస్థితులలో ఉద్యోగాన్నివ్వచూపడం. "వేతనంమీద పనిని కోరుతూ స్థానిక ప్రమాణాలప్రకారం సహేతుకమైన పరిస్థితులమధ్య తన శక్తిసామర్థ్యాల కనుగుణ్యంగాని పరిస్థితుల కనుసారంగా ఉద్యోగం దొరకనివాడు నిరుద్యోగి అనబడతాడు" అని 1919లో లీగ్ ఆఫ్ నేషన్స్‌చే నియుక్తమైన సంఘము చెప్పింది. నిరుద్యోగం అనేక రకాలు : (1) ఆత్మాశ్రయ (సబ్జెక్టివ్)నిరుద్యోగిత, విషయ సంబంధ (ఆబ్జెక్టివ్) నిరుద్యోగిత (2) ఋతు సంబంధమైన నిరుద్యోగిత (3) వ్యాపార చక్రీయతవల్ల వచ్చిన నిరుద్యోగిత (4) మామూలు నిరుద్యోగిత (5) ఆర్థిక చట్రంలోని లోపాలవల్ల వచ్చిన నిరుద్యోగిత (6) తక్కువ పనిపాటలు (7) వ్యవసాయ రంగంలోని నిరుద్యోగిత (8) పాక్షిక నిరుద్యోగిత (9) కొంతవరకు చదువుకున్నవారి (వైట్‌కాలర్) నిరుద్యోగిత (10) ప్రచ్ఛన్ననిరుద్యోగిత. నిరుద్యోగితకు చాలాకారణాలున్నవి. ఈ కారణాలు రాష్ట్రాలమధ్య, సమాజాలమధ్య పరిస్థితుల మధ్య, మనుష్యులమధ్య వేరువేరుగా ఉంటాయి. వాటి నిప్పుడు ప్రస్తావించుదాము : (1) పరిశ్రమ ఉత్పత్తికి చాలాకాలంనుండి గాని, అనేకమార్లుగాని ఉండవలసిన మొత్తం డిమాండ్‌లో కొరత వచ్చుట (2) డిమాండ్ కూడనివైపుకు మర్చబడింది (3) ఉద్యోగాల కొరకు వెతుకుతున్న వారిని అవసరమైన దానికంటె ఎక్కువగా గాని, తక్కువగా గాని ఇతరచోట్లకు పంపుటవల్ల శ్రామిక మార్కెట్‌ను తగినట్లు సంఘటన చేయలేకపోవుట (4) సేద్యం పనులమీద పెరిగిన వత్తిడి (5) వ్యవసాయ కార్యక్రమాలకు అనుబంధంగా నడిచే సహాయ పరిశ్రమలు లేకపోవుట (6) వ్యవసాయ పారిశ్రామిక రంగాల క్షీణ ప్రతిఫలిత పనిచేస్తూ ఉండటము (7) ఉత్పాదన ప్రక్రియకు సంబంధించిన పరిశోధన, సాంకేతిక మార్పులు లేకుండుట. (8) రవాణా, కమ్యూనికేషన్, పవర్‌షిప్ సౌకర్యాలు లేకుండుట. (9) వ్యాపార చక్రాల తీవ్రతను ఆపలేకపోవుట. (10) లోపభూయిష్టమైన విద్యా, పరిపాలనా వ్యవస్థలు ఉండుట. నిరుద్యోగ నివారణకు దీర్ఘకాలీన, స్వల్పకాలీన నివారణోపాయాలు చెప్పబడినవి. ఇందులో కొన్ని ఆదర్శవంతంగా కన్పిస్తూ సిద్ధాంతరీత్యా సరియైనవిగానే ఉంటాయి. మరికొన్ని ధనాత్మక (పాజిటివ్) కార్యక్రమాల నిస్తాయి. ధనాత్మక విలువల నిరుద్యోగ నివారణోపాయాలను చూద్దాము; (1) ఉద్యోగాలకు సంబంధించిన సమాచారాన్ని, నిర్ణయాలను లభ్యం చేయుట. (2) సంపూర్ణ ఔద్యోగితా విధానాన్ని ప్రకటన చేయుట. (3) ఋణంగా తీసుకునిగాని, అచ్చువేసిగాని కొత్త ద్రవ్యాన్ని చెలామణిలో ప్రవేశపెట్టి, తగిన ప్రయివేటు ఖర్చులను పూర్తి చేయుట, ప్రమాణ

పెట్టుబడిని ప్రోత్సాహపర్చుట. (4) ప్రయివేటు పరిశ్రమల ఉత్పాదనను ప్రోత్సాహపర్చుట. (5) వినియోగాన్ని ప్రోత్సాహపర్చుట. (6) గుత్త వ్యాపార ధరలకు వ్యతిరిక్తమైన ధరలను నిర్ణయించుట. (7) విదేశాలతో వ్యాపారము సాగించుట, విదేశ మూలధనాన్ని పెట్టుబడి చేసి మన దేశంలో ఆర్థిక కార్యక్రమాలు సాగించుట (8) యుద్ధ ప్రాతిపదికమీద ఔద్యోగితా విధానాన్ని అమలు జరుపుట. నిరుద్యోగ నివారణకు భారతదేశ ప్రణాళికా సంఘము యిచ్చిన పదకొండు సిఫార్సులను చూద్దాము: (1) చిన్న పరిశ్రమలను,వ్యాపారాన్ని సాగించేందుకు వ్యక్తులకు,ప్రజలలోని చిన్న సమూహాలకు ప్రత్యేక ఆర్థిక సహాయం యివ్వాలి. (2) ప్రస్తుతం అంగబలం కొరత ఉన్న కార్యక్రమాలలో శిక్షణ సౌకర్యాలను విస్తృతంచెయ్యాలి. అనేక పనులలో ఈ కొరత ఉన్నందువల్ల పంచవర్ష ప్రణాళికల కార్యక్రమాలను అమలుజరపడానికి ఇబ్బందిగా ఉన్నది. శిక్షణ సౌకర్యాల విస్తృతివల్ల ఈ కొరతపోయి అర్హనైపుణ్యం గల శ్రామికులకు ఔద్యోగితావకాశాలు లభ్యమౌతాయి. (3) రాష్ట్ర ప్రభుత్వాలు, ఇతర ప్రభుత్వసంస్థలు తమకు అవసరమైన వస్తువులను కుటీర, చిన్న తరహా పరిశ్రమల ఉత్పత్తుల నుండి కొనడం ద్వారా ఆ పరిశ్రమలకు క్రియాశీలక ప్రోత్సాహం ఇవ్వాలి. (4) పట్టణ ప్రాంతాల్లో వయోజన విద్యా కేంద్రాలను స్థాపించడానికి మ్యునిసిపాలిటీలకు, ప్రయివేటు విద్యా సంస్థలకు, ఐచ్ఛిక సంస్థలకు సహాయం అందించాలి. గ్రామీణ ప్రాంతాల్లో ఏక ఉపాధ్యాయ పాఠశాలలను నెలకొల్పి పనిచేయడానికి ప్రోత్సహించాలి. (5) ఏ విధంగా నయినాసరే, విజయవంతం చేయడానికి జాతీయ విస్తృత సేవా పథకాన్ని ధైర్యంగా అమలు జరపాలి. ఈ పథకం భారత ఆర్థిక వ్యవస్థ వృద్ధికి పాతిపదిక అవసరము. అంతేగాక విద్యావంతుల నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి కూడా ఈ పథకం తోడ్పడుతుంది. (6) రోడ్డు రవాణా పరిశ్రమను అభివృద్ధి చెయ్యాలి. ఇప్పుడున్న లైసెన్సు యిచ్చే విధానాలను పునః పరిశీలించాలి. ఈ పునః పరిశీలన ద్వారా ప్రయివేటు సంస్థలచే రోడ్డు రవాణా పరిశ్రమ అభివృద్ధి కావడానికి దోహదం చెయ్యాలి (7) మురికివాడలను పరిశుభ్రంచేసే పథకాలను అమలు జరిపి తక్కువ ఆదాయ వర్గాలకు పట్టణాలలో గృహాలు నిర్మించాలి (8) ప్రయివేటు గృహ నిర్మాణ కార్యక్రమాలను ప్రోత్సహించాలి. (9) దీర్ఘకాలీన నిరుద్యోగ స్థితితో బాధపడుతున్న చిన్న పట్టణాలకు ప్రణాళికాయుక్తంగా సహాయంచేసి, వాటి పరవాహిక అస్థిత్వానికి కావలసిన బలమైన ఆర్థిక ప్రాతిపదికను అభివృద్ధి చేయడానికి తోడ్పడాలి. (10) విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ప్రయివేటు పెట్టుబడిదారులు అమలు జరిపే కార్యక్రమాలకు తోడ్పడాలి. ప్రస్తుతం పెరుగుతున్న పట్టణాలను విద్యుచ్ఛక్తి కొరత ఎదుర్కొంటోంది. ఇందువల్ల ఔద్యోగితను కల్పించడానికి, పారిశ్రామికాభివృద్ధి చేయడానికి దెబ్బగా ఉన్నది. (11) ప్రభుత్వం తీసుకునే చర్యలవల్ల పనిచేసే అవకాశాలు ఏర్పడడానికి వీలున్నచోట్ల "పని + శిక్షణ" శిబిరాలను నిర్వహించాలి. ఉ: నదీ లోయ ప్రాజెక్టులు, రోడ్ల నిర్మాణము అడవులు పెంపకానికి మొక్కలునాటిపోషించుట, భూసార పరిరక్షణ కార్యక్రమాలు, సహకార ప్రాతిపదికమీద భూమిపై సేద్యానికిగాను ప్రజాసమూహాలకు నివాసస్థావరాలను సేద్యభూముల పరిసరాలలో ఏర్పరుచుట.

## సంక్షేమరాజ్యం ఏర్పాటు :

సంక్షేమరాజ్యం ఏర్పాటుచేయడం ప్రణాళికా రచన ఆశయాలలో మరొకటి. ప్రజలందరికి తగినంత సంతులన ఆహారము, తగిన గృహవసతి, ఆరోగ్య రక్షణసేవలు, విద్యాసేవలరూపంలో ప్రాథమిక జీవితావసరాలు ''తప్పక అందుబాటులో ఉండాలని సంక్షేమ రాజ్యం కోరుతుంది. వృద్ధాప్యం, నిరుద్యోగంవల్ల వచ్చే విపత్తుల నుండి కూడ అది రక్షణ నివ్వాలి''. సంక్షేమ రాజ్యమనగా ''తన పౌరులకు అనేక రకాలైన సాంఘిక సేవలను సమకూర్చే రాజ్యము. దేశ పౌరునికి భద్రతను సమకూర్చడం దాని ప్రధాన కర్తవ్యము. పౌరుడు తన మామూలు ఆదాయమూలాన్ని పోగొట్టుకున్నట్లయితే రాజ్యాంగయంత్రం అతనికి సహాయం చేయడానికి సమకట్టుతుంది'' అని టి. డబ్ల్యు. కెంట్ తన 'వెల్ఫేర్ స్టేట్' (పే. 2) అనే గ్రంథంలో వ్రాసాడు. అదే గ్రంథంలో అతడింకా ఇలా వ్రాసాడు: సంక్షేమ రాజ్యమనగా ''పౌరునకు విస్తృతంగా అనేక రకాలైన సేవలను అందజేయు రాజ్యము. విద్య, ఆరోగ్యము, నిరుద్యోగము నుండి రక్షణ, ముసలితనంలో పెన్షను, పిల్లలకు విద్య''మొదలైన వాటి రూపంలో ఆ సేవలు అందించబడతాయి. డి. యల్. హాచ్ మన్ అనే రచయిత ఇలా వ్రాస్తున్నారు: ''కమ్యూనిజం కరడు గట్టిన వ్యక్తివాదం అనే రెండు తీవ్రదృక్పథాలమధ్య రాజీగా సంక్షేమ రాజ్యం ఏర్పడింది. అందువల్ల అందులో లోపాలున్నా, మానవత్వం

గల పురోగామిక సమాజ స్థాపన కది నమూనాగా ఉన్నది. వ్యక్తి చొరవ కవసరమైన ప్రోత్సాహాలను తొలగించకుండా కనీస ఉదర పోషణ ప్రమాణాని కది హామీనిస్తుంది. అంచెలవారీగా ఏర్పాటు చేయబడ్డ హెచ్చురేటు పన్నుల విధింపుద్వారా ఆదాయరంగంలో పరిమితమైన పునఃపంపిణీని ఏర్పాటు చేస్తుంది. అయినప్పటికి తన పౌరులకు ఆర్థిక సమత్వాన్ని సమకూరుస్తున్నట్లు నటించదు, అవసరమైనపుడు అందరికి తగిన సహాయం అందే హామీ ఉంటుంది; ఈ అవసరం వ్యాధి, వృద్ధాప్యం, నిరుద్యోగం లేక ఏ ఇతర కారణం వల్లనైనా రావచ్చు''. డాక్టర్ అబ్రహాం అనే రచయిత ఇలా వ్రాస్తున్నారు: ''వ్యక్తి ఆస్తికి, పనికి లభ్యమయ్యే మార్కెట్ విలువతో సంబంధం లేకుండా ప్రతిపౌరునకు ఆదాయ పునఃపంపిణీ, కనీస ప్రాతిపదిక వాస్తవిక ఆదాయము లభ్యంకావడానికి ఆర్థికశక్తుల మామూలు పాటవాన్ని మార్చడానికి రాజ్యశక్తి పనిచేసే సమాజము సంక్షేమ రాజ్యమనబడుతుంది''. పోగా యన్. ఆర్. సర్కార్ అనే రచయిత ఇలా వ్రాస్తున్నారు: ''విద్య, పారిశుభ్రత, వైద్య సహాయము, జీవనభృతి ప్రజలకందించడానికి దీక్షతో రాజ్యాంగ యంత్రము కొన్ని బాధ్యతలను తీసుకోవడము, ఆ స్థితితో జాతీయ సంపదను ఉత్పత్తిచేసే మాధ్యమాలకు సహసంబంధ ముండటము సంక్షేమరాజ్యానికి గీటురాయి.''

## సంక్షేమరాజ్యము : సమష్టివాదము :

సమష్టివాదము ప్రభుత్వ యంత్రాంగంలో ఒక ముక్కని బహుశా తప్పనిసరిగా, సమాజం సృష్టించిన సమస్యల పరిష్కారానికొక మార్గమని కొందరు రచయితలు అభిప్రాయపడుతున్నారు. ప్రజాస్వామిక సోషలిజానికి అతి తొందరగా చేరడానికి సమష్టివాదము మార్గమని ఫెబియన్ సోషలిజం ప్రమేయం చేస్తోంది. కాని తదుపరి, ఈ ప్రమేయం తప్పని చెప్పబడటమేగాక, ఆ ప్రమేయాన్ని బలపర్చే వారెవరూ కన్పించలేదు. సిడ్నీ వెబ్ ఈవిధంగా వ్రాసారు: ''ఆచరణ దృక్పథంగల మనిషి సాంఘిక అంశక్రమ నిర్మాణం (సోషల్ ఆర్గానిజం)తోను, సాంఘిక సంఘటన సాధారణ సూత్రాలతోను విసిగిపోయి,తననాటి అవసరాలవత్తిడివల్ల, నానాటికి లోతవుతున్న సమష్టి వాద మార్గంలోకి దిగుతున్నాడు. కాని ఇప్పటికి సోషలిజాన్ని వద్దనడమేగాక అలక్ష్యం చేస్తున్నాడు.'' వెబ్ ఈ మాటలు చెప్పిన తర్వాత 1880 తర్వాత పది సంవత్సరాలుగా ఆశ్చర్యం కల్గించే రాజకీయ, ఆర్థిక, సాంఘికమార్పులు, భావ సిద్ధాంత మార్పులు వచ్చినవి ప్రస్తుతం సామాన్య ప్రజానీకానికి ఎక్కువ భద్రత కల్గించాలనే ప్రవత్తి పెరుగుతోంది.

## సోషలిజము : సంక్షేమ రాజ్యము :

ప్రపంచంలో సోషలిస్టు భావవాదము వేగంగా విస్తరిస్తోంది. పెట్టుబడిదారీ వాదంలోని లోపాలే ఇందుకు కారణము. సోషలిస్టు భావాల నవలంబించిన రష్యా ఆది సోషలిస్టుదేశాలు సాధించిన విజయాలు కూడా ఇందుకు కారణము. సంక్షేమ రాజ్యం, సోషలిజానికి మధ్య ఏర్పడిన వివాదాన్ని గురించి వాల్టర్ లిప్మన్ తన 'గుడ్ సొసైటీ'అనే గ్రంథంలో వాస్తవిక దృష్టితో ఇలా వ్రాసాడు: ''ఒక వర్గప్రయోజనంకోసం సమష్టి ఆస్తిని చక్కగా నిర్వహించవచ్చు. టైటిల్ పత్రాలలో గారిడీ ఏమీలేదు అధికారంలోఉన్నా ధనవంతులు కావడానికి, సమాజాన్ని దోచుకోవడానికి పని చెయ్యరనే హామీనిచ్చే సమాజ స్వామ్యానికి ఉత్పాదకశక్తిగల మూలధనాన్ని మార్చడం తప్పేమీకాదు. వారసత్వ కులాలుగాను, స్వయంనియుక్త కులాలుగాను విభజితమైన సమాజస్థితికి సమష్టివాదము అనుకూలమే''. బ్రిజ్ గోపాల్గుప్త తన 'కాన్సెప్ట్ ఆఫ్ వెల్ ఫేర్ స్టేట్ అండ్ ఇండియా' అనే గ్రంథంలో ఇలా అభిప్రాయపడ్డాడు: సామాన్య ప్రజానీకానికి ఉద్యోగిత, విద్య, ఆరోగ్యము, సాంఘిక భద్రత లభ్యపర్చడానికి కనీస హామీని ఎలా ఏర్పాటు చెయ్యాలా అన్నదే నిజమైన సమస్యగా ఉన్నది. వాటి ఆశయాలు కొంతవరకు ఒకటిగానే కన్పించినా, సంక్షేమరాజ్యం, సోషలిజం విభిన్నమార్గాలు గలవి. సోషలిజం ఉత్పాదన మాధ్యమాలను పూర్తిగా జాతీయం చెయ్యాలని చెబుతుంది. కాని సంక్షేమరాజ్యం అట్టి చర్య తప్పని సరి అని మాత్రం చెప్పదు.

## భారతదేశంలో సంక్షేమరాజ్యం :

సంక్షేమ రాజ్యభావన భారత దేశానికేమంత పాతదికాదు. 1947 తర్వాత అణచివేయబడినవారి కష్టాలను తొలగించడానికి, ఆర్థిక అసమానత్వాలను తొలగించడానికి, ఆదాయం, ఆస్తి, సాంఘిక న్యాయాల విషయంలో సమానత్వం ఏర్పర్చడానికి రాజ్యాంగయంత్రం ప్రయత్నం చెయ్యాలని రాజ్యాంగయంత్రం అనుకుంటోంది. శతాబ్దాలనుండి మనదేశంలో ఆర్థికమైన చెడు పరిస్థితులు ఉన్నవి. బ్రిటిషు పరిపాలన అవలంబించిన లోపభూయిష్టమైన ఆర్థిక విధానము, దేశంలో సాగిన స్వేచ్ఛా వ్యాపార (లైసెజ్ ఫెయిర్) విధానము అందుకు కారణాలు. ప్రజాస్వామ్యాన్ని పోషించడానికి ఆర్థిక అసమానత్వాలను తొలగించడము, బీదవారిని ఆర్థికంగా దోపిడీ చేయడము వెంటనే ఆపివేయడము అత్యవసరము. ప్రజానీకము ఎంత అవిద్యావంతులుగా ఉండి అట్టడుగున పడిపోయి ఉన్నప్పటికి ఎక్కువ కాలం రాజకీయ, ఆర్థిక, సాంఘిక అసమానత్వాలను సహించరు. ''ఖాళీగా ఉన్న ఉదరము మంచి రాజకీయ సలహాదారుకాదు'' అని అయిన్స్టైయిన్ చెప్పిన విషయము ఈనాడు చాలా సమంజసమైన విషయమని, ముందు కూడా అలా సమంజసంగానే ఉంటుందని చెప్పవలసి ఉన్నది. ఆన్వాన్ వైజెన్ థామస్ తన'కమ్యూనిజంవెర్సస్ ఇంటర్నేషనల్లా'లో ఇలా వ్రాసాడు: ''ఆకలితో నున్న మనుష్యులు స్వేచ్ఛగల మనుష్యులు కారు. ఆకలంటే ఏమిటో చూచిన ప్రతివానికి ఆకలిగా ఉన్నవాడు ఇతరులు తమ ఎడ జాగ్రత్త వహిస్తారనే విషయాన్ని నిర్లక్ష్యం చేస్తారని తెలుసు. స్వేచ్ఛ మొదలైన వాటిని గురించి ఆకలితో బాధపడే వారితో మాట్లాడటంవల్ల లాభం లేదు... ఆకలిగా ఉన్నవానికి భోజనం పెట్టడమొక్కటే వారితో సంబంధం పెట్టుకోవడానికి ఉత్తమోత్తమ మార్గము. కాగా స్వేచ్ఛ నిండిన కడుపుతో సమానమని చెప్పడం వలలో చిక్కుకోవటంతోను, భ్రమ పడటంతోను సమానము''. ప్రణాళిక రచన ఆశయంగా సంక్షేమ రాజ్య

సాధనకీ విషయాలు అవసరమని ప్రణాళికా సంఘం చెప్పింది. ఇప్పుడున్న సాంఘిక ఆర్థిక చట్టంలోనే ఆర్థిక కార్యక్రమాన్ని పునఃనిర్మాణం చెయ్యడం మన సమస్య కాదు. ఆ చట్రాన్నే పునర్నిర్మాణం చెయ్యాలి. తద్వారా పనిచేసే హక్కు, తగిన ఆదాయం కలిగి ఉండే హక్కు, విద్యను పొందే హక్కు, వృద్యాప్యం, వ్యాధి, అశక్తత వచ్చినపుడు భద్రతను పొందే హక్కుకావాలనే ప్రాథమిక ప్రేరణలను పునర్నిర్మాణం చేయబడిన చట్రం ఇముడ్చుకో గల్గేటట్లు చెయ్యాలి. భారతదేశంలో శ్రేయో రాజ్య నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం చాలా చర్యలను అమలు జరుపుతోంది.

## ప్రణాళికా విజయం :

ప్రణాళికా రచన ఆర్థికాభివృద్ధి సాధనలో విజయవంతం కావడానికి అవసరమైన పరిస్థితుల్నిచ్చట చూద్దాము : (1) యదార్థాలను తెలియ జేయడానికి ఖచ్చితమైన గణాంకాలు లభ్యంకావాలి. వృద్ధిరేటును. అభివృద్ధి లక్ష్యాలను ఏర్పర్చేందుకు వాటిపై ఆధారపడి కార్యక్రమాలు నిర్ణయించడానికి వీలైనంత నిజమైనవిగా ఉండాలి. అవసరానికి సంగతంగా ఉండటం కూడా అవసరమైన లక్షణము. (2) అవినీతి, బంధుప్రీతి. పక్షపాతములేని సమర్థవంతమైన పరిపాలన కావాలి. (3) ప్రజా సహకారాన్ని రాబట్టడము, అది లభ్యం కావడము అవసరము. (4) దేశీయ, అంతర్జాతీయ వనరులు, సాంకేతిక నైపుణ్యాలు, పరిజ్ఞానము, అవసరము. ఇతర దేశాల సహాయము, సహకారము కూడ కావాలి. (5) సాంకేతిక శిక్షణ సౌకర్యాలు తగినంతగా లభ్యం కావాలి. బాగా శిక్షణ పొందిన వారి చేతుల ద్వారానే కార్యక్రమాలు నిర్వహించబడాలి. (6) తగినట్లు సంచయనం జరగడానికి, పెట్టుబడి చేయడానికి ముందుకు రావడానికి, మూలధనం ఏర్పాటు కావడానికి కావలసిన వాతావరణాన్ని ఏర్పాటుచెయ్యాలి. (7) తగినట్టి, యదార్థ దృష్టిగల్గి ఆచరణలో సాధ్యమయ్యేటటువంటి ఉత్పాదక–ఉత్పత్తి (ఇన్‌పుట్ – ఔట్‌పుట్) నిష్పత్తిని ఎన్నిక చేసుకోవాలి. (8) తగినట్టి, అవసరమైనట్టి లక్ష్యాలను నిర్ణయించి, సాధన కార్యక్రమాలు నిర్వహించడానికి ప్రాధాన్యతా క్రమం (ప్రయారిటి ఆర్డర్) ఏర్పాటు చేసుకోవాలి. (9) పన్నుల విధింపు నిరుత్సాహాన్ని కల్గించరాదు. కాని ప్రభుత్వ ఆర్థిక కార్యక్రమాల నిర్వహణ కవసరమైన రాబడిని ఇవ్వాలి. (10) ఆర్థిక ఆగమన సూచన (ఫోర్‌కాస్ట్), ఆర్థిక గణన (కాలుక్యులేషన్) సక్రమంగా జరగాలి. (11) కార్యక్రమాల అమలు సరిగ్గా జరగడము, వాటి ఫలితాలను శాస్త్రీయంగా మదింపు చేయడము అవసరము. (12) జనాభాను సరైన పరిమాణంలో ఉండేటట్లు నియంత్రణ చెయ్యాలి. (13) ప్రజల దైనందిక ప్రాతిపదిక అవసరాలు తీర్చడానికి కావలసిన ఉత్పత్తిని జయప్రదంగా పొందడానికి, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి ప్రాధాన్యత ఇచ్చి, ప్రజలను సంతృప్తి పర్చి, ప్రజాస్వామిక ప్రణాళికా విధానాన్ని జయప్రదం చెయ్యాలి. (14) ప్రణాళిక ఆశయాలు తగినవిగా నిర్ణయించబడాలి. (15) వృద్ధిరేటుకు ప్రాధాన్యత నిచ్చినా, వ్యక్తి, సమూహ, వర్గ, ప్రాంతీయ సంతులనానికి కొంతైనా ప్రాధాన్యత కావాలి. (16) శ్రామిక సాంద్ర పరిశ్రమలకు, మూలధనసాంద్ర పరిశ్రమలకు తగిన నిష్పత్తి నిర్ణయించాలి. తగిన రీతిలో టెక్నిక్కులను ఎంపిక చేసుకోవాలి. (17) చట్టబదమైన గణాంక శాఖ(సంస్థ), ప్రణాళిక సంఘము అవసరము. (18) ప్రణాళికా విషయాలకు తగిన ప్రచారం తప్పక ఏర్పాటు చెయ్యాలి. (19) దేశప్రజల్లో ఆర్థికాభివృద్ధి కావాలనే కోర్కె ప్రణాళికా రచన విజయానికి సోపానం కావాలి. (20)మార్కెట్లలోని అవకతలను సరిదిద్దాలి. (21) వేతన, ధర్మ, లాభ సంబంధాలను తగినట్లు ఏర్పాటు చెయ్యాలి. (22) ఆర్థిక చట్రంలో అవసరమైన మార్పులు చెయ్యాలి. (23) సమాజానికి లాభదాయకమైన ఉత్పత్తిమీద పెట్టుబడి జరగాలి (24) దేశీయ ముడి పదార్థాలను ఉపయోగించుకునే పెట్టుబడులు అవసరము (25) వాస్తవిక ఆదాయ పంపిణీని మెరుగుపర్చే పెట్టుబడులుకావాలి (26) విదేశీ మారకాన్ని సంపాదించి అనుకూల వ్యాపార సంతులనాన్ని చేకూర్చగల పెట్టుబడికావాలి (27) సాంఘిక ఆర్థిక వ్యవస్థాపనలను అవసరమైన మేరకు త్వరగా ఏర్పాటు చెయ్యాలి. (28) ప్రణాళికా నిర్వహణకు పూర్తి అనుకూలతతో తోడ్పడే సాంఘిక, సాంస్కృతిక, మానసిక, రాజకీయ ప్రవృత్తులు ప్రజల్లో ఉండాలి. అవసరమైతే అట్టి ప్రవృత్తులను ఏర్పర్చడానికి చర్యలు తీసుకోవాలి. (29) దేశంలోపల రాజకీయ సుస్థిరత, శాంతి కావాలి. దేశం బయట నుండి దండయాత్ర ప్రమాదంవల్ల శాంతికి, వివిధ కార్యక్రమాల నిర్వహణకు భంగం కలిగే పరిస్థితులు ఉండకూడదు. (30) సగంమంది ప్రజలు పేదరికం గీత క్రింద ున్నప్పుడు వారి పరిస్థితులను మెరుగుపరిస్తేనే ప్రణాళిక అర్థవంతంగా ఉంటుంది. ప్రజల, ముఖ్యంగా పనిచేసి ఆర్థిక కార్యక్రమాలను విజయవంతం చేయగల ప్రజల, తోడ్పటు లభ్యమౌతుంది. (31) నీతి, నిజాయితీ, నిష్పాక్షికత, శక్తి సామర్థ్యాలు, మంచి జ్ఞానము, త్యాగము, ధైర్యము, కష్టపడి పనిచేసే వైఖరి గల నాయకులు వివిధ రంగాలన్నింటా కావాలి. (32) ప్రణాళికా విజయానికి విజ్ఞతతో, ముందు చూపుతో ప్రభుత్వ, ప్రతిపక్ష భేదాలు లేకుండా అన్ని పార్టీలు కలిసి పని చెయ్యడం చాలా అవసరము. ఇందులో భాగంగానే రైతు సంఘాలకు, శ్రామిక సంఘాలకు, ఇతర వర్గ సంఘాలకు, ప్రభుత్వానికి మధ్య సంఘర్షణ లేకుండా సహకారం ఉండటం అవసరం.

శ్రీ కొడవంటి లీలా మోహనరావు

# గొరిల్లా

క్లాసుకి బయలుదేరిన రవీంద్రకి ఈలలూ, కేకలూ స్వాగతం పలికాయి. అతనిలో చిన్న వణుకు మొదలయింది. ఇవి ఎప్పుడూ ఉన్నవే అయినా అతను రియాక్టు కాకుండా ఉండలేడు. అది భయం కాదు. కోపం కాదు. అసహ్యం కాదు, అవన్నీ కలసిన ఏదో శక్తి అతనిపై దాడి చేసింది. ఇన్నాళ్ళయినా క్లాసుకి పోవడంలో అతనికి ఈజినెస్ లేదు. తను యంత్రం కాదు. బానిస కాదు. రేపటి గురించి కలలింకా చెదరిపోలేదు. ప్రతి చిన్న దాడికి తను చలించక తప్పేదు.

యంత్రం మొరాయిస్తుందా? బానిస తిరగబడతాడా? మరితను? బలిపీఠానికి తీసుకు పోబడుతున్న బలి పసువులాగా అన్పించిందతనికి. ఉపాధ్యాయుడెప్పటికీ ఒంటరి వాడే అన్పించింది. ఉపాధ్యాయుడి మీద రాయి విసురుతే అది ఏ దేశంలోనైనా విప్లవానికి దారి తీస్తుందేమోగాని మన దేశంలో మాత్రం అది వినోదాన్నే ఇస్తుంది. రవీంద్రకు రోమన్ పెతిలియన్ గుర్తుకు వచ్చింది. అవి ఎంతటి క్రూరమైన క్రీడలు! మనిషిని మనిషి చంపుకోవడం. మనిషిని జంతువు చంపడం, వాటిని చూసి అందరూ వినోదించడం, ఇప్పటి ఉపాధ్యాయుడి స్థితి దానికి తక్కువదేం కాదు.

క్లాసు రూములో అడుగుపెట్టిన రవీంద్ర నిర్ఘాంత పోయాడు. విద్యార్థులందరూ ఒక పక్కగా కూర్చున్నారు. మరొక ప్రక్కగా ఒక గొరిల్లా కూర్చొనుంది. ఇంతవరకూ ఎలా వచ్చిందో మరి. చూడ్డానికి భయంకరంగా ఉంది. ఏమవుతుందోనని అందరూ కుతూహలంగా చూస్తున్నారు. దానికి కొంత దూరంలో నలుగురు ఆడపిల్లలు కూర్చున్నారు.

రవీంద్ర దానిని పొమ్మని కేకలేసాడు. అది పలకలేదు. దిక్కులు చూసింది. అందరూ నవ్వుతున్నారు. దగ్గరకు వెళ్ళి రవీంద్ర దాన్ని అదిలించబోయాడు. అది గుర్రు పెట్టింది, చేతులు రెండూ గాలిలో విదిలిస్తూ. విద్యార్థుల్లో మళ్ళా కలకలం. రవీంద్రకేం తోచలేదు. తనకు పట్టనట్టుగా స్టేజిమీదకు వెళ్ళి పుస్తకం తెరిచాడు. పాఠం మొదలెట్టాడు.

గొరిల్లా అంటే మిగతా వాళ్ళకి కొంత భయం తగ్గినట్టుంది. నెమ్మది నెమ్మదిగా దాని పక్క బెంచీలకు విద్యార్థులు సర్దుకున్నారు. బల్లలు కొట్టడం, మాటలు, కేకలు సాగుతున్నాయి. రవీంద్ర పట్టించుకోలేదు. పాఠం చెప్పుకు పోతున్నాడు. అతనికి అయిదేళ్ళ క్రిందటి సంఘటన గుర్తుకి వచ్చింది. రాఘవరావు కొత్తగా ఉద్యోగంలోకి చేరాడు. చేరిన రోజునే క్లాసుకి వెళ్ళాడు. గొడవ జరుగుతే బెదిరి పోయాడు. తిరిగి వస్తూనే ఎవ్వరికీ చెప్పకుండా ఉద్యోగం వదలి వెళ్ళిపోయాడు.

ఈ గొడవకి గొరిల్లాకి ఆవేశం వచ్చినట్టుంది. అందిన పుస్తకం తీసుకొని రవీంద్రమీదికి విసిరింది. అందరూ చప్పట్లు చరిచి నవ్వారు అందరివేపూ చూస్తూ గొరిల్లా పళ్ళు ఇకిలించింది. రవీంద్ర మళ్ళా పాఠం కానిచ్చాడు. ఇంతలో కేక విన్పించి చూసాడు. గొరిల్లా డెస్కుమీదికి ఎక్కి ఒక ఆడపిల్ల చీర పట్టుకు లాగింది. ఆ అమ్మాయి కెవ్వున అరచి పైకి పరిగెట్టింది. ఆమెతో పాటు మిగతా అమ్మాయిలు కూడా పరుగెట్టారు. క్లాసురూములో గడబిడ ఎక్కువయింది,

ఇక లాభం లేదని రవీంద్ర ప్రిన్సిపాలును పిల్చుకు వచ్చాడు. సీటులోనుండి డిస్టర్బు కావడం ఆయనకు ఇష్టపడదు. తనకు ఫిర్యాదు చేసినందుకు రవీంద్రమీద చాలా కోపం వచ్చింది. అయినా సరే రూముకి వచ్చి చూసాడు. గొరిల్లాని చూడగానే ఆయనకి గుండెల్లో రాయిపడింది. బయటికి పొమ్మని దాని దగ్గరగా వెళ్ళి అరిచాడు. పిడికిలితో బల్లమీద గుద్ది గొరిల్లా గుర్రు పెట్టింది. ప్రిన్సిపాలు జడుసుకున్నాడు. అడుగు వెనక్కి వేసాడు.

''యు మస్ట్ బి టాక్ట్‌ఫుల్'' అని రవీంద్రతో అనేసి వెళ్ళిపోయాడు:

టీచర్సు గదిలోకి వచ్చి రవీంద్ర ఉస్సురని కుర్చీలో కూలబడ్డాడు. మూల కుర్చీలో ఉన్న నరసయ్యగారు రవీంద్ర ముఖం స్టడీ చేసారు. ఆయన ముఖం కళకళ లాడింది.

''ఏమయిందీ...?'' అన్నాడు.

''ఏముందీ మామూలే...ఈరోజు శ్రుతిమించింది''అన్నాడు రవీంద్ర. ''ప్చ్ .. తగలబడిపోతోంది ...'' అని సానుభూతి చూపించాడాయన. సహోద్యాయుల అవస్థలు ఆయనకు వినోదం. తర్వాత గంట అదే క్లాసు నుంచి వినాయకరావు వచ్చాడు. వస్తూనే ఏమీ జరగనట్లుగా గంభీరంగా కుర్చీలో కూర్చున్నాడు. అతన్ని చూసి నరసయ్యగారు నిరాశపడ్డారు.

''క్లాసు ఎలా వుంది...?'' అని అడిగాడు.

''ఎలా వుంటుంది, బాగానే వుంది'' అన్నాడు వినాయక రావు చిరాగ్గా, అది నటన అని రవీంద్రకు తెలుసు. నరసయ్యగారికి కావలసిన సమాధానం రాలేదు.

''అహ కాదు... వాళ్ళ గూర్చి రవీంద్ర ఏదో చెప్తుంటేనూ...'' అన్నాడు. ''వస్తాను, పనుంది'' అని వినాయకరావు లేచి వెళ్ళిపోయాడు. నరసయ్యగారు [illegible]

మధ్యాహ్నం ఇంటర్వెల్ బెల్ కొట్టారు. పిల్లలందరూ బయటకి వెళ్ళిపోయారు. గొరిల్లాకి ఆకలివేసింది. బయటికి బయలు దేరింది. గేటు ఎదురుగా ఒక దుకాణం కన్పడింది. అరటి పళ్ళ గెలలు వేలాడు తున్నాయి. ఇద్దరు ముగ్గురు విద్యార్థులు అక్కడ నిలబడ్డారు. గొరిల్లా అక్కడకు గబగబా వెళ్ళింది. విద్యార్థులు భయపడి చెదిరిపోయారు. ఒకడు తన చేతిలో ఉన్న అరటి పండు దానికి ఇచ్చివేసాడు.

గొరిల్లాకు ఆకలి తీరలేదు. గెల దగ్గరకు వెళ్ళింది. 'ఏయ్ దగ్గరకు రాకు'' అని కొట్టువాడు అరిచాడు. గొరిల్లా గుర్రుపెట్టి గెలమీద చెయ్యి వేసింది. కొట్టువాడు చేతుసన గెంతి కర్రతో దాని నడుం మీద వేసాడు. గొరిల్లా బాధతో మూలిగింది. ''నీ జులుం నా దగ్గర చెల్లదు'' అని మళ్ళా కర్రనెత్తాడు. గొరిల్లా పరుగెత్తింది.

గొరిల్లా వీధిన పడింది. కడుపులో నకనక లాడుతోంది. తిండి కోసం వెతకడం మొదలెట్టింది. తోవలో మిఠాయిదుకాణం కన్పడింది. వంటకాలు అద్దాలలో అందంగా ఉన్నాయి. గొరిల్లాకి ఆత్రం ఎక్కువయింది. గబగబా వెళ్ళి దాని మీద పడింది. మిఠాయివాడు సిద్ధంగానే ఉన్నాడు. పొయిలో కర్రతీసి దానిమీదికి విసిరాడు. గొరిల్లా బెదిరిపోయింది. దానికి పిచ్చెత్తినట్టయింది. కడుపు తిరుగుబాటు చేస్తోంది. క్లాసులో తన దుర్మార్గం చెల్లింది. కాని వీధిలో ఎందుకూ కొరగాకుండా పోయింది.

తను విడిచిపెట్టిన లోకంలో తనదే అధికారం. తిండి తన దగ్గరకే వస్తుంది. తిరగడం, నిద్రపోవడం. మరొక పనిలేదు. ఎందరికో తనని చూడడం వింత. కాని ఇక్కడ తను ఏమీకాదు తన శక్తి, తన క్రౌర్యం ఏమీకాదు.

రోడ్డు మధ్య నిలబడి రెండు పిడికిళ్ళు బిగించి గట్టిగా అరచింది. జనం చెల్లా చెదురుగా పరుగెట్టారు. ట్రాఫిక్కు ఆగిపోయింది. సరిగ్గా అదే సమయానికి అక్కడకు ఒక జీపు వచ్చి ఆగింది. ఆ వెనకనే ఒక వేన్ వచ్చి ఆగింది. వెంటనే గబగబా ''జూ'' పనివారు ఆయుధాలతో దిగారు.

ఆ సమయానికి రవీంద్ర అక్కడకు రావడం జరిగింది. ''ఏమిటి సంగతి ?'' అని అతను అడిగాడు.

''రెండ్రోజుల కిందట 'జూ'నుండి తప్పించుకుంది. దాని కోసం మేం వెదకని చోటులేదు. థాంక్ గాడ్ — ఎలాగైతేనేం దొరికింది'' అన్నారు వాళ్ళు.

గొరిల్లాను వేన్‌లోపకి ఎక్కించుకొని పోయారు. రవీంద్ర బాధతోనూ, ఆశ్చర్యంతోనూ నిలబడి పోయాడు. గొరిల్లా గురించి అతను బాధ పడలేదు. అది చేరవలసిన చోటుకి చేరింది. కాని ఈ కొద్ది కాలంలోనూ దానివల్ల తనకు యాతన తప్పలేదు.

# సంగీతం - సౌందర్యం

## నిఖిల్

భూమి నొసలుగా విస్తరించిన
 ఆకాశంపై సాయంత్రపు కుంకుమరేఖలు
జీవిత నిజాలు గీసిన రక్తపుచారికలు.
రోజూ మునిగి ఉబికే
సూర్యుడి మండే చేతుల్లో
సంగీతం—సౌందర్యం—ఆనందం
అనంతంగా వ్యాపించేదెపుడు ?
నిజంగానే అవధులులేని
తారతమ్యాలనే భేషజాలులేని
బతుకుపాటల్లో జ్వలించే మధురస్వనాలు
అటు ఎర్ర ఇండియన్‌ల అపాచీల
రాత్రిని జోకొట్టే ఆదిమ సంగీతాలు
నీగ్రోల నల్లని శరీరాల స్వేదబిందువుల్లో
తరతరాల అణగిన ఆర్తిని ఎలుగెత్తే గానాలు.
తెల్లవాడి ఆత్మపరిశీలనా గీతాలు
సాంద్రాజాన్‌సన్‌లో ప్రతిస్పందించి,
ఇటు భాషల రంగుల —
తరతమ భేదాలను దూసుకుని జాలువారినా,
సంగీత-సౌందర్యాలు ఈనాడు
జానపదుల గుండెల్లోంచి
జనపథంలో పయనించడం మానేసి
కొందరి సొత్తుగా మరికొందరి ఆనందంగా
వున్నవాడి కాలక్షేపంగా
ఊడిగం చేయడం
సంగీత సౌందర్యాలకు
కంచెలు వేయడం.

శ్రీ కుంటిముక్కల లక్ష్మీనారాయణశర్మ

# భాషా వైవిధ్యం - తెలుగు*

బహుకాలంగా జరుగుతున్న భాషా కృషిని పరిశీలిస్తే ఫలితాలు కొన్నిసార్లు సార్వజనీనము – ఏకత్వ బోధక సిద్ధాంతాలను బోధిస్తే మరికొన్ని సార్లు భాషాంతర్గత, భిన్న భాషా భిన్నత్వాల్ని సూచించే విధానాలకు ప్రతిపాదక సిద్ధాంతాల్ని వెలువరించినట్లు తోస్తుంది. సమాజంలో వైవిధ్యం (Variation) పలురకాలుగా ఉన్నా అప్పుడప్పుడూ భాషావైవిధ్యం పొడచూపుకొచ్చినట్లు కన్పించినా అక్కడక్కడ అప్పుడప్పుడు జరిగిన పరిశోధనలు భాషాశాస్త్రజ్ఞుల నిర్లక్ష్యానికే గురయాయి. గత దశాబ్దంలో జరిగిన కృషిని పరిశీలించడంవల్ల సిద్ధాంతకుల్లో కలిగిన విభజనను గుర్తించవచ్చును. ఒక వర్గం వారు (స్థూలంగా వికసన – పరివర్తన సిద్ధాంతం అవలంబించేవారు) వైవిధ్యాల్ని వివరిస్తూ విశ్వభాషా సిద్ధాంతం వైపు పరుగుతీస్తుంటే, మరో వర్గం వారు (స్థూలంగా లెబోవ్ మార్గాన్ని అనుసరిస్తున్నవారు) వైవిధ్యాలు ఏర్పడటానికి గల కారణాలను వెదికే ప్రయత్నంలో భిన్న విషయాలతో సిద్ధాంతాలను ముడిపెట్టి విధానాలను వెలికి తీస్తున్నారు.

ఆధునిక విధానాలను సూచ్యప్రాయంగా పేర్కొంటూ, తెలుగు కనబరిచే భాషావైవిధ్య లక్షణాల్ని వివరించటం ఈ వ్యాసానికి పరమ ప్రయోజనం. అక్కడక్కడ కన్పించే పునరుక్తులు విషయోద్ఘాటనంలో కలుగుతున్న సంశ్లిష్టతను సులభం చేస్తాయి.

వైవిధ్యాన్ని పేర్కొనడంలో వైవిధ్యకం (Variable) వాడడం ప్రస్తుత విధానాల్లో గమనించతగ్గది. వైవిధ్యకాలు ఎన్నో వైవిధ్యత (Variant)లను సూచిస్తుంటాయి. ఉదాహరణకి: బ్రహ్మణ భాషను, అబ్రహ్మణ భాషను వ్యాకరించేప్పుడు మహాప్రాణత్వం ఒకానొక వైవిధ్యకంగా ఉపయోగిస్తుంది. మహాప్రాణత్వం ఆ స్థానే ప్రయోగింపబడే ఇతర ధ్వనులు వైవిధ్యతలుగా గుర్తింపవచ్చును. వైవిధ్యకం ప్రాముఖ్యత ఎప్పుడూ వైవిధ్యతల్ని ఆశ్రయించి ఉంటుంది. అన్ని వైవిధ్యతలూ వైవిధ్యకస్థాయిని చేరుకోలేవు. వైవిధ్యాన్ని సూచించే వైవిధ్యకాలు మూడురకాలుగా ఉండవచ్చును. అవి: సూచికలు (Indicators) సంకేతం (Marker) గతానుగతికం (Stereo-type) సమాజ–ఆర్థిక వ్యవస్థతో సంబంధం కలిగి ఉండి పట్టికమూల్యం (Indexical Value) పొందే వైవిధ్యకం సూచికగాను, సమాజ సందర్భంతో ముడివడి పట్టికామూల్యం సూచించే వైవిధ్యకం అనీ, సూచికలక్షణాలతో కూడి శైలీవైవిధ్యం ప్రతిబింబించే వైవిధ్యకం సంకేతం అనీ నిర్వచించవచ్చును. ఒక్కో భాషకు ఉన్నస్థితి, సమాజ సందర్భాలను అనుసరించి వైవిధ్యకాలు భిన్నంగా ఉపయోగపడుతుంటాయి. ఈ విషయాల్ని క్లుప్తంగా, స్పష్టంగా పట్టికలో గుర్తించవచ్చును.

| వైవిధ్యక లక్షణం | సమాజ–ఆర్థికవర్గం (విద్యావంతులు/ నిరక్షరాస్యులు) | సమాజ సందర్భాలు (అంతర్గత/బహిర్గత మొ.) |
|---|---|---|
| X | + | − |
| Y | + | + |
| Z | − | + |

పైన ఉపయోగించిన X, Y, Z లు అమూర్త (Abstract) వైవిధ్యకాలు. సూచించిన ఫలితాల్నిబట్టి మొదటిది సూచికగా, రెండోది సంకేతంగా, మూడోది గతానుగతికంగాను స్థిరపడుతుంది. స్థూలంగా చెప్పాలంటే అమూర్త విధానాలకీ, భాషా ప్రతిరూపాలకీ జరుగుతున్న సంఘర్షణే వైవిధ్యకం. ఇకపోతే, భాషా వైవిధ్యాన్ని మూడు విభాగాలుగా సూచించవచ్చును.




ఒక్కో విభాగాన్ని గుర్తించేందుకు ప్రత్యేక లక్షణాలున్నాయి. ఇదివరలో ఉదాహరించిన ఆధునిక విధానాలను మిళితం చేస్తూ లక్షణాలను పేర్కొంటూ ఇప్పటివరకూ జరిగిన, జరుగుతున్న కృషిని ముందు వ్యాస భాగంలో చర్చిస్తాను.

## మాండలికం :

సూచికలో ఉదాహరించినట్లు ఈ విభాగపు వైవిధ్యం ముఖ్యంగా మూడు రూపాల్లో ఉంటుంది. అంటే వైవిధ్యానికి

* ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ 66 వ వార్షిక సమావేశం (మానవశాస్త్ర విభాగం) లో చదివిన వ్యాసంపై ఆధారపడింది.

1 భిన్న సమయాలకు చెందిన మాండలిక వైవిధ్యాల్ని ప్రస్తుత సమాజంలో చూడలేం. లిఖిత సామగ్రి ద్వారా సేకరించిన సమాచారంతో సమాజ, ప్రాంతీయ మాండలికాలు ఎలా భేదం చెందుతాయో తెలుసుకోనవచ్చును. అప్పుడప్పుడు ప్రస్తుత వైవిధ్యాల్ని పరిష్కరించడానికి అధికంగా సహకరిస్తాయి.

కారణాలు మూడు రకాలుగా చెప్పుకోవచ్చును— అవి : ఒకే కాలంలో ఒక ప్రాంతంలో ఉన్న వాడుకకు, మరొక ప్రాంతంలో ఉన్న వాడుకకు మధ్య సమాన శబ్దాల్లోను, వర్ణాల్లోను, వ్యాకరణ భాగాల్లోను తేడాలు ఉండటం, సమాజంలో ఉన్న భేదాలు—ఆర్థిక సాంస్కృతిక పరమైనవి కలిగి ఉండటం, ఇదివరకు ఒక కాలంలోఉన్న రూపాలకు, తరువాతి కాలంలో ఏర్పడిన తుల్య రూపాలకు మధ్య భిన్నతలు ఉండటం.

## ప్రాంతీయం :

హిందీ తర్వాత అధికాధికంగా మాట్లాడబడే భాష తెలుగే. అందుకే వైవిధ్యం ప్రాంతీయంగా గుర్తిస్తున్నప్పటికీ రాష్ట్రేతర ప్రాంతంలోను, విదేశాల్లోను మాట్లాడే వారి సంఖ్యను మర్చిపో కూడదు. ఇతర భాషల్లో ఈ విభాగంలో జరుగుతున్న కృషి దృష్ట్యా మన ప్రయత్నాలు పోల్చిచూస్తే అతి తక్కువ. వర్తమానంలో జరుగుతున్న కృషి ఆంధ్రరాష్ట్రంలో మాట్లాడుతున్న తెలుగుకే పరిమితం అవడం విచారకరం. ఇతర ప్రాంతాల్లోను, దేశ విదేశాల్లోను నివసించే తెలుగువారి భాషా వైవిధ్యాన్ని గుర్తించే ప్రయత్నం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆదిలో ప్రాంతీయ మాండలికాల్ని సశాస్త్రీయంగా పరిశీలించి విభజించిన ఘనత గ్రియర్‌సన్, స్టెన్‌కొనోలకు దక్కుతుంది. మళ్లీ నాల్గు దశాబ్దాల నిశ్శబ్దానంతరం భాషా పర్యవేక్షణ మరో మలుపు తీసుకొంది. ప్రస్తుతం సేకరణ మూడు రకాలుగా (పద, మాండలిక, సామాజిక) కొనసాగుతోంది. (పూర్తి వివరాలకు చూడుడు: రాధాకృష్ణ 1977 : 14–23)

లోగడ కృష్ణమూర్తి (1962) వృత్తిపద పరిశోధన ఆధారంగా తెలుగునాడును నాలుగు భాషా మండలాలుగా విభజించారు. అవి : పూర్వమండలం (కళింగదేశం : శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు), దక్షిణ మండలం (రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు) ఉత్తర మండలం (తెలంగాణా, మహబూబ్‌నగర్, ఖమ్మం జిల్లాల్లో కోస్తా రాయలసీమను ఆనుకొన్న తాలూకాలు ఆయా భాషా మండలాల్లో కలుస్తాయి), మధ్య మండలం (ఉభయ గోదావరులు, గుంటూరు, కృష్ణా జిల్లాలు). ఈ వాదానికే బహుళ ప్రచారం లభించినా శ్రీహరి (1972), నరసింహారెడ్డి (1975) తదితరుల పరిశోధనలు నాల్గుమండలాల్ని మూడుగా కుదించవచ్చు అని తేల్చాయి. ముఖ్యంగా నర్సింహారెడ్డి (1975 : 27) పొందుపర్చిన వర్ణ, వ్యాకరణ పట్టిక ఈ విషయాన్ని నొక్కి చెప్తుంది. ఫలితంగా ఏర్పడే మండలాలు మూడు. అవి : ఉత్తర, దక్షిణ, కోస్తా (మధ్య—పూర్వ ప్రాంతాలు కలసి) మండలాలు.

## కోస్తామాండలికం :

పూర్వమండలంపైనమూ, తూర్పుగోదావరిపై హిందీ ప్రభావం ఎక్కువ. శ్రీకాకుళంపై ఒరియా ప్రభావమూ ఉంది. ఈ ప్రాంత వ్యవహారమే ప్రామాణిక తెలుగుగా చలామణియౌతోంది ఏది ప్రమాణం ఏది కాదు అన్న ప్రశ్నలకు సమాధానాలు సరిగా విన్పించడంలేదు. జరుగుతున్న చర్చల్ని కృష్ణమూర్తి (1974 : 402 – 404, 1976) పరిశోధనల్లో చూడవచ్చును. ఈ మాండలికపు లక్షణాలలో కొన్ని :

1) క్రియారూపాల్లో దీర్ఘాచ్చులు ఉండడం. ఉ: వచ్చాడు వ్రాసిం భూతకాలికరూపంలో విన్పించడం ప్రామాణికత.

2) తాలవ్యీకరణం — యపూర్వంగా ఉన్న త, ద లు చ, జలు గా మారడం సర్వ సాధారణం. ఉదా: ప్రత్యేకం—ప్రచ్చేకం, మధ్య—మజ్జ.

3) పదమధ్య వకారం ఒకారంగా మారడం—ఉ: మనవాళ్లు—మనోళ్లు, కుర్రవాళ్లు — కుర్రాళ్లు.

4) సౌలభ్యం కోసం పద మధ్యంలో క, వ లు లోపింపజేయడం. ఉదా : లేకపోతే — లేపోతే. మగవాళ్లు — మగాళ్లు.

## దక్షిణ మండలం :

సరిహద్దున పశ్చిమ ప్రాంతం వారిపై కన్నడమూ, తూర్పు వారిపై తమిళమూ ప్రభావం చూపుతున్నాయి. ప్రామాణిక తెలుగు (ప్రా. తె.) క్రియా రూపాలను అర్థకాలో ప్రయోగించడం విశేషం. ఉదాహరణకి — భూతకాలిక రూపం ఏ కు బదులుగా — ఇ ని ఉపయోగించడం వచ్చాడు — వచ్చినాడు. మిగిలిన లక్షణాల్లో కొన్ని :

1) ప్రా. తె. లోని ద్వితీయ, చతుర్థీ విభక్తు (ని,కి) లు బదులుగా ను, కు లు వాడడం — ఉదా —

ప్రా. తె. కుక్కని—కుక్కను
నక్కకి—నక్కకు

2) సంఖ్యార్థకంలో ఇన్ — వాడటం. వందకు బదులుగా నూరు వాడటం. ఉదా —

ప్రా. తె. వంద—నూరు, రెండువందలు — ఇన్నూరు, మూడువందలు—మున్నూరు నాల్గు వందలు — నాన్నూరు.

3) భూతకాలిక ప్రత్యయాలైన — తి, - టిల తర్వాత ప్రథమ పురుష బహు వచనంలో - మి రావటం.

ఉదా — వచ్చాము - వస్తిమి, విన్నాము — వింటిమి.

4) కాంక్షార్థక సంసక్త బహువచన రూపంలో శ్వాసత కన్పించడం : ఉదా : ప్రా. తె. చేద్దాం — చేస్తాం.

## ఉత్తర మండలం :

నిజామాబాద్, మెదక్‌లపై మరాఠీ, కన్నడ ప్రభావం కొద్దిగాను, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్‌లపై మరాఠీ, కన్నడ ప్రభావం అధికంగాను కన్పిస్తుంది. వరంగల్, ఖమ్మంలు హిందీ ప్రభావానికి లోనవుతాయి...

1) కాలరూపాల్లో హ్రస్వాచ్చులు ఉండడం : ఉదా : ప్రా. తె. వచ్చాడు — వచ్చిండు, తింటాడు — తింటడు.

2) కాంక్షార్థక సంసక్త బహువచన రూప ప్రత్యయం ప్రాతిపదికలో నాదత కల్పించడం. ఉదా : ప్రా. తె. చేద్దాం — చేజ్దాం. ఇందులో విన్పించే నాదత ఆంగ్ల Z వర్ణ ఉచ్చారణతో సమంగా ఉంటుంది.

3) పదాదిన అకార, ఇకారా (దీర్ఘ, హ్రస్వ) ల ముందు గ కారాన్ని చేర్చటం. ఉదా : ప్రా. తె. అక్కడ (▷ ఆడ) —గాడ, ఇక్కడ (▷ ఈడ) — గీడ, అది — గది, ఇది — గిది.

4) పదాంశ వ్యవధి న ర, ల మధ్య వర్ణవ్యత్యయం కూర్చటం. ఉదా : ప్రా. తె. ఊళ్ళు — ఊర్లు, బర్రెలు — బర్లు.

## సమాజ మాండలికాలు :

వాడుకలోను, లేఖనంలోను కన్పిస్తున్న వైవిధ్యాన్ని ఎత్రిమ్నా లోగడ కృష్ణమూర్తి (1972) ఫీస్ల శైలుల్ని విడదీసారు. ఇటీవల శివరామమూర్తి (1977) వర్గమూ, కులమూ భాషలో ఎలా ప్రతిబింబితమవుతాయో ఈ మధ్య జరిపిన పరిశోధనల్లో సూచించారు. ఈ విభాగంలో శాస్త్రజ్ఞులు ఉపయోగిస్తు 'వర్గ' పదం కొన్నిసార్లు సమాజపరంగాను, మరికొన్నిసార్లు సమాజంలో ఒక భాగాన్ని సూచించేదిగాను వాడటం గమనార్హం. వైవిధ్యాన్ని విలోకించి ఈ విభజన ప్రతిపాదించవచ్చును.




విభజనలో ఇంకా కొన్ని విభాగాలను, వైవిధ్య విధానాలను అనుసరించి పాటించ వచ్చును. ప్రకటనావైవిధ్యంలో స్వతంత్రత ఉన్నా ఆశ్రయాను కూలంగా ఇవి ఒకదానిని మరొకటి పెనవేసు కొని ఉంటాయి. పూర్తి వివరాలు ఇవ్వడానికి, స్వతంత్రవిభజనకి, సార్వజనీన సిద్ధాంతాలు కల్పించడానికి తగిన కృషి ఇంకా ప్రారంభం కాలేదనే చెప్పాలి. స్థూలస్థాయి (MacroLevel) లో (వర్గ — కుల మాండలికాల) మధ్యదూరం/భేదం అధికంగా కన్పిస్తే, సూక్ష్మ స్థాయి (MicroLevel) లో (ఉదా :- ఆదాయ — వయస్సు) మధ్య దూరం/భేదం అల్పంగా ఉంటుంది.

జరిగిన కృషి తక్కువ కనుక కన్పిస్తున్న ఉదాహరణలు ద్వైవిధీ భావానికి చోటిస్తాయి. ఉదాహరణకి : ఛాందసులైన బ్రాహ్మణకులాల్లో మాట్లాడే మాటల్లో షకార ప్రయోగం ఎక్కువగా కన్పిస్తుంది : కాదషే=కాదటే, అవునషే=అవునటే మొ. విద్యావంతుల ప్రయోగంలో మహాప్రాణాలు నిలవటం, ఆంగ్ల పదాలు తరచూ దొర్లింప జేయడం గమనించ వచ్చును. దీనిలో మొదటి ఉదాహరణ కుల మాండలికానికి, రెండోది వర్గ మాండలి కానికి ఉదాహరణగా నిలుస్తుంది.

## సమయ మాండలికం :

ఈ విభాగం శాసన, కావ్య, ఆధునిక మాండలికపు మడతల్లో ముడిపిస్తుంది. ఎన్నో లక్షణాల్లో మొదటి దానికి రెండో దానికి పోలిక లుంటే, ఆధునికంలో కన్పించే శైలీ లక్షణాల మూల రూపాల్ని శాసన మాండలికంలో చూడవచ్చును.

## శాసన మాండలికం :

ఉపవిభజనలు ఎన్ని ఉన్నా మొత్తాన్ని పరిశీలిస్తే పైకితేలే ముఖ్యలక్షణాల్లో కొన్ని :

1) మూల ద్రావిడ★లు (Z) కారం పదవ శతాబ్దివరకూ భద్ర పరుపబడడం :—ఉదా — ఖలుగ — ఖడ్గ

2) పదమధ్యంలో—న్డ—వంటి సంయుక్తాక్షరాలుండటం. ఉదా - వాన్డు — వాడు.

3) తాలవ్యీకరణం భాషలో క్రీ॥ శ॥ 4 వ శతాబ్దినే ప్రారంభమైనా, శాసనాల్లో ప్రాచుర్యంగా పద్నాలుగో శతాబ్దివరకు తాలవ్యీకరణం కాని రూపాలు పట్టుబడడం గమనార్హం.
ఉదా : కేయు — చేయు, కేసిరి — చేసిరి. మొ॥

4) లోపదీర్ఘత — మువర్ణాంత పదాలు బహువచనంలో అంత్య వర్ణం కోల్పోవడం, తత్ఫలితంగా పూర్వాచ్చు దీర్ఘం కావడం ఆధునిక వ్యవహార ప్రసిద్ధమైన విషయం. ఇదే విషయం శాసనాల్లో కన్పిస్తుంది. ఉదా : కుంచములు బదులుగా కుంచాలు.

## కావ్య మాండలికం :

దీన్నే ప్రాచీన తెలుగుగా వ్యవహరించవచ్చును. ఆధుని కాంధ్రానికి, దీనికిగల వైవిధ్య పరిశీలన అన్నపూర్ణమ్మ (1977) పరిశోధనల్లో స్పష్టం. ప్రాచీన తెలుగు వైవిధ్యానికి ముఖ్య లక్షణాలు కొన్ని :

1) వర్ణాలో ర, ఱ లు భిన్నంగా ఉండటం : ఉదా : అరుగు — వెళ్ళు, అఱుగు - నశించు.

2) పదాదిన సంయుక్త ప్రాచుర్యత. ఉదా: ప్రొద్దు మొ॥

3) **మూర్ధన్యతకు** పదాదిన మకుటం లభించడం. ఉదా: డాగు (= దాగు), డప్పు (= దప్పు)

4) నిర్దేశక సర్వనామాలు ఔప విభక్తిక **రూపం** ఏర్పరచుకోవటానికి వర్ణవ్యత్యయం పొందడం.

ఉదా : (అవి>) వాని (= వాటి), (ఇవి>) వీని(=వీటి), (ఎవి>) వేని (= వేటి)

## ఆధునిక మాండలికం :

అంతర్గతంగా ఇదివరలో వర్ణించిన ప్రాంతీయత ఇందులో తిరిగి చిగురిస్తుంది. దీన్ని ప్రామాణికత్వంతో జతచేరుస్తూ కొన్ని ముఖ్యలక్షణాలు పేర్కొనవచ్చును.

1) ఎ, ఏ లు వర్ణవిధానంలో వ్యక్తీకరింపబడుతున్నాయి. ఉదా : వెన్న, పేడ మొ.

2) ఆంగ్ల, ఫారసీక భాషా ప్రభావాలవల్ల ఫ (*f*) వర్ణంగా విస్తరించడం. ఉదా : కాఫీ, ఫిర్యాదు.

3) దీర్ఘాక్షరాల తర్వాత అనునాసిక సంయుక్తత కోల్పోవటం. ఉదా : (వాండు =) వాడు మొదలైనవి.

## శైలీ వైవిధ్యం :

ఏవక్తైనా ఇతర వ్యవహర్తలతో ఏకత్వాన్ని పంచుకుంటూ వ్యక్తిగతంగా వైవిధ్యాన్ని వ్యక్తం చేస్తే దాన్ని శైలిగా స్థిరపర్చవచ్చును. శైలీ వైవిధ్యం మండలాలకు అతీతం. సర్వత్రా సాక్షాత్కరిస్తుంది. ఇప్పటికీ, శైలి కులాంతర్గతమైందా? వర్గాంతర్గతమైందా అన్నచర్చలు కొనసాగుతునే ఉన్నాయి. తెలుగు భాష లేఖన వ్యవహారం, విద్యావంతుల—నిరక్షరాస్య వ్యవహారాలు ప్రమాణ-అప్రమాణ శైలీ వైవిధ్యాన్ని సూచిస్తాయి. విపుల చర్చను కృష్ణమూర్తి (1972), మోహన్రావు (1977) లలో విలోకించవచ్చును. శైలీ వైవిధ్య ముఖ్యలక్షణాలు కొన్ని :

1) ప్రామాణిక తెలుగు లక్షణాలు (ఉదాహరణకు : ఒత్తులు సరిగ్గా పలుకడం, హకార, చకార, శ, ష, సలు సరిగ్గా పలుకడం **మొదలైనవి.**) వాడుక భాషలో నిలుస్తాయి. నిరక్షరాస్యుడైన వ్యవహర్త ప్రమాణ వ్యవహారాన్ని అనుకరించే ప్రయత్నం నిరంతరం కొనసాగిస్తుంటాడు. అంతర్గత వ్యవహారాల్లో 'బక్తి'గా పలికినా బహిర్గతంగా మాత్రం 'భక్తి'గా పలుకుతాడు.

2) ప్రమాణత్వం ప్రయత్నించడంలో కృతక ప్రమాణ రూపాలు పలురకాలుగా ప్రవేశిస్తాయి. ఉదా : ఖథ (కథ) ఘాంధీ (=గాంధీ), ధారం (=దారం)

3) విద్యావంతులైన అబ్రహ్మణుల బహిరంగ వ్యవహారాలలో సమాజ మాండలిక లక్షణాలు ప్రకటించడం. ఉదా :ఇంటికాడ (=ఇంటి దగ్గర), అసుమంటి (=అటువంటి) ఉండాయి (=ఉన్నాయి), ఉంటాది (=ఉంటుంది).

## ఆరోపణ వైవిధ్యం :

ప్రయోజనాన్ని బట్టి (ముఖ్యంగా వృత్తుల వారీగా) వైవిధ్యం ఏర్పడితే ఆరోపణంగా స్థిరపడుతుంది. శైలికీ, - ఆరోపణానికి గిరిగీసి చూపడం కష్టం. లక్షణాలు అంతర్గతంగా కలగా పులగంగా ఉంటాయి. ఆరోపణ ప్రయోజనాల్ని—వర్ణ, వ్యాకరణ, నిఘంటు లక్షణాల్ని గుర్తిస్తూ ప్రత్యేక పరిస్థితులతో జతపర్చ వచ్చని వర్మ [?] అభిప్రాయపడుతున్నారు. చారిత్రకంగా ఉన్న స్థితిని అనుసరించి తెలుగులో న్యాయస్థాన, పాలన విభాగ ఆరోపణలు ప్రత్యేకంగా ఉన్నాయి. ద్విభాష, బహుభాషా పరిస్థితి గల దేశాల్లో ఆరోపణం ఏర్పడడం ముఖ్యంగా సంస్కృతిపై, సంపర్క భాషపై ఆధారపడి ఉంటుంది. ఇటీవలి పరిశోధనల్లో కృష్ణమూర్తి (1977) పత్రికారోపణం పలు రకాలుగా ప్రాముఖ్యం చెందుతూ ప్రత్యేకత ఆపాదించుకుంటున్నదని గుర్తించారు. ఆరోపణాలు ఏర్పడేప్పుడు భాషలో కొన్ని ప్రక్రియలు జరుగుతుంటాయి. వాటిలో కొన్ని :

1) అర్థిక పరిధి విస్తరింపు—సీమితార్థంలో స్థిరపడి ఉన్నపదాలు పదబంధాలు, సంపర్కభాషనుంచి దిగుమతి అవుతున్న అర్థాన్ని బోధించడం. ఉదాహరణకి : విడుదల చేయు. ఈ క్రియ ఇదివరలో వ్యక్తులకే పరిమితం ఆంగ్లభాషపు 'రిలీజ్'కు సమానంగా వాడటం ప్రారంభించినప్పట్నించీ పుస్తకానికి, వార్తలకి, సరుకులకి, నీళ్లకు వాడటం సర్వసాధారణమైంది.

2) దేశ్యపదాల్తో విదేశీ భావాలను అనువదించడం—ఉదా : స్మగుల్డ్ గూడ్స్—దొంగ సొమ్ము.

ఈ పదబంధంలో 'దొంగ'కు 'అనధికారం' అనే అర్థం ఉంది.

3) సంస్కృత పదాలకు, పదబంధాలకు మూలార్థాన్ని మరచి కొత్త అర్థాన్ని చెప్పడం. ఉదా : రేడియో-ఆకాశవాణి.

4) వేరొక భాషను అనుకరిస్తూ సమాసాల్ని కూర్చడం ఉదా : డీసెంట్రలైజేషన్— వికేంద్రీకరణ, ఫామిలీ ప్లానింగ్—కుటుంబనియంత్రణ.

ముందు విభాగాల్లో చర్చించిన వైవిధ్య లక్షణాల వలన రెండు విషయాలు స్పష్టమవుతాయి. తెలుగు భాషలో పర్యవేక్షక కృషి అధికంగా జరగవలసి ఉందని, ఇతర భాషా ఫలితాలతో పోల్చి విశ్వ భాషా సిద్ధాంతాన్ని, సాంఘిక సమస్యల్ని పరిష్కరించవచ్చని తెలుస్తోంది.

## రిఫరెన్సులు

Annapurnamma, R. 1977 : 'A contrastive Analysis of old Telugu and Modern Telugu' పరిశోధక సిద్ధాంత వ్యాసం, అన్నామలై నగర్.

Krishnamurthi, Bh. 1962 : మాండలిక వృత్తి పదకోశం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్.

1972 : 'Bilingualism and Social Dialects in Telugu' (Mimeo).

1974 (a) : (సం) తెలుగుభాషా చరిత్ర ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాద్.

1974 (b) : 'తెలుగు మాండలికాలు – ప్రమాణ భాష', కృష్ణమూర్తి 1974 (a) లో.

1976 : 'Language Standardization in India', in Osmania papers in Linguistics, 2 : 1-22, Hyd.

1977 : 'Language modernization in Telugu News papers' in Telugu Academy (1977).

Mohanrao, S. S. 1977 : 'Formal and Informal Variation in Telugu' in Telugu Academy (1977)

Narasimhareddy, P.C. 1975 : 'An approach to Description Dialects in Osmania Papers in Linguistics, Vol. 1 : 16-29, Hyd.

Radhakrishna, B. 1977 : 'Language Surveys in India' in Telugu Academy (1977)

Sivaramamurthi, N. 1977 : 'Address system in Telugu village class / caste consciousness' in Telugu Academy (1977)

Srihari, A. 1972 : 'గుంటూరు—విశాఖ భేదాలు', తెలుగు మాండలికాలు – గుంటూరు జిల్లా, తెలుగు అకాడెమీ, హైదరాబాదు.

Telugu Academy (Pub) 1977 : Seminar on Socio Linguistics, Telugu Academy, Hyd.

Verma, S. K. (?) : 'Towards a linguistic analysis of Regestral features' Acta Linguistica Academiae Budapest.

శ్రీ మాదిరాజు రంగారావు

# శ్రీ శ్రీ - అభ్యుదయ దృక్పథం

శ్రీ శ్రీలో స్వేచ్ఛాతత్త్వం తరువాత పేర్కొదగిన మరో లక్షణం అభ్యుదయ దృక్పథం. 'మహాప్రస్థానం' కవితా సంపుటి ఈతని అభ్యుదయ వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా ప్రతిబింబించేది. ఇందులో మొదటిది 'మహాప్రస్థానం', మరొది 'దేశ చరిత్రలు', చివరది 'జగన్నాథుని రథ చక్రాలు', ప్రముఖంగా పేర్కొదగినవి. 'మహాప్రస్థానం' గీతంలో సమాజగతిలో వేగాన్ని సాధించే ప్రయత్నం, అభ్యుదయ శక్తుల సమీకరణం పురోగమ ధ్యేయమైన మరో ప్రపంచ స్ఫూర్తి చిత్రితం. 'దేశ చరిత్రలు' గీతంలో సాంఘిక గతి క్రమంలో చారిత్రక పరిణామ దశలు మార్క్స్ సిద్ధాంతాల సమన్వయం కన్పిస్తుంది. జగన్నాథుని 'రథచక్రాలు' గీతంలో ప్రజా శక్తుల విజృంభణం, వర్గ సంఘర్షణం, చివర విజయ సూచనతో లక్ష్యమైన నవసమాజ స్థాపనమూ లక్షితమైంది. పైమూడు ప్రధానమైన రచనలతో పాటు, అవతారం, ప్రతిజ్ఞ, నీడలు, మిథ్యావాది, వ్యత్యాసం, నిజంగానే, మొదలైనవి. కవి ఆదర్శ రూపాన్ని వివిధ కోణాలనుండి వెలుగులోకి తెచ్చేవి. వస్తువు ఎన్నికలో నిర్వహణలో లక్ష్యసాధనతో క్రొత్తదనంతో సంపూర్ణమైన వ్యక్తిత్వాన్ని బింబిస్తూ వినూత్నమైన యుగానికాదర్శమైందీకృతి.

> మరో ప్రపంచం/మరో ప్రపంచం
> మరో ప్రపంచం/పిలిచింది

సామాజిక ప్రబోధంతో అభ్యుదయ శక్తులకు గతి నిర్దేశం చేస్తూ ఆలోచనకు ఉద్రేకాన్ని జతపరచి, ఆదర్శానికి వాస్తవికతను భూమిక చేసి, వ్యక్తుల్ని ఉత్తేజపరుస్తూ, సంఘర్షణతో, వర్గ రహితమైన సమసమాజ పరివర్తనకాయత్తం చేసే తత్త్వంతో ఆరంభమౌతుంది.

'మహాప్రస్థానం' రచనా కాలం (1934) నాటికి ప్రపంచంలో ఆదర్శమైన వ్యవస్థలు రెండు. ఒకటి ప్రజాస్వామ్యానికి రెండోది సామ్యవాదానికీ అంకితమైనవి. మొదటిదానికి అమెరికా, రెండోదానికి రష్యా నాయకత్వం వహించాయి. భారతదేశంలోనూ సామాన్యుని సాంఘిక ఆర్థిక, రాజకీయ, న్యాయం చేకూర్చి సర్వ సమానత్వం గల ఆదర్శప్రాయమైన సమాజాన్ని నిర్మింపజేయాలన్న ధ్యేయంతో ఒక ప్రక్కనుండి అన్ని రంగాల్లో అభ్యుదయ భావ ప్రసారం జరుగుతూన్న కాలం. రాజకీయంగా వచ్చిపైబడిన ప్రపంచ యుద్ధ పర్యవసానంగా దేశం ఆర్థిక సంక్షోభంతో విచలితమైంది. ప్రజల సమస్యల పరిష్కారానికిమార్క్స్ సిద్ధాంతాన్ని అవలంబించిన దేశాలన్నీ రష్యా నాయకత్వంలో రెక్కలు సాచడం మొదలు పెట్టాయి. ఇక్కడ అక్కడ అన్న విభేదం లేకుండా, సంకుచితమైన దేశ సీమలు దాటి జాతి వలయాలు తుడిచి వేసి విశ్వమానవతా దృక్పథంతో, మానవుని సమస్యల పరిష్కారానికీ పద్ధతియే మేలైందన్న భావం, ఈ వ్యవస్థలోనే సామాన్యుని స్థితి బాగుపడుతుందన్న విశ్వాసం, ఈ కవిలోనూ దృఢంగా నిలచింది. రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా పాల్గొన్న సందర్భంలో ఇతడు వ్రాసిన "ఓ రష్యా! నా రష్యా" గేయం నిరంకుశత్వానికి వ్యతిరేకంగానే కాక, కవి ఆదర్శానికీ ప్రాతినిధ్యం వహించే ఒక పక్షం పట్ల అచంచలమైన ఆశాగతినీ ప్రతిబింబిస్తోంది.

> "కోటి గొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి
> కోటి చేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి"

అని ఎంతగానో ఉప్పొంగి పోతాడు. మేరలు మీరిన అనుభూతితో గాఢమైన మానసిక తృప్తినీ పొందడం గమనించవచ్చు. ఒక లక్ష్యంతో నిశ్చలమైన అభిప్రాయాలతో నిర్మితమైన సాహితీ వ్యక్తిత్వం 'మహాప్రస్థానం' అంతటా దర్శన మిస్తుంది. విశ్వజనీన దృక్పథంతో సామాన్య ప్రజల ఆశయాలకు దర్పణంగా అంతర్జాతీయమైన అవగాహనతో సాహిత్యాన్ని సిద్ధింపజేయడంలో ఇతడు చూపిన మార్గం సాహసోపేతమైంది. తెలుగు సాహిత్యం గతినీ, విలువల్నీ సంపూర్ణంగా మార్చివేసింది.

## II

మార్క్స్, ఎంగెల్స్ నిరంతర కృషి ఫలంగా ఆవిర్భవించిన గతి తార్కిక భౌతిక వాద (dialectical materialism)చ్ఛాయలు శ్రీశ్రీ నవ్య కవిత్వానికి అంతస్తత్త్వం. డైలక్టిక్స్ అన్న పదం గ్రీకు భాషా సంబంధమైంది. ప్రత్యర్థి వాదనలో పరస్పరం వ్యతిరేకించే లక్షణాన్ని గుర్తించి వాటిని పరిష్కరించి వాస్తవాన్ని బయటికి తీసే చర్చా నైపుణ్యాన్ని 'డైలక్టిక్స్' అంటారు. స్థూలంగా ఇది తర్కంతో నిర్వహించే చర్చాకళకు సంబంధించింది. ఇక్కడ వస్తువులో నిహితమైన పరస్పర వ్యతిరేక శక్తులను గుర్తించి దాని మూల గతినీ, అభివృద్ధినీ పరిశీలించడానికి సహకరించేదిగా భావింపవచ్చు.

వస్తువు గతి స్వభావం కలది. ఇది దీని అంతస్స్వభావం. పదార్థం యొక్క అస్తిత్వ లక్షణానికిది నిదర్శనం. పదార్థం ఎప్పుడూ గతి సహితమైంది. గతిలో అవతరిస్తుంది. గతిలో స్ఫుటమవుతుంది. వస్తువులో మార్పు నిత్యమూ జరుగుతూంటుంది. భౌతిక రసాయనికమైన మార్పులు తప్పనివి. మార్పు ఎట్టి పరిస్థితిలోనూ ఆగదు. లేకపోతే పరిణామమే లేదు. జీవ పరిణామంలో ఈ మార్పు కత్యంత ప్రాముఖ్యం ఉంది. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని 'గతి తార్కిక' అన్న మాట ఉపయోగించ

డం జరిగింది. ఇది వాస్తవికతను గుర్తింపజేసేది దీని స్వరూపం భౌతికమైంది. అందువల్ల 'గతి తార్కిక భౌతిక వాద'మనడం. వస్తువూ గతీ రెండూ విడదీయరానివి. ఈ గతిలో వేగం రావడం వల్ల గుణాత్మకమైన మార్పు త్వరగా వస్తుంది. ఈ సందర్భంలో మతం మార్పుకు వ్యతిరేకం. కాబట్టి ప్రగతి నిరోధంగా భావితమైంది. ఇది యథాస్థితికి కొమ్ముకాచేదన్న అభిప్రాయంతో మత సంబంధమైనదంతా నిరసింపబడింది. గతి తార్కిక భౌతిక వాదం రూపొందడానికి ఆ కాలంలో ప్రముఖ పాత్ర వహించిన పరిశోధనాంశాలు మూడు.

1. శక్తి – నిల్వ, మార్పిడి సూత్రం
2. జీవకణ నిర్మాణ సిద్ధాంతం
3. డార్విన్ పరిణామ వాదం.

ప్రకృతి – మానవుడు - ఆలోచన అనే వాటిని గతి, సంఘర్షణ, సమన్వయం అన్న సూత్రాలతో సహేతుకంగా సమన్వయించి నిర్మించిన చారిత్రక పరిణామ దృష్టిగల భౌతిక వాదంతో ఉదయించిన తత్త్వం ఇది.

స్థూలంగా చూస్తే 'మహాప్రస్థానం'లో విభిన్న శక్తులను గుర్తించడం, వీటి మూల స్వభావాన్నీ, అభివృద్ధి దశలనూ పరిశీలించి, సమీకరించి, అభివృద్ధి క్రమంలో పాతపై కొత్త జరిపే పోరాటాన్నీ, అభ్యుదయ శక్తుల వికాసాన్నీ, చివర విజయాన్నీ నిరూపించడం కవి ప్రధానమైన ఉద్దేశంగా కన్పిస్తుంది:

ఈ విధం; సాహిత్యానికి క్రొత్త దృక్పథంలో, సాంఘిక తత్పరతను చేకూర్చింది. ఎన్నో వందల యేండ్లుగా నెలకొన్న తెలుగు సాహిత్య వ్యవస్థ అసాధారణమైన మార్పులకు లోనైంది. 'మహాప్రస్థానం' అవతరణం, తెలుగు సాహిత్యంలో విశిష్టమైన ఘటనగా పేర్కొవచ్చు. ఈ మరో లోకానికి నాయకత్వం వహించడానికి, ఎప్పటికపుడు క్రొత్త ఆలోచనలతో ప్రత్యయం విశ్లథం కాకుండా సాహసంతో ప్రయాణించడానికీ, కళాత్మకంగానే కాక తాత్త్వికంగానూ బాధ్యతాయుతమైన ప్రవర్తనం అవసరం. 'మహాప్రస్థానం'లో మొదటి నుండి చివరివరకూ దీన్ని స్పష్టంగా గమనింపవచ్చు. 'క్రొత్త'ను అన్వేషించడంలో శ్రీశ్రీ ఎన్నో ప్రయోగాలు చేయవలసి వచ్చింది. ఈ అన్వేషణా క్రమంలో భాగమే అధివాస్తవిక రచనలు.

# III

''జీవితంలోనూ, కవిత్వంలోనూ సంప్రదాయానికీ, విప్లవానికీ మధ్య ఎడతెగని పోరాటం ఎప్పుడూ సాగిపోతూనే ఉంటుంది.''[1] సంప్రదాయానికీ, విప్లవానికీ మధ్య నిరంతరం జరిగే సంఘర్షణను వేగవంతం చేసే కళాసాధనం మహాప్రస్థానం.

'మరో ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది'

సమాజంలో వయస్సు మళ్లిన సోదరులను ప్రక్కకునెట్టి నెత్తురుమండే శక్తులు నిండే సైనికులై; కదలే యువలోకం, ఎదురయ్యే ఎడారులూ, నదీనదాలు, కొండలూ, అధిగమించి మరో లోకాన్ని దర్శించే స్థితి చిత్రితమైంది.

ఇంతటి నవ్యసృష్టిలోనూ ప్రవృత్తమయ్యే సంప్రదాయ ప్రభావం శ్రీశ్రీ సాహితీ వ్యక్తిత్వానికి విస్తృతిని కలిగించేదే కాని ఏ విధంగానూ క్షతి కలిగించేదికాదు. ఈ శబ్దాలు ఒక్కొక్కమారు ప్రతీకలై ఒకస్థితి, భావంయొక్క వివిధచ్ఛాయలు ప్రసరింపజేసూ గాఢత్వాన్నీ, నైశిత్యాన్నీ, ఔజ్వల్యాన్నీ సంపాదించిపెడుతున్నాయి. ఉదాహరణకు ఇందులో ప్రయుక్తమైన ''హరోంహరోంహర'', ధనంజయుడు ఇంకా ఆ తరువాత వచ్చే 'నిటాలాక్షి,' 'నటధూర్జటి', ''ఆది సూకర వేదవేద్యుడు'' మొదలైనవి ఆయా సందర్భాల్లో ఆవిష్కృతమైన విధం చూడవచ్చు. ఇవి పౌరాణికమైన వస్తుజాలంలో చేరినవైనా, ప్రకృతస్థితిలో భావానికి ఉద్ధృతినీ, వేగాన్నీ, ఔజ్వల్యాన్నీ, వివృతినీ కలిగింపజేసే ప్రతీకాత్మకతను సంతరించుకున్నాయి. శివుని మూడవ కన్ను పగలడంలో సంఘర్షణలో విప్లవ శక్తివల్ల ఒక వ్యవస్థ వినాశనం సూచితం. అలాగే ''ధనంజయుడు'' సామాన్యుడు తన లక్ష్యంలో ధనస్వామ్య వ్యవస్థపై విజయం సాధించడమూ సూచితం. ఇలాగా ఎన్నో చూడవచ్చు. శ్రీశ్రీలో సంప్రదాయ బంధురత ఎంత లోతుగానో వ్రేళ్ళు దన్నుకొని నిలచింది. ఇతనిలో ఇది శక్తివంతమైన కవిత్వాన్ని ఆవిష్కరించడానికి సహాయపడింది.

శ్రీశ్రీ దృష్టిలో 'మరో ప్రపంచం' ప్రస్తుత వ్యవస్థకు భిన్నమైంది. దీనిస్వరూపం – ''రథచక్రాలు''లో వివృతమైంది. ఇక్కడ కేవల సూచితమైంది. దీన్ని సాధించడమంత సులభంకాదు. ఇందుకు త్యాగం, ఆదర్శంతోపాటు సాహసం, స్థైర్యం, ఉత్సాహం అవసరం. ఈ లక్షణాలన్నీ ధారాప్రచండంగా వర్ణింపబడిన గీతం ''మహాప్రస్థానం.'' వర్తమాన చైతన్యంతో ఉజ్వలభవిష్యత్తును ప్రతిఫలింపజేసే రచన.

'దేశచరిత్రలు'–క్రియ, ప్రతిక్రియ వెనుకనున్న చారిత్రక శక్తుల యథార్థ కథనం చరిత్రలోని మౌలికమైన సమస్యలు నూత్న దృక్పథంతో విశ్లేషించి చూచే మనస్తత్త్వంతో ఇంతవరకూ మరచిన సామాన్యునిపై వెలుగు ప్రసరించడంవల్ల ఈ రచనకొక విశిష్టత చేకూరింది. గుంపుగా జీవించే మానవుల్లో మొదటినుంచీ సహకారంతోపాటు సంఘర్షణ కూడ తప్పనిసరిగా ఉండేది. నేల, సంపద రాను రాను సరిపోక పోవడంవల్ల, అధికారతృష్ణవల్ల సంఘర్షణ తీవ్రరూపం ధరించేది. ఇందుకు సైనికబలం, ఆయుధాల ప్రయోగం, యుక్తులవ్యూహం అవసరమయ్యేవి. జయించినవారిని బానిసలుగా చేసుకోవడమో లేదా చంపివేయడమో జరిగేది. సంఘంలో క్రమంగా మరో ప్రక్కనుండి డబ్బు, అధికారం, సంపద, హస్తగతం చేసుకొన్న వర్గంయొక్క ఆధిపత్యం మరో వర్గంపై జరుగుతూ వస్తూంది. క్రమంగా సామాన్యుని స్థితి ఎప్పుడూ పైవారికి ఉపయోగపడేలా ఉండే కాని, ఏ మార్పు పొంద

1 నా కవిత్వం–I శ్రీశ్రీ సాహిత్యం II, పుట 50.

డాని కవకాశం లేకపోయింది. అప్పుడప్పుడూ చరిత్రలో మార్పుకు దారితీసినట్లు కన్పించినా అది చాలా స్వల్పం. రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా ఒకదాని ప్రభావం మరొకదానిపై ప్రసరింపజేస్తూ సమాహారంగా సామాన్యుని దుస్థితికి మరీ హేతుభూతమయ్యాయి. రాను రాను నాగరకత పెరిగినకొద్దీ పీడకుల, పీడితుల మధ్య అఖాతం మరీ ఎక్కువైంది. వైషమ్యం, స్వార్థపరత్వం, కౌటిల్యం అన్నీ ఇందుకు దోహదం చేశాయి. "ఇతిహాసపు చీకటి కోణంలో అట్టడుగున కన్పించని కథలన్నీ" ఇపుడు పైకితీసి చరిత్రకు వినూత్నమైన అర్థాన్నీ, సమాజానికి సామ్యవాద గతినీ కల్పించవలసిన అవసరం ఉంది.

ఈ స్థితిని చారిత్రక పరిణామ దశలను వర్గ సంఘర్షణ దృష్టితో విశ్లేషించి చిత్రించడం కన్పిస్తుంది.

"నైలునదీ నాగరకతలో
సామాన్యుని జీవనమెట్టిది?
............................
క్రోమాన్యాన్ గుహాముఖాల్లో
............................
మానవకథ వికాస మెట్టిది?"

పురాతన నాగరకతలో సామాన్యునిపై వెలుగు ప్రసరించే పద్ధతివల్ల చరిత్ర స్వరూపమే మారుతుంది. తారీఖులు, దస్తావేజులు వదలి యథార్థ జీవిత కథనంతో సామాన్యునికి విశిష్టమైన స్థానం లభిస్తుంది. దీనితో రాళ్ళెత్తిన కూలీ, పల్లకి మోసిన బోయీ ప్రాధాన్యమేమిటో అర్థమవుతుంది. 'క్రోమాన్యాన్' అనే పేరుతో పెద్ద గుహ ఫ్రాన్సులో వెజీర్ నదీతీరాన ఉంది. క్రోమాన్యాన్ అంటే పెద్దగొయ్యి అని అర్థం. 1868లో రైలు మార్గం వేసే ప్రయత్నాలు జరిపినప్పుడు లేజీజ్ ప్రాంతంలో త్రవ్వకాల సందర్భంలో ఎన్నో పెద్ద తలలు, వెడల్పైన ముఖాలు, ఎత్తైన నాసికలుగల అస్థిపంజరాలు కన్పించాయి. ఇవి ఆరు అడుగుల పొడవు కలిగినవి. ఎడ్వర్డ్ లార్టే ఈ నాగరకతపై గొప్ప పరిశోధన జరిపాడు. ఆ గుహలో పై కప్పుమీద, గోడలమీద దున్న మొదలైన జంతువుల చిత్రాలు కన్పించాయి. జంతువు వలలో పడినట్లు, బల్లెం గ్రుచ్చుకొన్నట్లు, రాళ్ళతో గాయపడినట్లు చిత్రాలు - ఒకదానిపై మరోటి వేయబడి ఉన్నాయి. ఇంకా జంతువుల వేషాలలో మనుషుల బొమ్మలూ ఉన్నాయి. ఇక్కడ విలసిల్లిన సంస్కృతి పాత రాతియుగంలోని చివరిదశకు చెందినవని (క్రీ.పూ. 28,000 నుండి 10,000 మధ్యకాలం) పరిశోధకుల అభిప్రాయం. ఈ సంస్కృతుల్లో మొదటి నుండి ఇప్పటి వరకూ మరచిన సామాన్య మానవునిపై దృష్టితో ఈ దేశం ఆ దేశం, ఈ జాతి ఆ జాతి అన్న భేదం లేకుండా చరిత్రను అవగాహన చేసుకోవలసిన అవసరం — ఈ గీతంలో ఇప్పటివరకూ మనం అనుసరించే విలువలనే మార్చివేసేది. క్రొత్త విలువల్ని రూపొందించేది.

"ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ వెల్గులకీ ప్రస్థానం."

అన్న ప్రశ్నలకు సమాధానమే చివరి గీతం.

"జగన్నాథుని రథచక్రాలు" ఎప్పటికీ అసంపూర్ణంగా ఉండిపోతుందేమో అని ఒక్కొక్కపుడు నాకే సందేహం కలిగేది. ఇది లేకుండా 'మహాప్రస్థానం' పూర్తి కావడానికి వీల్లేదు. కాని తొందరపడి ఏదో విధంగా రాసెయ్యడానికి యిష్టంలేదు. 'మహాప్రస్థానం' సంపుటిలో మొట్టమొదటి గీతం 'మహాప్రస్థానం', చిట్టచివరి గీతం 'జగన్నాథుని రథచక్రాలు' ఉండాలనే నా ఉద్దేశం. ఎలాగైతేనేం అనుకున్న విధంగా 1940 లో ఒకరోజు రథచక్రాలు రాయడం పూర్తి అయింది. ఈ మాటలనుబట్టి కవి దృష్టిలో రెండూ భావ సంపూర్ణతను ఎలా సాధించేదీ సులభంగా గుర్తించవచ్చు. మొదటిది విప్లవ భావనతో కార్యాచరణ కాయత్తపరచేది. రెండోది ప్రకృత వ్యవస్థయొక్క దుస్థితి స్థానంలో సమ సమాజ సుస్థితి — దీన్ని సాధించడానికి కార్యాచరణ తీవ్రరూపం చిత్రితమైంది. సాంఘిక పరివర్తనం కోసం అభ్యుదయ చైతన్యంతో వ్యక్తుల్ని విప్లవమూర్తులుగా ఉత్తేజితంచేసి మార్పును సాధించే లక్షణం కన్పిస్తుంది. సాంఘిక న్యాయం చేకూరక అట్టడుగున పడిఉన్న పతితులు, భ్రష్టులు, దీనులు, హీనుల నుద్దేశించి కరుణోపేతమైన చిత్రణతో ఆరంభమౌతుంది. వీరి నిస్సహాయస్థితికి జాలిపడతాడు. ఓదారుస్తాడు. ఇంతటిలో-తన కర్తవ్యం తీరిందనుకోక వాళ్ళలో ధైర్యాన్నీ, స్థైర్యాన్నీ కలిగిస్తాడు. వారి సమస్యలకు పరిష్కార మార్గంగా జగన్నాథుని రథచక్రాలు భూమార్గం పట్టించే ప్రతిజ్ఞ చేస్తాడు. సంఘర్షణ సంఘంలో అనివార్యమైన దశకు చేరుకున్నప్పుడు పీడితుల, పీడకులమధ్య ఒక స్థితివరకు ఉన్న రేఖ చెదరిపోయి, దీని పర్యవసానంగా విప్లవం విజృంభించి పూర్వ వ్యవస్థ కూలిపోయే పరిస్థితి ఏర్పడుతుంది. మానవుడు తన చరిత్రకు తానే బాధ్యుడు. ఈ నవ వ్యవస్థా నిర్మాణంలో ప్రతి వ్యక్తికీ బాధ్యత ఉంది. పురోగమన సందర్భంలో, సమ సమాజ స్థాపనకై అభ్యుదయ శక్తులకు వ్యతిరేక శక్తులతో సంఘర్షణ అనివార్యమై విప్లవానికి దారి తీస్తుందన్న మార్క్స్ అభిప్రాయాన్ని అనుసంధించుకోవచ్చు.

'హాలాహలం పొగచూరింది
కోలాహలం చెలరేగింది."

హాలహలం తరువాత వచ్చేది అమృతం; కోలాహలం తరువాత నెలకొనేది శాంతి! భవిష్యత్తులో అమృతఫలం కోసం, శాంతి జీవనం కోసం వర్తమానంలో జరుగుతూన్న మథనమే, సంక్షోభం; సంఘర్షణ!

స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం
పునాదులై ఇళ్లు లేచి
జనావళికి శుభం పూచి

"శాంతి! శాంతి! కాంతి
జగమంతా జయిస్తుంది"

అన్న ఆకాంక్ష ఈతని విధ్వంసన శీలంతోపాటు దానినినుసరించి నిర్మాణాత్మక లక్షణాన్నీ దర్శింపజేసేది. ఇది మానవతా స్పర్శతో ఒక దేశం, జాతి అన్న పరిధుల నతిక్రమించి, అఖిల ప్రపంచ

స్థాయిలో స్పందన, ఉత్తేజం కలిగించే సృజన రూపం. ఈ గీతం ఒక వ్యక్తి మరో వ్యక్తినీ, ఒక జాతి మరోజాతినీ పీడించని సామ్య వాద వ్యవస్థయొక్క ఆవిర్భూతిని బుజువుచేసే ప్రయత్నరూపం!

ఈ గీతాల్లో అప్పుడే యూరోపియన్ దేశాల్లో ప్రచలితమైన స్వేచ్ఛాతత్త్వం; దీనికి సహకారంగా అభ్యుదయ భావన; ఇందుకు మార్గదర్శిగా మార్క్సు గతి తార్కిక భౌతికవాదం — ప్రభావంతో రూపొందినవ్యక్తిత్వం దర్శనమిస్తుంది. ఇతని లక్ష్యమైన ఆదర్శం అంతర్జాతీయమైన ప్రభావం కలిగింది.

పూర్వ సాహిత్య ప్రభావంతో, సిద్ధించిన పద్యరచనతో ఆరంభించి, భావ కవిత్వంలో ప్రవేశించి, అభ్యుదయ జగత్తులో స్థిరపడి; విప్లవ శక్తికి ప్రతినిధిగా రూపొందిన శ్రీ శ్రీ విశిష్టమైన మహా వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా బింబించేవీ మూడు గీతాలు.

"సంపూర్ణ స్వాతంత్ర్యం ఏలాగయితే ఒక ఆదర్శప్రాయం గానే ఉండి ఎన్నటికీ అందుకోరానిదో ఆలాగే అచ్చమైన కవిత్వం కూడా ఎంతవాడికీ అందరానిదే! కవిత్వమూ స్వాతంత్ర్యమూ ఎవ్వరికీ, ఎప్పటికీ అందని అందాలే అయినప్పటికీ వాటిని సాధించాలనే ప్రయత్నంలోనే, ఆ ప్రయత్నంలోని ఆ వేగంలోనే, ఆ ఆవేగంలోని అశాంతిలోనే ఆ అశాంతిలోని ఆనందంలోనే ఉంది జీవితానికి సార్థక్యం!" ఈ ఆలోచనలో ఉన్న అన్వేషణ, తపన, క్రియాశీలం యొక్క స్పంధన రూపమే; ఈ కవిత్వం!

---

# ఆశావసంతం

## శ్రీ మేకా సుధాకరరావు

విరజాజి లతపైన విరిసినవి కన్నీళ్లు
  మరుమల్లె గుండెలో మంటలేరగిలెను
కోయిలమ్మ గళమ్ము కొడిగట్టి పోయినది
కొలనులో నీరింకి తలవాల్చె తామరలు!
అరుగదా హేమంత మరుగదా శిశిరమ్ము?
ఎరుగదా ఆమని తరుణ మేతెంచెనని?!

ఎన్నాళ్లు ఈ శిశిర శీర్ణ జీవితమిట
ఎందాక ఈ శిథిల వ్యథల జీవితమిట
నశియించవా ఇరులు—హసియించవా విరులు
కురియదా వెన్నెల? మురియదా జగమెల్ల?
అరుగదా హేమంత మరుగదా శిశిరమ్ము
ఎరుగదా ఆమని తరుణ మేతెంచెనని?!

★ ★ ★

ఎందుకి నిరాశ?
ఏల నీ నిస్పృహ!

ఎపుడు తారావలెనా ఎరుగదా ఆమని?
మురియుదా ఈవని —

కాలయామిని తాను, కలకాల మొకచోట
కాపురంబుండదు —
నిన్న క్రుంగిన ఇనుడు నేడు తా ఉదయించు
కష్టజీవుల వెతలు కడతేరు రోజొచ్చు.

దుష్ట శిశిరుడు తొలగు
సృష్టి కల్యాణాన్కి సుస్వాగతంపలుకు
శుభ వసంతమువచ్చు —

★ ★ ★

అరుదెంచు నటుచూడు — అల్లదే ఆమని
తెచ్చు శుభ సుఖములు
తేరుకొను బ్రతుకులు —

చాణుక్య

# పత్రికా రచన - నిన్న అత్యవసర పరిస్థితిలో - నేడు....

The endless cycle of idea and action,
Endless invention, endless experiment,
Brings knowledge of motion but not of stillness,
Where is the life we have lost in living ?
Where is the wisdom we have lost in knowledge ?
Where is the knowledge we have lost in information ?

*T. S. Eliot*

పత్రికా రచన ఒక యజ్ఞం లాంటిది. ఇప్పుడెలా ఉన్నా, కనీసం స్వాతంత్ర్య సంపాదనకు పూర్వం అది నిజంగా అలాంటిదే, ఒక అసిధారా వ్రతంగా అది సాగింది. స్వాతంత్ర్య సంపాదనానంతరం ఆ బిగి తప్పింది, మొన్నటి అత్యవసర పరిస్థితి ఈ రంగంలో ఇంకొక మరపురాని దశ.

ఇంతకూ ఏమిటీ పత్రికా రచన ? ఎవరీ పత్రికా రచయిత?

అమెరికన్ పత్రికా రచయితలకు మణిపూసలాంటి వాల్టర్ లిప్‌మన్ 1960 లో వాషింగ్టన్ విలేఖరి బాధ్యతలను గురించి ఒక వ్యాసం వ్రాశాడు. దానిలో చక్కగా ఒకే ఒక వాక్యంలో అతని బాధ్యతలను నిర్వచించాడు.

"......and if I had to sum up in one sentence what has happened, it would be that the Washington correspondent has had to teach himself to be not only a recorder of facts and a chronicler of events but also a writer of notes and essays in contemporary history."

తన ఈ వాక్యాన్ని 'సపోర్టు' చేసుకునేందుకు చక్కటి వాదాన్ని వివరించాడు వాస్తవ జీవితం ఒకే ఒక బొమ్మ కాదు, అన్ని ముక్కలూ అందులో చక్కగా ఇమడవు. అలాగే ఏ విషయాన్ని గురించైనా ఒకే ఒక వివరణ వాస్తవంకాదు. జీవితమంతా ఒకే ఒక బొమ్మలాంటిదనటం ఒక్క నియంతృత్వ ధోరణిలోనే సాధ్యమవుతుంది. భవిష్యత్‌కంతా ఒకే ఒక తాళంచెవి ఉన్నదనీ, అది తన దగ్గరే ఉందనీ ఈ నియంతృత్వ ధోరణి నమ్ముతుంది. కాని ప్రజాస్వామిక దృక్పథం అలా భావించదు. మానవుడు ఎలా తన భవిష్యత్‌ను నిర్మించదలుచుకుంటే, అది అలా తయారవుతుంది. ఆ భవిష్యత్‌కోసం తంటాలుపడే ఈ వర్తమానంలోకూడా, ఈ వర్తమానాన్ని గురించి మనకు పూర్తిగా తెలియదు కొంత కొంత మాత్రమే తెలుసు. (The future is what a man will make it, and about the present, in which the future is being prepared, we know something, but not everything, and not nearly enough.)

పత్రికా రచయితకు కావలసిన విషయాలన్నీ ఎప్పుడూ ఎదురుగా కనపడుతుండవు. కొన్ని కొన్ని విషయాలను గురించి కొంత ఊహించక తప్పదు. కాబట్టే పత్రికా రచయిత ఎప్పుడూ ఈవాస్తవాలను ఒక 'డాగ్‌మా' లో ఇరికించాలని చూడకూడదు. వాస్తవాల ఆధారంగానే కొన్ని సిద్ధాంతాలనూ, భావాలనూ ప్రతిపాదించుకుంటూ పోవచ్చు. మనకు దొరికిన ఆధారాలను ముందుంచుకొని, వాటికి వీలయినంత దగ్గరగా ఉండే ఊహలను మనం చేయవచ్చు. మనం ఊహించిన తరువాత, కొన్ని సంఘటనలు జరిగి అది చరిత్ర అవుతుంది. మన ఆధారాలు సరియైనవి అయి, మన ఊహలు నిజమైనా, ఒక్కొసారి తరువాతి చరిత్ర మన ఊహలను తారుమారు చేస్తుంది. మన ఊహాగానాలు, ఒక కూర్పు లేదా చేర్పు లేదా మార్పులతో, తరువాతి చరిత్ర కావాలి. అలా అవుతున్నవా కాదా అనే విషయాన్ని పత్రికా రచయిత ఎల్లప్పుడూ 'చెక్' చేసుకుంటుండాలి. కాని మన చిత్రణలో తరువాతి ఘటనలు ఇమడకపోతే, బాధ్యతాయుతుడైన పత్రికా రచయిత ఏంచెయ్యాలి ? తన సిద్ధాంతాన్ని, వివరణను కొట్టివేసుకోవాలి — ఇది సక్రమ పద్ధతి. ఇక అక్రమపద్ధతి—వాస్తవాన్ని తొక్కిపెట్టటం లేదా మసిపూసిమారేడు కాయ చేయటం. (One is to scrap the theory and the interpretation, which is what liberal and honest men do. The other is to distort or suppress the

unmanageable piece of news.) ఈనాడు, బహుశా, మన దేశంలో మొదటి దానికన్న, రెండవదే ఎక్కువగా సాగుతున్నదేమో!

ఇంకొక సున్నితమైన విషయాన్ని కూడా వాల్టర్ లిప్‌మన్ చర్చించాడు. సాధారణవ్యక్తి పత్రికా రచయితను ప్రశ్నించవచ్చు. ఇట్లా వ్రాస్తున్నావు, ఇట్లా ఊహిస్తున్నావు, నీకేం తెలుసని, నీవు ఎప్పుడైనా ఏ ప్రభుత్వ పత్రాన్నైనా చదివావా, ఏ కాబినెట్ మీటింగులోనైనా పాల్గొన్నావా, ఏ రాయబారి పంపే నివేదికను గురించైనా తెలుసుకొన్నావా — మరి ఎలా జాతీయ అంతర్జాతీయ విషయాలను గురించి వ్రాస్తావు, నీవెప్పుడూ ఈ విషయాలకు బయటివాడివే, కాబట్టి ఏమీ తెలియని వాడవుగదా అని (Why don't you admit that you are an outsider and that you are, therefore, by definition, an ignoramus?)

లిప్‌మనే దానికి సమాధానమిచ్చాడు. గణతంత్ర ప్రజాస్వామిక విధానాన్ని అవలంబించే ఏ దేశ పౌరునికి ఈ ప్రశ్న వెయ్యటానికి వీలు లేదు. కారణమేమిటంటే ప్రజాస్వామిక సూత్రాలలో ముఖ్యమైనదే, బయటివారు లోపలివారిమీద అధికారాన్ని చలాయించటం అని. మరి ప్రజాస్వామ్యంలో నిజానికి విషయాలు, వివరాలు సరిగ్గా తెలియని ప్రజలు, వోటర్లు — లోపలివారిమీద అధికారం చలాయించటమే కదా! (...You will be denouncing the principle of democracy itself, which asserts that the outsiders shall be sovereign over the insiders.)

అంతేకాదు, ఇంకొక విషయం కూడా చెప్పాడు. ప్రభుత్వాధికారాన్ని చలాయించే వ్యక్తులు కూడా నిజానికి ఏమీ తెలియనివారే సుమా! ఉదాహరణకు అమెరికన్ ప్రభుత్వంలో సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు అన్ని పత్రాలు చూచే అధికారం ఉంది. ఆయన అమెరికాకు సంబంధించిన అన్ని పత్రాలు చూడవచ్చు. మరి బ్రిటిష్, కెనడియన్, ఆశియన్, చైనీసు పత్రాలు చూచే తీరిక ఉంటుందా? కాని తీరిక లేదని నిర్ణయాలు తీసుకోకుండా ఆగకూడదు, నిర్ణయాలు తీసుకుంటాడు కూడా.

అన్నిటికీ మించిన విషయం ఇంకొకటుంది. ఈ నిర్ణయాలను ఆమోదించటానికీ, కాదనటానికీ అధికారాలు కలిగిన కాంగ్రెసు వీరందరికన్నా తక్కువ పత్రాలను చదువుతుంది. ఇదే తతంగం ప్రపంచంలోని ప్రతి ప్రజాస్వామిక దేశంలోనూ నేడు జరుగుతున్నది. నేడు పత్రికా రచయిత అంటే ఒక్కొక్క రంగంలో జరుగుతున్న విషయాన్ని వివేచనపూర్వకంగా విశదీకరించి, విశ్లేషించి భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలను గురించి చెప్పటానికి ప్రయత్నించే వ్యక్తి అన్నమాట. (In some field of interest, we make it our business to find out what is going on under the surface and beyond the horizon, to infer, to deduce, to imagine and to guess what is going on inside, what this meant yesterday and what it could mean tomorrow).

కాబట్టే నేను దీనినో యజ్ఞమనీ,అసిధారా వ్రతమనీఅన్నాను.

## 2

స్వాతంత్ర్యానంతర పత్రికా చరిత్రలో అత్యవసర పరిస్థితి ఒక విశేషాధ్యాయము. దీనిని గురించి అతిగా ఇప్పుడు చెప్పుకోవలసిన పనిలేదు. కాని కొన్ని విషయాలు చాలా విచిత్రంగా ధ్వనిస్తాయి. విదేశీ ప్రభుత్వ హయాంలో వెల్లివిరిసిన స్వాతంత్ర్య కాంక్ష, ఈ కాలంలో, ఇది మన ప్రభుత్వమే, జరిగేదంతా మనమంచికే అన్న అభిప్రాయంతోనే కనపడకుండా పోయిందా? లేక దురదృష్ట వశాత్తు మన 30 సంవత్సరాల స్వాతంత్ర్యమూ, దిశ అనేదే లేకుండా, చలనమే తప్ప పురోగతి ఎరగని దశలో ఉంది కాబట్టి, మనలో అసలు 'స్వ' అనేదే హరించిందా? నాటి మన ప్రవర్తన ప్రజాస్వామికధోరణికి ఎంతవరకు అనుగుణ్యంగా ఉంది? ఈ ప్రశ్నలను వేసుకుని ఎవరైనా ఆత్మ విమర్శ చేసుకుంటే, తప్పక మన సమాధానాలు ఆశాభంగం కలిగించక తప్పదు.

రెండే రెండు ఉదాహరణలు. రాజకీయవాదులను గురించి మనమెప్పుడూ చెప్పుకోవలసిన పనిలేదు. కాని బుద్ధిజీవులు, మేధావులు, సమాజాన్ని మేమే నడుపుతున్నాం అనుకునే ఈ వర్గ మేమయింది? కాశ్మీరి అయిన షమీమ్ అహమ్మద్ షమీమ్ ఒక వ్యాసంలో చిత్రకారుడు ఎమ్. యఫ్. హుస్సేన్‌ను, రచయిత సర్దార్ జాఫ్రీలను గురించి వ్రాశాడు. ఇరువురూ తమతమ రంగాలలో ప్రముఖులు, జీవితాన్ని గురించి ఇబ్బంది పడవలసినవారు కాదు, అయినా వారలా తయారుకావటానికి కారణమేమిటని వాపోతూ ఇలా అంటాడు: "I am not trying to single them out. They were a part of the crowd Further more, sycophants abunded in every Indian language and every school of thought. Hussain and Jafri are however, the acknowledged masters in their chosen fields-their contributions to art and literature have undeniably the stamp of greatness. Hence the anguish and pain."

రెండవ ఉదాహరణ, పత్రికా రచయితలు. ఒక బ్రహ్మాండమైన ఆంగ్లదినపత్రికనుండి బయటికి వెళ్ళిన లేదా పంపబడ్డ ప్రముఖుని ఆవేదన ఇది:

"On a typical day when hundreds were being rounded up all over India and there were reports of J. P. and Morarji on fast, senior Journalists in......... were discussing such profound topics as the hazards of driving in........., the effect of vitamin C on cold and the poor quality of coffee served by the office canteen."

కాదు, మేమంతా ఏదో చేశామనీ మనం ఘనంగా ఇప్పుడు చెప్పుకోవచ్చు, వ్రాసుకోవచ్చు. కాని అప్పుడు ప్రభుత్వంచే నియమింపబడిన సెంట్రల్ కమిటీ ఆఫ్ ఎడిటర్స్‌నుండి ప్రెస్‌కోడ్‌ను తయారుచేయటానికి పూనుకున్నవారిలో 'నేషనల్ హెరాల్డ్'కు సంబంధించిన ఎమ్. చలపతిరావుగారొకరనీ, ఆయనే 1978 లో 'నేషనల్ హెరాల్డ్' నుంచి రాజీనామా చేస్తూ ఇలా అన్నారనీ మనం గుర్తుంచుకోవాలి. "I promise I will forget the "National Herald" and attend to interests and persons, which I sacrificed to loyalties which have proved a waste and have landed me in humiliation."

ఇంకా వీటిని గురించి లోతుకుపోవటం అనవసరం.

# 3

వీటన్నిటినీ మించినది స్వోత్కర్ష, దానిని నిర్భయంగా, నిర్లజ్జగా చెప్పుకోవట మింకొక విశేషము.

అత్యవసరపరిస్థితి రద్దయిన అనంతరము, అంతకు ముందు శ్రీమతి ఇందిరాగాంధీని అతిగా బలపరిచిన ఇద్దరు ప్రముఖ సంపాదకులు, తమతమ అభిప్రాయాలను స్పష్టంగా చెప్పారు. వీటిని చదివితే మనకీ ధోరణి అర్థమవుతుంది. వాటిలోని కొన్ని ప్రశ్నలను, వాటికి సమాధానాలను ఇక్కడ ఇస్తున్నాను.

ప్రశ్న : అత్యవసర పరిస్థితిలో మీ అంత 'ప్రో' ఇంకెవ్వరూ లేరు, ఇప్పుడు మీ అంత 'యాంటీ' ఎవ్వరూలేరు, ఎందుచేత ?

సమాధానం : చూచారు, మా విధానమెప్పుడూ అధికారంలో ఉన్న వారిని బలపరచటం. (well you see, our policy has always been to keep on the right side of the power centre.)

ప్రశ్న : శ్రీమతి ఇందిరాగాంధీ, సంజయిగాంధీల భవిష్యత్తేమిటి ?

సమాధానం : చూచారు. జయప్రకాశ్, మొరార్జీలను నేను చేశాను. నేను ఇందిరాగాంధీని పెంచడం మొదలు పెడితే ఆవిడ తిరిగి వస్తుంది. ( Now slowly if I start building Mrs. Gandhi up, she will come back)

అంతేకాదు, చివరలో ఆ సంపాదకుడు తానెలా తన పత్రికలో ఒక ఉత్తరం వ్రాస్తే, కృశ్చేవ్ తన విధానాలను మార్చుకున్నదీ, ఎలా తానొక పుస్తకం వ్రాస్తే చైనాపట్ల ప్రపంచ దృక్పథం మారిందీ, ఎలా తనవల్ల ఇరాన్‌షా భారత ప్రభుత్వానికి ధన సహాయం చేసిందీ, భారతదేశంలో తానెలా వీరిని నాయకులను చేసిందీ సగర్వంగా చెప్పుకొన్నాడు. చివరకు కూడా పాపం జె. పి., మొరార్జీలు ఈయన బారినుంచి తప్పించుకోలేక పోయారు. (And then, within India, the emergence of these people as leaders )

ఇంకొక ప్రముఖ సంపాదకునితో సంభాషణ ఈ విధంగా సాగింది. ఎమర్జెన్సీరద్దు తరువాత ఎందుకు మారారు అనేదానికి సమాధానం : మనిద్దరి మధ్యనే అయితే ఇంకా నా దృష్టిలో ఇందిరాగాంధీయే ప్రముఖ నాయకురాలు. కాని నా పత్రికపట్ల నాకూ బాధ్యత ఉంది, నేను నా ప్రకటనదారులు ఎలా చెపితే అలా వ్రాయాలి. కె. పి. గోయంకా నాకు పెద్ద ప్రకటనదారుడు. అతనొచ్చి ఇందిరకు అనుకూలంగా వ్రాస్తే ప్రకటనలు ఇవ్వనన్నాడు, మరి నేనేం చెయ్యాలి ?

ప్రశ్న : మీరు వ్రాసేదాంట్లో 65% దాకా 'రబ్బిష్' ఉంటున్నది. ఎందుచేత ?

సమాధానం : 65% దాకా ఏం, నేననుకోవటం 70% దాకా. ఇప్పుడు పత్రికలకు పూర్తి స్వాతంత్ర్యమున్నది.

**మేము** విన్నదే మేము వ్రాస్తాం. మేము ఎవరిని గురించి వ్రాస్తామో అతనే చెప్పాలి మేమ చెప్పింది నిజమో, అబద్ధమో.

ప్రశ్న : ఒక ఆరోపణను గురించి మీ పత్రికలో వ్రాసే ముందు, అది నిజమో, అబద్ధమో విచారించాలని మీరనుకోవటం లేదా ?

సమాధానం: లేదు. మేమల్లా ఆరోపణను ప్రచురించటమే చేస్తాం. ఎవరైనా మేంచేసిన ఆరోపణను 'కాదు' అని ఖండించక పోతే, మేం నిజం చెప్పినట్లే లెక్క.

ఇంకా ఇలాంటి ఆణిముత్యాలు చాలా ఈ 'ఇంటర్వ్యూ'లో దొర్లాయి. సూటిగా, స్పష్టంగా, తికమకలు లేకుండా చెప్పా లంటే సారాంశమిది : మేం వ్యాపారం చేస్తున్నాం, ప్రకటనదార్లు ఏదికోరితే అదే వ్రాస్తాం, ప్రజలకేం కావాలో వారికోరికల కను గుణ్యంగా వ్రాస్తాం, మేం ఏం వ్రాస్తే అదే సత్యం (మేమేంచేస్తే అదే ఘనకార్యం అని రాజకీయవాదులన్నట్లు)ఆగి, ఆలోచించ వలసిన బాధ్యతకూడా మాకు లేదు, మేమే నాయకులను చేస్తున్నాం. ఈ ధోరణిని ఏమి అనాలి ?

మనదేశంలో నేడున్న స్థితిగతులనుబట్టి అధిక సంఖ్యాకులు, దేశ పరిస్థితులను గురించి ఆలోచించలేరు, దానికి నిరక్షరాస్యత ఒకటి తోడయింది. ఈ పరిస్థితిలో మేధావులమనుకునే వర్గంమీద ఉన్న బాధ్యత పైన చెప్పిందేనా ?

1979 జనవరి 'భారతి'లో సంపాదకులు, తమ 'స్వవిషయం'లో చక్కగా ఈ విషయాన్ని స్పృశించారు. "... — అయితే, అనుసరింప బడిన అభివృద్ధి పద్ధతులు, విధానాలు అధి కారంలో ఉన్నవారి బలాన్ని విపరీతంగా పెంచుతున్నాయని కొందరు హెచ్చరిస్తూనే వచ్చారు. ఇటువంటి వారిహెచ్చరికలో ఎంతనిజం ఉందో 1975 జూన్ దాకా తెలియలేదు. ఆ నెలలో ఒక్కసారిగా కొత్తదిగాలోచే ఒకధోరణి ప్రారంభించింది. వేళ్లు పాతుకొని పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకి భారతదేశంలో పెద్దముప్పే వచ్చిందనిపించింది. కాని, అత్యవసర పరిస్థితిగా వర్ణింపబడినది వచ్చినంత హఠాత్తుగానే పోయింది. <u>(ఈ హఠాత్పరిణామం వలననే దేశంలో ఇంత అస్థిమిత పరిస్థితి ఏర్పడినదేమోనని అనిపిస్తూ ఉంటుంది.)</u> ......... (గుర్తింపు నాది)

ఈ చివరి వాక్యం నిజంగా నేటిధోరణికి చక్కటి వివరణ.

నేను పైన ఉదహరించిన సంపాదక ప్రముఖులు కోకొల్లలుగా ఉన్న ఈ దేశంలో, "భారతి"లో నన్నా ఈ కాంతి కిరణం కనపడటం సంతోషకరం కాదా !

ఇక ఈనాటి ధోరణులకు ఒక ఉదాహరణ.

## 4

రాజస్థాన్‌లో ఖేత్రీకాపర్‌ప్రాజెక్టు ఉంది. దానికి 45 కిలో మీటర్ల దూరంలో నీమ్‌కాథానా ఉంది. 1978 ఫిబ్రవరి 26న మెహమూద్ నైట్' జరిపాడు. 20,10,5 రూపాయల చొప్పున సుమారు 2000ల మందికి టిక్కెట్లు అమ్మాడు. ఆ ప్రదర్శన రోజున సుమారు 1000 మంది బయటచేరి రాళ్లు రువ్వటం ప్రారంభించారు. అయినా ఎలాగోలాప్రదర్శన జరిగింది. మధ్యలో లైట్లు పోయాయి సరేదానితో అక్కడ ఉన్న స్త్రీలను ఎలాగోలా టార్చిలైట్ల సాయంతో బయటికి తీసుకుపోయారు. తరువాత పోలీసులతో చిన్నతగాదా జరిగింది, లైట్లు పోయాయి కాబట్టి డబ్బు తిరిగి ఇవ్వమని అడగటం, నిర్వాహకులు నిరాకరించటం, దానితో కుర్చీలు ఎత్తుకు పోవటం, తిరిగి 28న పోలీసులు సోదా చేస్తారనే భయంతో ఆ కుర్చీలను రోడ్డుమీద పారవేశారు. క్లుప్తంలో జరిగిన సంఘటనలివి.

దీనిమీద మొదటిసారిగా మార్చి 7న 'నవభారత్ టైమ్స్'లో ఫరీదాబాద్‌నుంచి ఒకరు ఉత్తరం వ్రాశారు. ఇది ఖేత్రీవాసులకే కొంత ఆశ్చర్యాన్ని కలుగజేసింది. తొమ్మిదిరోజుల తరువాత మార్చి 16న జైపూర్‌నుంచి వెలువడే 'నవజ్యోతి' అనే హిందీ దినపత్రిక ఇదే వార్తను, మూక ఉమ్మడిగా మానభంగాలు జరి గాయని, సినిమా కాంపౌండ్‌నుంచి 5,6 కిలోల పగిలిన గాజులు, చిరిగిన గుడ్డలు పోగుచేయబడ్డాయనీ, వార్తను ప్రకటించింది. మరుసటిరోజు, మార్చి 17న ఢిల్లీనుంచివెలువడే "హిందూస్తాన్" హిందీ దినపత్రిక, వందమంది స్త్రీల మానభంగం, నలభైమంది స్త్రీలు రెండురోజులపాటు గుండాలచేత నిర్బంధింపబడ్డారనీ వార్తను ప్రముఖంగా మొదటిపేజీలో ప్రచురించింది. సరేదీనిమీద అసెంబ్లీలో, పార్లమెంటులో గందరగోళాలు, వగైరా వగైరా జరిగాయి.

తెరవెనుక చరిత్ర ఏమిటి ? రాజస్థాన్‌లోనిది జనతా ప్రభుత్వం. దానిని ఎలాగోలా బదనాం చేయాలి. ఒక ఎం. ఎల్. ఏ. గారు "హిందూస్థాన్ టైమ్స్" (ఢిల్లీ ఆంగ్లదినపత్రిక) జైపూర్ విలేఖరి చెవులు కొరికారు. ఆయన వార్త పంపారు. కాని ఆ వార్త ఆ సంపాదకునికి నచ్చలేదు, కారణం ఇలాంటి ఘోరం నిజంగా జరిగితే, 19 రోజుల తరువాత వెయ్యటం నచ్చలేదేమో! కాని ఆ వార్త కాపీ 'హిందూస్తాన్' (హిందీ దినపత్రిక – అదే యాజ మాన్యంచేత నడపబడేది) బల్లమీద కూడా ఉంది. 'హిందూస్తాన్' వారికి జైపూర్‌లో ప్రత్యేక విలేఖరి కూడా ఉన్నాడు. అయినా అతనిని విచారించకుండానే నాలుగు కాలంల శీర్షికతో మొదటి పేజీలో దీనిని ప్రచురించింది 'హిందూస్తాన్', దుమారాన్నిలేపింది.

ఇంతవరకూ జరిగింది మామూలు చరిత్రే. కాని కొత్తగా ఏర్పాటయిన 'ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా' దీనిమీద ఒక హై పవరు కమిటీని వేసింది. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'కు చెందిన కుల దీప్ నాయర్, పత్రికా రచయిత్రి శ్రీమతి కమల మంకేకర్, 'హిమ్మత్'కు చెందిన కుమారి నీరజ చౌదరిలు దానిలో సభ్యులు. వారు జైపూర్, ఖేత్రీలను సందర్శించి తమ నివేదికను సమ ర్పించారు.

అందులో పోలీసులు లైట్లు పోయిన వెంటనే చర్య తీసు కుంటే బాగుండేదని, అలా చేయలేదని అంటూ మంత్రులకు టెలి

శర్మ కూడా హిందీ భాషలో మానభంగానికీ, అవమానానికి ఒకే మాట "బలాత్కార్" ఉందనీ, అది వాడానని అన్నాడనీ వ్రాశారు. దీనితో మనకు పెద్దగా నిమిత్తంలేదు.

పత్రికా రచయితలను గురించి వారన్నదిది: 'హిందూస్తాన్' జైపూర్ విలేఖరి ఆ వార్తను జైపూర్‌నుంచే పంపాడనీ, దానికి ఆధారం ఆయన 'నవజ్యోతి' విలేఖరితో జరిపిన సంభాషణనీ, ఇంతకూ ఆ విలేఖరి అయినా భ్రమపడ్డాడా అంటే అదీ తమకు అనుమానమున్నారు. అసలలాంటి తీవ్రమైన వార్తను, విచారించకుండా 'నవభారత్ టైమ్స్' లేఖగా ప్రచురించటమే విచిత్రమనీ, తామా సంపాదకునితో సంభాషించామనీ అన్నారు.

తరువాత ఇంకా ఈ విధంగా అన్నారు :

**"We must say that the concerned newspapers have not taken the necessary care that should have taken in reporting such incidents. To say the least, they acted in the most irresponsible manner."**

ఇది చదువుతుంటే, ఒక ప్రముఖ సంపాదకుడన్న "Now the press has total freedom" అన్న మాటలు గుర్తు రావటం లేదూ !

కాని ఏ పత్రికా ఈ విషయం ప్రచురించినందుకు బాధను వెల్లడించలేదు, ఏ రచయితా దానికి విచారపడలేదు.

ప్రజలకుండే జ్ఞాపకశక్తి శూన్యం అనేదేనా నేటి మన ప్రముఖ పత్రికలకు, బడా జర్నలిస్టులను నడుపుతున్న సూత్రం?

## 5

పత్రికల ప్రచారాలతో దేశం దేశం ఏవిధంగా ధ్వంసం కాగలదో అనటానికి సమీప గతంలోని చక్కటి ఉదాహరణ బంగ్లాదేశ్. కొన్ని పత్రికల చరిత్రనిక్కడ తెలుసుకుందాం.

1971లో ఢక్కా దమన కాండలో దైనిక పత్రిక 'ఇత్తెఫాక్' కార్యాలయం నేలమట్టం చేయబడింది. అయితే రెండునెలల తరువాత తన పొరపాటు గ్రహించి యాహ్యాఖాన్ లక్షటాకాలు (బంగ్లాదేశ్ నాణెము) నష్టపరిహారమిచ్చాడు. ఇంగ్లండ్, పశ్చిమ జర్మనీలు పర్యటించి రోటరీ యంత్రాలు తెచ్చుకుని, యాహ్యా, టిక్కాఖాన్‌ల భజన ప్రారంభించాడు. ఆ సంపాదకుడు బంగ్లాదేశ్‌కి స్వతంత్రం రావటంతోనే అవామీలీగ్‌ను పొగడటం ప్రారంభించాడు. దానితో 1971 నుంచీ రావలసిన ప్రకటనల డబ్బంతా రాబట్టుకోవటమే కాకుండా, 17లక్షల విలువగల లైసెన్సు సంపాదించాడు.

రెండవది "హాలిడే" వారపత్రిక, దాని సంపాదకుడు ఇనయతుల్లా. అయూబ్‌ఖాన్ హయాంలో ప్రారంభమై, పైకి చెనాను లోలోపల అమెరికాను మనస్సులో ఉంచుకుని ప్రచారం ప్రారంభించారు. అనేక విదేశాలకు తొత్తుగా పనిచేస్తూ, పశ్చిమ జర్మనీ; హాలండ్, బెల్జియం, ఇంగ్లాండ్, జపాను, తిరిగి సకుటుంబంగా అమెరికా, ఇంగ్లాండ్‌లు తిరిగాడు. స్వాతంత్ర్యం రావటంతోనే, దేశంలోగల ఆరుకోట్లు ద్రోహులా అంటూ ఒక వ్యాసం ప్రచురించాడు. బంగ్లాదేశ్ ప్రభుత్వము, దేశంలో పాకిస్తాన్‌తో సహకరించిన అధికారులు, రజాకార్లు వగైరాలపై చర్య తీసుకోవటానికి వీలులేకుండా, ఒక ప్రచారాన్ని మొదలుపెట్టాడు. 1973లో పార్లమెంటుకు పోటీచేసి, ప్రత్యర్థికి లక్షవోట్లు వస్తే, 4500ల వోట్లు పొంది ఓడిపోయాడు. ముజీబ్‌ను వదిలివేసి, అకలంక దేశభక్తుడు తాజుద్దీన్‌ను విమర్శించటానికి పూనుకున్నాడు. 1975లో అత్యవసర పరిస్థితి ప్రకటించబడిన తరువాత, తనంతట తానే ఒక ప్రెస్‌కోడ్ తయారుచేస్తానంటూ, ప్రెసిడెంట్‌కు ప్రెస్ సలహాదారుడయ్యాడు. సెక్యూరిటీయాక్టు క్రింద అరెస్టు కాబడి, విదేశీ రాయబార కార్యాలయం జోక్యంతో విడుదలయ్యాడు.

'బంగ్లాదేశ్ టైమ్స్'కు సంబంధించిన మెహబూబ్ ఆలమ్, విముక్తి పోరాటకాలంలో కరాచీ "డాన్"కు విలేఖరి, ముజీబ్‌మీద విషప్రచారం సాగించాడు. ఈ విషయాలన్నీ తెలిసిన తరువాత కూడా ముజీబ్ అతనిని క్షమించాడు. ముజీబ్‌మీది కేసులో ఇతను ప్రముఖ సాక్షి.

నేటి ప్రభుత్వ పత్రిక "బంగ్లాదేశ్ అబ్జర్వర్" ఒబేదుల్ హక్, విముక్తి పోరాటకాలంలో షేక్‌ముజీబ్‌ను దుమ్మెత్తిపోశాడు, ప్రభుత్వం మారటంతోనే పత్రికలో ఒకకాలంలో ప్రత్యేకంగా రోజూ ముజీబ్ భజన ప్రారంభించాడు.

యాహ్యాఖాన్ షేక్ ముజీబ్‌కు వ్యతిరేకంగా 1971లో బనాయించిన దేశద్రోహనేరంలో ప్రథమ ముద్దాయి సైఫుల్‌బారీని ముజీబ్ క్షమించి బంగ్లా రేడియో వార్తావిభాగానికి అధికారిగా నియమించాడు.

అటికుల్ ఆలం, సిమ్లా సమావేశానికి ఎవ్వరూ వెళ్ల వద్దంటే వచ్చి, పాకిస్తాన్ అధికారులతో మంతనాలు జరిపి, అరెస్టయి, ముజీబ్ దయతో క్షమింపబడి, నేడు ఢక్కాలో బి.బి.సి. విలేఖరిగా ఉన్నాడు.

షేక్ ముజీబ్‌కు సలహాదారుడైన షేక్ ఫజుల్‌హక్ మణి, రాత్రికి రాత్రి సోవియట్ రష్యా సహాయంతో రెండు దినపత్రికలకు అధిపతి అయ్యాడు.

తాను 28 సంవత్సరాలు కష్టపడి నిర్మించిన అవామీలీగ్‌ను రద్దుచేసి, ఒకే ఒక పార్టీ 'బాక్సాల్' పార్టీని స్థాపించినపుడు, 350 మంది పత్రికా రచయితలు గుంపుగా వెళ్లి ఆ పార్టీ సభ్యత్వం స్వీకరించారు.

తరువాత అమెరికన్ విదేశాంగశాఖ కార్యదర్శి హెన్రీకిసింగర్ బంగ్లాదేశ్ విచ్చేశాడు. ఇది జరిగింది 1972లో. అంతకుముందే తాజుద్దీన్‌ను మంత్రిమండలినుంచి తొలిగించటం, దానిమీద 'ఇత్తెఫాక్' 'బంగ్లార్ బాణి' 'బంగ్లాదేశ్ టైమ్స్'లు తాజుద్దీన్‌ను తీవ్రంగా విమర్శించాయి. ఈవిధంగా పత్రికలు ఎలాపడితే అలా భజన ప్రారంభించి, దేశాన్ని భ్రష్టు పట్టించాయి.

షేక్ ముజీబ్ దారుణహత్యాకాండ 1975 ఆగస్టు 15న జరిగింది. ఆయన ముఖ్య అనుచరులు, నజ్రుల్ ఇస్లాం, తాజుద్దీన్ అహమ్మద్, ఖమరుజ్జమాన్, మన్సూర్ ఆలీలు ఢక్కా జైలులో నవంబరులో హత్యచేయబడ్డారు.

ఈ తతంగాలలో పత్రికల, సంపాదకుల, రచయితల, మేధావి వర్గాల పాత్రలను తలుచుకుంటే ఒళ్లు జలదరిసుంది సుమా!

సుఖరంజన్‌దాస్ గుప్తా, మూడు సంవత్సరాలు ఢక్కాలో 'ఆనందబజారు' పత్రిక విలేఖరిగా ఉండి, తను వ్రాసిన గ్రంథం "మిడ్ నైట్ మాసక్కర్ ఇన్ ఢక్కా"లో ఈ వివరాలు కోకొల్లలుగా ఇచ్చాడు. ఆ గ్రంథం చదివినపుడు, మనం కోరతగిందల్లా మన దేశానికి అలాంటి దుర్గతివద్దని ప్రార్థించటం తప్ప వేరు చేయలేమో ననిపిస్తుంది.

## 6

రష్యన్ జాతీయుడు, నోబుల్ బహుమతి గ్రహీత అలెగ్జాండర్ సొలిఖున్‌స్టిన్ రష్యానుంచి 1974 ప్రారంభంలో బయటికి పంపబడ్డాడు. 1978 జూన్ 8వ హార్వార్డు విశ్వవిద్యాలయంలో ప్రసంగించాడు.

అందులో ఆయన రష్యన్, అమెరికన్ దృక్పథాలు రెంటినీ విమర్శించాడు. తరువాత పత్రికా ప్రపంచపు ధోరణులను గురించి కూడా మాట్లాడాడు. ప్రస్తుతపు ధోరణల్లా కేవలం ఏ చట్టాన్నీ ఉల్లంఘించకుండా ఉండేందుకు ప్రయత్నం చేయటం తప్ప నైతికమైన ధోరణి ఏదీ లేదంటాడు. తమ చదువరుల పట్లగాని, చరిత్ర పట్లగాని వారికి ఎలాంటి బాధ్యతా లేదంటాడు. ఎప్పుడైనా వారు తప్పుడు సమాచారం ద్వారాగాని, పొరపాటు అభిప్రాయాలద్వారాగాని చదువరులను తప్పుదారి పట్టించినా, ఏ పత్రికా రచయితా బహిరంగంగా తన పొరపాటును ఒప్పుకోలేదంటాడు.

పత్రికా ప్రపంచం చదువరులను తప్పుదారి పట్టించే ప్రమాదం బాగా ఉందనీ, ప్రతివారికీ ప్రతివిషయమూ తెలుసుకునే హక్కున్నదంటూ అందరి విషయాల్లో జోక్యంచేసుకోవటం భావ్యం కాదంటాడు.

ఈ 20వ శతాబ్దపు పత్రికా ప్రపంచపు లక్షణాలుగా—తొందరపాటుతనము, పైపై ధోరణులతో తృప్తిచెందటం—అని వర్ణించాడు. పత్రికలకు నేడు కావలసింది విషయాలలోనికి లోతుగా పోవటం కాదనీ, ఈ రెండు గుణాలు ఈ శతాబ్దపు మానసిక రుగ్మతలనీ వర్ణించాడు.

బాధ్యతారహితంగా ప్రవర్తించే ఈ పత్రికా రచయితలను ఎవరు, ఎంతకాలం, ఎలాంటి అధికారాలతో నియమించారంటూ ప్రశ్నిస్తాడు. ఆయన వెలువరించిన కొన్ని భావాలు ఈ వ్యాసం చివర ఈయటం జరిగింది.

పత్రికా నిర్వహణ వ్యాపారమే, అంత పెట్టుబడిలో ఈ అధునాతన పరిశ్రమను నిర్వహించటం నిజంగా కష్టమే. కాని తమను 'ఫోర్తు ఎస్టేట్' అని పిలుచుకునే ఈ వర్గానికి కొన్ని బాధ్యతలు కూడా ఉన్నాయి. నేడు వాటి విస్మరణే విధి నిర్వహణ క్రింద చెలామణి అవుతున్నది. వ్యాపారాన్ని, ఆ బాధ్యతనూ మేళవించనప్పుడు అది పత్రిక కాదు, మరేదో అవుతుంది. కాబట్టే ఇటువంటి అస్తవ్యస్త పరిస్థితుల్లో, మాకు ఇంతవరకూ 'ఇన్‌ఫర్‌మేషన్' ఇస్తున్నందుకూ, 'Comment is sacred, facts are free' అన్న నేటి నినాదాన్ని కాకుండా, 'Facts are sacred, comment is free' అన్నసాంప్రదాయక నినాదాన్నే అనుసరిస్తున్నందుకు 'ఆంధ్రపత్రిక'కు మా అభివందనలు.

ఇకముందుకూడా తన అస్తిత్వాన్ని కాపాడుకుంటూనే, మాకు 'ఇన్‌ఫర్‌మేషన్'తో పాటు Knowledge of stillness ను కూడా ఈయమనీ, సద సద్వివేకంతో కూడిన ప్రవర్తననే ప్రదర్శించమనీ మా ఆకాంక్ష.

మూడవతరంలో కూడా 'విశ్వదాత' పేరును తలుచుకునేటట్లు చేస్తున్నందుకు మా కృతజ్ఞతలు. 'ఆంధ్రపత్రిక' 'భారతి' లకు సిద్ధార్థి శుభాకాంక్షలు.

"......or we may witness shameless intrusion into the privacy of well-known people according to the slogan that 'every one is entitled to know everything.' (But this is a false slogan of a false era; far greater in value is the forfeited right of people not to know, not to have their divine souls stuffed with gossip, nonsense, vain talk. A person who works and leads a meaningful life has no need for this excessive and burdening flow of information)

Hastiness and superficiality – these are the psychic diseases of the 20 th Century and more than any where else this is manifested in the press, In-depth analysis of a problem is anathema to the press it is contrary to its nature. The press nearly picks out sensational formulas.

Such as it is, however, the press has become the greatest power within the Western countries, exceeding that of the legislature, the executive and that of the judiciary. Yet one would like to ask: according to what law has it been and to whom is it responsible? In the Communist East, journalist is frankly appointed as a State Officer. But who has voted Western journalists into their positions of power for how long a time and with what prerogatives.

There is yet another surprise for someone coming from the totalitarian East with its rigourously unified press, one gradually discovers a common trend of preferences within the Western press as a whole, the spirit of the generally accepted patterns of judgment and the common corporate interests, the sum effect being of competition but unification. Unrestrained freedom is for the press, but not for the readership because news papers mostly transmit in a forceful and emphatic way the same opinions which do not too openly contradict their own and that of the general trend."

Alexander Solzhenistyn in his address delivered at Harvard University, Cambridge, Massachusetts on June 8, 1978.

# విలయవలయం

## డాక్టర్ మిరియాల రామకృష్ణ

అసూయలేని చోటుకోసం
ఎన్నియుగాల అన్వేషణం ?
భువనమంతా పవనమంతా
ఎన్నడయింది ఈర్ష్యాంకితం ?
'పవలు' సిందూరం బొట్టుగా పెట్టుకుంటే
'రాత్రి' కళ్లనిండా కాటుక పెట్టుకుంటుంది !
'పద్యం' హృద్యంగా నడుస్తుంటే
'గద్యం' గందరగోళంగా పరుగెడుతుంది !
'కలం' ఆలోచనల్లో వెలుగుతూంటే
'గళం' ఆవేశంలో కొండెక్కుతుంది !
'కాలం' శిశిరంతో పోరాడుతూంటే
'కంకాళం' మేళంలో పొగపీలుస్తూ ఉంటుంది !
మింటమెరిసే మేటిచుక్కకు
మిణుగురులతో ఏలపోటీ ?
రెక్కలార్చే పావురంతో
గాలిపడగకు సాటి ఏమిటి ?

పోరాడగల దమ్ముంటే 'పొడుగు' తలమీద
పెడుతుంది 'పొట్టి' పాదం !
ఎగిరేశక్తి గుండెకుంటే సహకరిస్తుంది
నిగనిగలాడే రెక్క !
కిరణం రణంలోకి దూకితే
కీళ్లు విరిగేను చీకటికి !
హరిణం చెంగున పరుగెత్తితే
మైళ్లు మిగిలేను కిరాతుడికి !
ఎవని రంగుకు వాడు సరంగు
అంతవరకే సముదాచారం !
హరివింటి రంగులన్నిటినీ
హరించు చూపు ఆత్మవంచన !
అత్యాశ అనే బొగ్గు రాజుకుంటే
అశాంతి అంబరానికంటుకుంటుంది !
అసూయ అనే మరుగుజ్జు నడుస్తుంటే
అభ్యుదయం ధూళి పాల్లౌతుంది !
ప్రగతివిమానం వేగంతో పైకి లేచాకా
పరుగెత్తడం మూర్ఖత్వం
ప్రజలు నిజంమీద లేచి నిలబడ్డాకా
పట్టుకు వేలాడటం నియంతృత్వం !

శ్రమస్వేదం సమార్జిస్తే
రవంతైనా విస్ఫులింగం !
వేసి కన్నం రాశిపోస్తే
మేరువైనా చితాభస్మం !
యశస్సూ అలాంటిదే అసూయపడుతూ గడిస్తావెందుకు?
వసంతాల కృషితో కిసలయిస్తాయి వనంలోని తరులతలు !
చిరుపాపల కెంబెదవులు పలికే పదబంధాలు
ఎవరో తగిలిస్తే అతుక్కున్న వజ్రాలా ముత్యాలా ?
చరిత్ర చిత్రం చూసి ఇటురా !
ఎముకల మూల్గు కేమిటర్థం ?
పాలెగూళ్లకు ఏది భాష్యం ?
ముళ్లకళ్లకు వ్యాఖ్య ఏమిటి ?
వల్లకాడులోని కొరివిమంటలలో వసాగంధం ఏమిటి ?
సప్త సముద్రాల కెరటాలు ఎత్తిపోస్తున్న నురగలెందుకు ?
రాబందుల రెక్కలనుంచి కారిపోతున్న గాలి ఏమిటి ?
ఎడారుల పెనుదిబ్బల పేరుకుపోయిన తుఫాను లెన్ని ?
అసమర్థతకు ఆలవాలం
పేరాసలకు తీరభూమిక
యశోభూతపు టాక్రందనలు
వినిపించే వీధిని – గతం !

సిగ్గు జారిపోతున్నా ఛీత్కారాలు క్రక్కుకునే
పవతులకు సలాంలు కొట్టేను ఈర్ష్య !
పందిళ్లే తగులబడిపోతున్నా పంతాలు విసురుకునే
పక్షాలకు సాక్ష్యాలు పలికేను అసహనం !
మందుతాగిన మాత్సర్యానికి
తా ప్రవచించినదే వేదం !
బుసలుగొట్టే అసమర్థతకి
తన గళంలోనిదే అమృతం !
సూర్యుడ్ని గురించి నేను కవిత రాస్తే
చుంచెలుక దాని అంచులు కొరికేసింది !
పచ్చనిమావిమొక్క తెచ్చి పాతిపెడితే
పంది దాన్ని త్రవ్వి పారేసింది !
హరివిల్లు చెక్కి చేతికిస్తే
చినుకు చినుకుగా విరిచిపోయింది జలదం !
నక్షత్రహారం కొని మెడలో పెడితే
భక్షించి పారిపోయింది తిమిరం !

చివురుకొట్టిన గొంగళిపురుగు
రంగుచొక్కా ధరించాకా
పూలతేనెలు త్రాగికూడా
పురుడుపోస్తుంది పురుగులకే !

తుప్పుపట్టిన ఇనపఊచే
గొప్పరంగుల చెంగులు పట్టి
గప్పాలు కొడుతూ ఉంటుంది
పక్కచేరిన పూలతెరతో !

నల్లటి చీర కట్టిన నిశి
జాబిలి దివ్వె కాంతికి మెరిసి
వెన్నెలలనే కబళిస్తుంది
స్తుతించుతుంది తన్నే తను !

పిల్లనదులకు విందుకోసం
చల్లచేసే మహాజలనిధి
చెలియలికట్ట అడ్డయిందని
కెరటాలెత్తి ఏడుస్తుంది !

ఓనమాలను దిద్దిన వేలు
ఒజ్జను ధిక్కరించేందుకొక
పరికరంగా మారితే మరి
పరిణతి అనే మాట ఎక్కడ ?

పట్టాలపై నడిచే రైలు
స్వేచ్ఛ లుప్తమయిందని యేడ్చి
పట్టాలనే తిడుతున్నట్లు
చేస్తుంది కోలాహలధ్వని !

అహంతలోంచి కుసుమించిన పుట్టగొడుగు
మనస్సులో చుట్టుకుపడుకున్న కాలనాగు
అంతరాత్మ గుట్టుగా తయారుచేసుకున్న నాటుబాంబు
నాకు కనిపించాయి అసూయ ఆవులించగానే.

బాగాఉంది దస్తూరీ అని
కస్తూరి ఊరికే ఇస్తే
దస్తూరీ గలవాళ్లందరూ
'శ్రీనాథుళ్లు' అయిపోదురే !
ఫణాగ్రమణుల అందంచూసి
పర్యంకాన్ని పాములతోటి
నింపుకునే వివేకవంతుడు
భూలోకాన లేనేలేడు !
(కైలాసాన ఉన్నాడేమో !)

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# తంజావూరు నాటకములు : పాత్రోచిత భాష

ఆధునిక తెలుగు నాటకములలో పాత్రోచిత భాషా ప్రవేశమిప్పటికి 86 ఏండ్ల క్రిందటనుండి యని మనకీనాడు తెలియుచున్నను, అంతకుముందు తెలుగు నాటకములలో పాత్రోచిత భాష యిప్పటికి మూడు శతాబ్దుల క్రిందటనే అనగా క్రీ.శ. 1650 ప్రాంతముల నుండియు, దక్షిణాంధ్ర వాఙ్మయమున తంజావూరి నాటకములలో ప్రవేశపెట్టబడినది.[1]

అయినను — తంజావూరి నాటక రచనలన్నియు యక్షగానములుగా పరిగణితమగుటచేతను, సాహిత్యలోకమున నవి యక్షగానములే యన్న భావమావరించి యుండుటచేతను ఆంధ్ర నాటక చరిత్రమున నీ విషయము విస్మృతమైనది.

తంజావూరి నాటక కర్తలే, తొలుత తెలుగు—నాటకములలో పాత్రోచిత భాష ప్రవేశపెట్టినవారు.

తెలుగు నాటకములందన్ని పాత్రలును గ్రాంథిక భాషలోనే వ్యవహరింతురు

తంజావూరి నాటకములందట్లుగాదు ఆయా పాత్రల కనువగు భాషలో వారు సంభాషణలు జరిపెదరు — అవి నాలుగు విధములు·

1. ఉత్తమ పాత్రలు : (i) రాజులు - దేవేరులు } గ్రాంథిక భాష
   (ii) విద్వాంసులు, (iii) పురోహితులు } శిష్టవ్యావహారిక భాష
2. మధ్యమ పాత్రలు— స్త్రీలు — వేశ్యలు గ్రాంథిక భాష
   (i) ముత్తైదువలు — బ్రాహ్మణుల వాడుక భాష (ఏస)
   (ii) ఎటుకత — కొండవారి ఏస
3. అధమ పాత్రలు లేక నీచపాత్రలు } (i) గొల్లవారు (ii) కటికవారు (iii) చెంచులు } గ్రామ్య భాష

## 1. ఉత్తమ పాత్రలు - గ్రాంథిక భాష

### (i) రాజులు

హిరణ్యకశిపుడు —

రారా ఓరికటికి హాస్యరసంబు జిలుకు పలుకుల నవ్వింప నేర్పరియైన విదూషకుని రప్పింపరా. (ప్రహ్లాద నాటకము)

ద్రుపదమహారాజు —

వినవోయి ధృష్టద్యుమ్న సకలదేశాధీశ్వరులు వచ్చియున్నారె. వారలకు మన ప్రతిజ్ఞ దెలిపి యంత్రమత్స్యము ద్రుంచి యీ కన్యకామణిని గైకొమ్మని స్వయంవరము చాటింపవోయి. (ద్రౌపదీ కల్యాణము)

### దేవేరులు

సత్యభాను —

వినవె చెలియ ! నీవు చెప్పినవి నిలువరమేసరి. ఎంతైనను నేను చిన్నదానను. రుక్మిణిదేవి పెద్దది గనుక యామె వద్దకు బోయి వేడికొనునది న్యాయమేసరి. కాగా రుక్మిణీదేవి వద్దకు బోవుదము రావె. (రుక్మిణీ సత్యభామా సంవాదము)

పార్వతీదేవి —

వినవే శుకవాణి. నేడెవరి ముఖము చూచితిమో యిటువంటి ద్రోహ సూక్తులు వింటిమి. ఇందుకు ప్రాయశ్చిత్తము ''శివశివా'' యని శివ స్మరణము చేయవలెను. పాషండులు మాయావులీ రీతి బ్రాహ్మణ వేషముతో వచ్చి దుర్బోధ సేయుదురు. వీరి పలుకులు వినరాదు. వీని ముఖము సహా చూడరాదు. (పార్వతీ పరిణయము)

### (ii) విద్వాంసులు - శిష్టవ్యావహారిక భాష

గోవిందభట్టు —

ఓహో నిలువుండ ఎన్నిగింతులువేస్తిరి. మీ పక్షమైన స్త్రీకి పుంవద్భావంకలదనేరా· మా పక్షమైన స్త్రీకి పుంవద్భావమువేదనేా

చిట్టిబిళ సోమయాజులు —

అవునోయి గోవిందభట్టు. ఇందరను మించి దొర దగ్గర కూర్చున్నావే. కవిత్వైవ విద్యా అని కవిత్వంగదా ప్రధాన విద్య.

---

1. తంజావూరి నాటకములన్నియు — ఆంధ్ర విశ్వకళా

గోవిందభట్లు -

ఓరి నీవు నిన్నటివరకు పిళ్లగాడితనము చేసి నేడుకుళ్లాయి పెట్టుకుంటేనే విద్వాంసుని కొడకనైతివా

(విజయరాఘవ కల్యాణము)

## (iii) పురోహితులు

కొండుభట్లు —

అవునోయి యల్లు సోమయాజులు నూరు తరాలనుంచి యీ యింటికి తగువైన పురోహితుండ నేనుండంగా నీవెవ్వండి కొడకవు నా స్వాతంత్ర్యంకొంగుముడి రూక తీసుకపోయ్యేటట్టుగా.

యల్లు సోమయాజులు -

ఏమోయి కొండుభట్లు. మా తాతకు చెవ్వప్పనాయనివారు పొంకెన సంభావనకట్టడిచేశి వుండంగా నీవెవ్వండవు అపరించుక పోయ్యేటట్టుగా మాయన్న కొడకవా.

ఓబళభట్లు —

అవురా నరసంభట్టిగా నగరింటి సహస్ర నామపూజకు సువర్ణ పుష్పాలుగలవే. అవల్లా అపహరించి బదులుగా మొలాము చేసిన పూలు తెచ్చివేస్తివే యిది నగరివారు వింటే అట్లాగే శేయించరా ఇది ఎంత లేదనికనిపించుకాకవుంటే నీ వాడనామరి.

మధ్య పురోహితుని మాట —

వోయి వుండరోయి ఇషుబడి అషుబడి యిటువంటి మాటలు నగరబడెనాయనా అందరికి బహు శ్రేయస్సు వచ్చీనే. నగరవచ్చిన ఆదాయమల్లా పంచుక తీసుకుందామోయి మనలో మనమేనా కొట్లాట. ఇంతట చాలించరోయి.

(మన్నారుదాస విలాసము)

# 2. మధ్యమ పాత్రలు

## స్త్రీలు

## (i) వేశ్యలు - గ్రాంథిక భాష

దేవదేవి — అక్కసువాదము.

చెల్లి : పందెము చెల్లెగదే ఓ యక్క పందెము చెల్లెగదే

అక్క : వీని కందుమాటల కరగించినపుడె నీ పందెము చెల్లెనె బంగారు చెల్లి

చెల్లి : వలపించరాదంటివే, ఓ యక్కవలపించరాదంటివే

అక్క : ఆవలరాజునైనను వలపింపనేర్తువే కలియుగ రంభవు కావా నీవు.

## (ii) ముత్తయిదువుల సంభాషణ

[ బ్రాహ్మణ ఏస ]

రావే ఓ కాసల్నాటితిమ్మక్క

మరొకరిమాట : ఇదిగో వస్తుందాననే పేరూరికామక్క వింటివాషే జందేల బుచ్చక్క

ఒకతె : అదేందే ఓ బారతాల సూరక్క వస్తివాషే పుల్లగూర పేరక్క మన సముద్రరాజు నగరను చెంగమ్మవారికి పెళ్లి చేస్తున్నారట పాటలు పాడిన ముత్తైదువులకల్లా కట్నవిస్తున్నారట పుచ్చుకుందాం వచ్చేరాషే.

ఇంకొకతె : అందుకే కాదుషే వచ్చింది. ఓసెమ్మ వింటివాషే మా వారు ఏమేమొ ఏషేషో యేందేందో అంచుందారే.

మరొకతె : ఏ మంచుందారే ఓసెమ్మ మా వారు ఇందుకు మాత్రం మునలి వారవ ఎప్పైనా నన్ను గడించి పెట్టమని పోరుక లించుందారే ఓసెమ్మా

ఇంకొకతె : ఓశమ్మ అట్లాననకువే పురుషుండే దైవం. అన్నాడే ఓశమ్మ అషగనుకనే మా వాని బిడ్డకన్న విశేషంగా పోషింతునే.

మరొకతె : మీ వారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతునంటివే. అష్టైతే ఇరుగువారు పొరుగువారు ఏంగావాలే నీకు ఓసెమ్మ మీ వార్ని మా వార్ని మార్చుకొందమషే -

(హేమాబ్జనాయికా స్వయంవరము)

## (iii) ఎఱుకత మాటలు కొండవారి ఏస

సిద్ధగణేశ, శ్రీ వెంకటేశ, కాశీవిశ్వేశ — కంచివరదప్ప ఘనకాకులప్ప, ఓ బళ నారసింహ, ఓ నారసింహ, సోనార భైరవ, సుందర భైరవ, మధుర చొక్కయ్య మన్నారయ్య ఖండెరాయ, కంభమురాయ వల్మీకేశ వసంత త్యాగేశ ఉజ్జీని హోంకాళి, ఓ మహంకాళి, కంకళమ్మ కామాక్షమ్మ ఓ సూరమ్మ ఓ అక్కలమ్మ, మీనాక్షమ్మ మేటి యెల్లమ్మ — ఆనందవల్లి అభిషేకవల్లి కుయిలారమ్మ కొల్హాపురమ్మ మీరందఱు నా ముందర వచ్చి నిలువరేయమ్మ ఈ రాజకన్య కోరిన కోరికలు కొనసాగింపరే యమ్మ

"అమ్మోయమ్మ ముత్యాల చెయ్యి రత్నాల చెయ్యి పగడాల చెయ్యి వజ్రాల చెయ్యి మంచి బంగారుపంటి భాగ్యం గలిగిన చెయ్యమ్మ''

అమ్మోయమ్మా నీ వడిగిన గురుతులు మాత్రము చెప్పెద గాని యిదంతా చెప్పగూడునా వేగులవాణ్ణి అడిగేటట్టు అడుగు తున్నావు. నేనేమైన చూసివస్తినా యమ్మ.

రామమోహనకొరవంజి

# 3. నీచ పాత్రలు

## (i) గొల్లల మాటలు [ గ్రామ్యబాష ]

ఒకడు : ఒరేబరే చిన్నెంక ! ఒరేబరే పెద్దెంక ! ఒరేబరే నూకా ! ఒరే గుడ్డిబొమ్మ ! ఒరే అమాసపెద్దు ! ఒరే మాంబాక తిమ్మ ! ఒరే గంగ మన కిచ్చమ్మకు వచ్చిన గాచారం తీరెనే మనకాయిసారం వద్దు రారోరి.

మఱొకడు : ఒరే కిచ్చెమ్మకు ఏమి గాచారం వచ్చెరా

వేఱొకడు : ఒరే నువ్వేడ నుంటివిరా

ఇంకొకడు : ఒరే నేనే పొన పొస పోనా కొడెమ్మగుంట కాడ గొత్తెలమంద యుండదే ఆ గొత్తెలమంద కాడ ఒక గుడ్డి మానిసి మరక పోతావుండగా ఆ అంటానూస్తూ ఉంటిరా

ఒకడు : ఒరే ఒరే గుడ్డిబొమ్మ బందుకట్టు బందుకట్టు అంటూ నలుగురు ఇనేటట్టుగా ఇట్లా బయలు సేతురటరా వోరి ఒరే ఒరే అంక ఈ యెత్తిగొల్లవాడు అల్లా చెప్పితే నీకేమి బయమురా నువ్వే నేను కాదటరా

మఱొకడు : నువ్వే నేను నేనే నువ్వు (పూతనాహరణము)

## (ii) కటికవాని మాటలు

ఒహోయి నీవెవరు తెలియజెప్పవోయి —

కటిక : మీరెవరు నన్నడిగేందుకు ఎవరి కొడుకులు కాసంతా సేయరు మీరు. మీరడిగితే మేము చెబుతున్నామా తొత్తు కొడుకుల్లార.

అడిగితిమంటే ఏలనోయి కసరుకొంటున్నావు కుక్కవలె.

కటిక : ఓరీ బాపన తొత్తుకొడుకుల్లార నన్ను కుక్క అని చెప్పతున్నారా. నా కోలపెట్టి తిప్పతాను.

రంభ : నేవచ్చినానని దేవేంద్రునితో జెప్పర.

కటిక : మంచిది. చెప్పి వస్తున్నాను ఇక్కడ కూర్చో.

స్వామి నే వస్తిని.

వాకిటనుండక ఏల వస్తివిర ఛీ పోర.

కటిక : ఓసి నియ్యాళ్య దరిచేసి తొత్త నీ కోసరం నేను తిట్లు తింటిని. నీపేరు లెస్సగా జెప్పవే.

"స్వామీ శ్యైనాధిపతి వచ్చినాడు" (శచీపురందరము)

కటిక : భళా భళా భళా లెస్సావుండె. రాట్నం వచ్చె బండి తియ్యరా అన్నట్టువలెనుండె మేము స్వామియొక్క కటికలము. రెండో జామువేళ పూజకు హెచ్చరిక తెలిపేటందుకు వచ్చినాము. మా కోవెలలో వచ్చి యుండుకొని మమ్మే యడగవస్తివే.

,, తొత్తుకొడుకు — తానింతసేపు యే లంజ యింట్లో పడియుండి వచ్చినాడో. ఇప్పుడు వచ్చి అందర్నిన్నీ పార్వత్యం చేస్తున్నాడు. (సర్వాంగ సుందరీ విలాసము)

## (iii) చెంచుల మాటలు

ఒకడు : ఒరె ఒరె సిన్న వొరె వొరె లక్క వొరె వొరె పెద కాట వొరె వొరె సినకాట ఒరె ఒరె బుక్క ఒరె ఒరె నూక వొరె వొరె లకుమ. ఒరె ఒరె కుర్ల ఈ మొగసాల వాకిలి యెంత పొడవురా

మఱొకడు : ఒరే యెత్తిసిరక ఈ పొలాన యింతలేసి మానులు తిరుగుట్టి

వేఱొకడు : వొరే వొరే పోగా, పోగా ఎన్ని వంకరలురా

ఇంకొకడు : ఈ కొంకర వంకరలు యింత వారెవరైన యింత వసే తగిలిసుక యిగిలిసేతురా.

ఒకడు : వొరే వొరే ఆ మానిసి సెవులు తెల్లంగా అల్లాడుతా వుండేదేమిరా.

మఱొకడు : శిలల్ల వుప్పిపంటి గాదంటరా.

వేఱొకడు : వొరే వొరే సూడు. ఈ మానిసికి ఆకు మేపుతా వుండాట్టా.

ఇంకొకడు : ఇదా మాసి మొకమురా వీరు నడుముకు సుట్టుకున్న పొరుటాకులు వన్నెవై వున్నవిరా.

ఒకడు : ఒరే ఒరే మన మనుబోతుల నోటికి తాళ్లా తగుల తగిలిస్సి పైని యేమోయేసికొని కాళ్లసందున ఇరికిస్సికొని పొరెదరు సూడరా.

(విజయరాఘవ కల్యాణము)

## (iv) వేటకాండ్ర మాటలు - గ్రామ్యభాష

తిమ్మి : ఓరి యెట్టిగా ఓరి బొమ్మిగా రాండ్ర.

ఎట్టి : ఏలరా పిలుతావు.

తిమ్మి : ఒరే మీరు ముందర పొడిస్తిరే ఆ మృగాలు బారలేదురా. ఈ మృగం గొప్ప మృగంరా ఒరే అవు అవు అంటా నోరు తెరుస్తుందిరా ఒరే. మా యెలువుగా ఉందిరా అబ్బ తోడు. ఇట్లా మృగాలు యేడ జూడ లేదురా.

ఎట్టి : నీ ప్రాణభయం కూలిపోను నా మాటవిని ఎరువకపోరా.

తిమ్మి : నీయమ్మా జాతిమాలిన తొత్తుకొడక. నే యెరుస్తా నంట్రా అనేక కార్యాలంతా సేసినా నేనాడు.

ఎట్టి : ఎరువకురా.

తిమ్మి : ఓరీ నా మెడమీద తలవుందట్రా.

ఎట్టి : పెద్ద తుండువలెనే ఉందిరా ఒరే — దాన్నే పొడుస్తా చూడరా. (వల్లీ కల్యాణము)

# భాషావైవిధ్యము-తమిళము

తంజావూరి నాటకములలో భాషా వైవిధ్యమున్నది. తెలుగు నాటకములలో సాధారణముగా భాషా వైవిధ్యముండుట కాస్కారము లేదు. తెలుగు భాషయే యుండును.[1] తంజావూరి నాటకములం దట్లుండుటకు వీలులేదు.

నాటకములు తెలుగు భాషలో నున్నను నవి ప్రదర్శించు దేశము తమిళ దేశము. ఆ దేశ ప్రజల భాష తమిళభాష. తెలుగు వారు పాలకులైనను రాజభాష తెలుగేయైనను రాజకీయ సంబంధమైన సమస్త వ్యవహారములు తమిళ భాషలో జరుగును. ఆయా పాత్రలు గణకుడు (లెక్కలు వ్రాయువాడు) స్థానాపతి (కోవెల

1. దీని కపవాదము లున్నవి కన్యాశుల్క నాటకమున ఇంగ్లీషు భాష వాడబడినది. నాదెళ్ల పురుషోత్తమకవి నాటకములలో, హిందీభాష కన్పట్టును. ధర్మవరము గోపాలాచార్యులుగారి రామదాసు నాటకమున "ఉరుదూ" భాష ప్రయుక్తమైనది· ప్రతాపరుద్రీయమున తురకపదములు గలవు.

యధికారి) సేవకులు తమిళ భాషలోనే మాట్లాడుదురు. కావున నిందు తమిళము సంభాషణలలో నుండును.

## మణియకారన్ వచనం

''నల్లదు ఇవర్ కళ్ దాన్ వందాప్పోళీయాచ్చు దెతాయి క్కిళ.విమార్ వారామళ్ ఇరుక్కిర దెన్నయార్ పిళాయి కట్టియ క్కిర అందత్తాయిక్కిళయిమ్మై అళ్ళైత్తుకొండువారుం బిళాయి ''

## గి రి రా జ క వి

(సర్వాంగ సుందర విలాసము) నాయక రాజుల నాటకములలో తమిళ భాష ప్రయుక్తమైనది మహారాష్ట్ర రాజులు దాని నాద రించిరనుటకు పై యుదాహరణము.

## సంస్కృతము

ఉత్తమ పాత్రలకు కొన్ని నాటకములలో సంస్కృతము వాడ బడినది.

విప్రనారాయణుడు — హే తరుణి! కిమేతదత్రాగమనం. కిమావాసస్థానం, కం భవదీయ నామధేయం కాషాయాంశుకాది విశేషణ వేషధారణం కిం కారణం కిమే తాదృశ దీన తయా, మయా యాదవ శశాంక కింకరేణ తవకింకరణీయం తావకీనం కథయన్ వృత్తాంత మఖిలం.

దేవదేవి ఆకర్ణయ మేనిజనవరేణ్య, దేవదేవీ నామ్యహం దేవదానే లోభాది దుర్గుణ సమేతాం మాతరం విహాయ వైరాగ్యేణ సమాగత్య భవద్దివ్య సందర్శనం లబ్ధ్వా స్వామివాం చరణారవింద సేవాన కరోమి. కరుణా కటాక్ష వీక్షణేన పరిరక్షణం కర్తవ్యమ్.''

(విప్రనారాయణ చరిత్ర విజయరాఘవనాయకుడు)

## మహారాష్ట్ర భాష

మహారాష్ట్ర భాష నాటకములయం దచ్చటచ్చట ప్రయుక్త మైనది. శహాజీ, త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధము అనునాటకము సంస్కృతము, తెలుగు, మహారాష్ట్రము - అను మూడు భాషల యందు రచించినాడు.

## తంజావూరు-భాషాసమైక్యత

తంజావూరున భాషా సమైక్యత యెట్లుండెడిదో నిరూపిం చుటకు క్రీ. శ. 1787–98 మధ్య తంజావూరి నేలిన మహా రాష్ట్రరాజు అమరసింహుని కంకితముగా మాతృభూత కవిచే రచింపబడిన పారిజాతాపహరణ నాటకమునుండి యొక యుదాహరణ నిచ్చుచున్నాను.

సత్యభామ మాధవితో శ్రీకృష్ణుని తొలుత సంస్కృత మున పిలువమని చెప్పను.

## స ం స్కృ త ము

ఏహి ఏహి గోపాలకృష్ణ! పాహి పాహి॥ ఏహి

ఏహి ఏహి ...

మృదులాహిశయన కంసారి ఖగ జగ
న్మోహిత గోపస్త్రీ హిత రూపా. ఏహి.

కృష్ణుడు పలుకడు—అప్పుడు కన్నడభాషలో పిలువమనును.

## క న్న డ ము

బారోకృష్ణ బారోవొందు ముద్దుతారో కృష్ణతారో
బారో వొందు ముద్దుతారో మన్మథ వికార తీరతికే
శ్రీరమణా శ్రీ రుక్మిణియ బోదనెయ కేళివనమేలే
నెరవెణ నబేడ నీనేగతి ననగె ॥బారో॥

కృష్ణుడు పలుకడు. అప్పుడు తమిళమున పిలువమనును.

## త మి ళ ము

ఎన్నయ్యా! గోపాలా వుమక్కిత్తనై మోడి
యానుమ్మై నరిత్తదుం వెరుంనీడాచ్చుదో యివ్వళవుం
వోణాదో నన్నాద్మురు ఆణ్ణైయిట్టు
సిరియలామో ఎన్నయ్యా.

కష్ణుడు పలుకడు. మహారాష్ట్రములో పిలువమనును.

## మ హా రా ష్ట్ర భా ష

యాహే గోపాలా కరుణేనే యాతా
తుజ వినాగతి మజకోణ్హీ నహి
సుజనా మందారా॥ గోపాలా

కృష్ణుడు పలుకడు. అప్పుడు హిందీలో పిలువమనును.

## హి ం దీ

గలే గలే మిలేల ఆరే గోపాలా
తేరే మిహర్ తాన్‌గిమే శరణో తేర్
ఉతో వలో మేరే ఘుర్కు జల్ది ఆరే ॥గలే గలే॥
త్రిశిర గిరీస ప్రియసఖ సునోరే
పూలకే భాగమే ఖేలే ఆరే కృష్ణ ॥గలే గలే॥

దీనినిబట్టి క్రీ. శ. 1790 ప్రాంతముల తంజావూరిలో హిందీ భాష ప్రచారమున నున్నట్లు తెలియుచున్నది.

హిందీ భాష తంజావూరున విజయరాఘవనాయకుని కాలము నుండి (1633 – 1674) యున్నట్లుగా, ఆతని కాలములోనే రచింపబడిన కోనేటి దీక్షిత చంద్రుని ''విజయ రాఘవ కల్యాణము'' అను నాటకము నుండి తెలియుచున్నది. (పుట 76)

''వ: ఇవ్విధంబున వచ్చిన జవ్వనులా విజయ రాఘవ భూవల్లభునకు సలాము చేసిరట యెటువలెను.

ఖాభి—ఆట ద॥

సల్లాము సల్లామురే జవుమేరే ॥సల్లాము॥

సల్లాము విజయరాఘవ ...

సంగీతలోలారే, ఆహా మేరే సాహిత్య భోజరే
సంగర విజయురే జగదేక వీరురే ॥సల్లాము॥

సలాము శబ్దమును చేమకూర వేంకట కవి సారంగధరలో(1-32) ''వజీర్లు సలాములు చేసి నిలువ'' అని దీనిని వాడినాడు. కాని ''సల్లాము'' అనుటకు ప్రయోగములు లేవు. పై నాటకమున నున్నది.

పై రీతిగా తమిళనాడులో తెలుగువారి పరిపాలన, చారిత్రక ముగా సాంఘికముగా సంస్కృతి నుద్ధరించుటయే గాక, జాతీయ భాషా సమైక్యతను సాధించినది.

## ప్రాకృత భాషలు

తంజావూరి నాటకములలో దేశ భాషా వైవిధ్యముతోబాటు ప్రాకృత భాషా విశేషములను దెలుపుట యొక్క విశిష్ట లక్షణమని చెప్పవచ్చును.

రంగాజమ్మ తన మన్నారు దాస విలాసము గద్యలో ''అష్ట భాషా కవితా సర్వంకష మనీషా విశేష విశారద'' అని చెప్పుకొన్నది. అష్ట భాషలనగా అప్పకవీయము ననుసరించి ఆఱు విధములైన ప్రాకృతములు సంస్కృతము తెలుగు.

సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును బైశాచికయును
చూళికయు నపభ్రంశంబు సౌరిది నాంధ్ర
భాషయును నివి చను నష్ట భాషలనఁగ (1-80)

(1) సంస్కృతము (2) ప్రాకృతము (3) శౌరసేని (4) మాగధి (5) పైశాచి (6) చూళిక (7) అపభ్రంశము (8) ఆంధ్ర భాష.

అష్ట భాషలనగా పైని యప్పకవి వివరించినవే యన్న యభిప్రాయముతో నేను —

## అష్ట భాషలు

అను నొక వ్యాసమున వీనిని గూర్చి చర్చించితిని.
(చూ॰ 'భారతి' జూలై 1966)

కాని తంజావూరి నాటకములలోని పాకృత భాషలను బాగా పరిశీలించిన తరువాత నా యభిప్రాయము మార్చుకొనుచున్నాను.

## ప్రాకృత భాషా భేదములు తంజావూరి సంప్రదాయము

అష్ట విధములైన ప్రాకృతములనుగూర్చి గోవిందదీక్షితులు తమ సంగీత సుధలో నిట్లు చెప్పియున్నారు.

''గీర్వాణ వాక్ప్రాకృత శౌరసేనీ
భాండీర పైశాచిక చూళికాశ్చ
మాగధ్యప భ్రంశ ఇతిస్యురష్టౌ''[1]

## భాషా పరిజ్ఞాతృ కలాప్యమూషా

| గోవింద దీక్షితుడు | అప్పకవి |
|---|---|
| సంస్కృతము | సంస్కృతము |
| ప్రాకృతము | ప్రాకృతము |
| శౌరసేనీ | శౌరసేని |
| భాండీరము | మాగధి |
| పైశాచి | పైశాచి |
| చూళిక | చూళిక |
| మాగధి | అపభ్రంశము |
| అపభ్రంశము | ఆంధ్రభాష |

గోవింద దీక్షితుడు ప్రాకృత భాషాభేదముగా నిచ్చిన భాండీర భాష అప్పకవిలో లేదు. గోవింద దీక్షితుడు. 1577–1614లో అచ్యుతప్ప నాయకునివద్దనుండి రఘునాథ నాయకునికి మంత్రిగా నుండేవాడు. కాబట్టి 1656లో ఉన్న అప్పకవి కాతడు పూర్వుడు. అప్పకవియే గోవిందదీక్షితుని సంగీతసుధ చూచి, తన గ్రంథమున భాండీర భాషను దీసివేసి ఆంధ్రభాషనందు చేర్చినాడు.

గోవింద దీక్షితులు చెప్పిన ప్రాకృత భాషాభేదముల ననుస రించియే క్రీ॰ శ. 1630లో విజయరాఘవ నాయకుడు రఘునాథా భ్యుదయములోను, క్రీ. శ 1662లో రంగాజమ్మ మన్నారు దాస విలాసములోను, క్రీ. శ. 1669లో కోనేటి దీక్షితచంద్రుడు విజయ రాఘవకల్యాణములోను 8 విధముల ప్రాకృతములను వాడియున్నారు.

## రఘునాథాభ్యుదయము

ఇందు మధురకవి యిచ్చిన సమస్యలు సకల విద్యాసార్వ భౌముడు పూరించినవి కలవు.

1. శౌరసేని 2. మాగధి 3. పైశాచి 4. చూళికా పైశాచి 5. అపభ్రంశము 6. భాండీరభాష 7 ప్రాకృతము 8. సంస్కృతము.

పై అష్టవిధ ప్రాకృతములలోను సమస్యలిచ్చుట, వాని పూరణము జరుగుట యొక్క నూతన చారిత్రకాంశము తెలియు చున్నది.

సంస్కృత భాషలో సమస్యలున్నట్లు వానిని రాజాస్థానము లలో కవులు పూరించినట్లు మనకు నిదర్శనము లున్నది. తెలుగు నను నట్లు సమస్యలు పూరించినట్లు నిదర్శనములున్నవి కాని ప్రాకృత భాషలో సమస్యలనిట్లు పూరించినట్లు మనకు తెలియవచ్చుటలేదు.

ప్రాకృతభాషా చరిత్రకారులు దీనిని గుర్తింపవలసియున్నది.

---

1 ఆంధ్రవాగ్గేయకారుల చరిత్ర - బాలాంత్రపు రజనీకాంతరావు (1958) పుట 48.

## మన్నారుదాస విలాసము

సంస్కృతము, చూళిక, అపభ్రంశము, ప్రాకృతము, పైశాచి, శౌరసేని, మాగధి, దేశి అని అష్టవిధ ప్రాకృతములను వ్రాసినది. భాండీర భాషను 'దేశి' అనినది.

## విజయరాఘవ కల్యాణము

ఇందు—సంస్కృతము, చూళిక, అపభ్రంశము, ప్రాకృతము, పైశాచి, శౌరసేని, మాగధి, భాండీర భాషలుగలవు.

ఈ ప్రాకృతభాషా ప్రసక్తి మహారాష్ట్ర రాజుల నాటకములలో కానరాదు. మహారాష్ట్ర భాషయే ప్రాకృతము. కావున వారు ప్రత్యేకముగ ప్రాకృతములను తమ నాటకములో పేర్కొనలేదు.

శహాజీ తన త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధమును—సంస్కృతము, మహారాష్ట్రము, తెలుగు మూడు భాషలలోను వ్రాసినాడు. పారిజాతాపహరణ నాటకమున మహారాష్ట్ర భాషాప్రసక్తియున్నట్లు మన మీవఱకే తెలిసికొన్నాము.

మహారాష్ట్ర రాజులు తమ మాతృభాష మహారాష్ట్రమైనను, తెనుగు భాషా మాధుర్యమునకు ముగ్ధులై, తెలుగు భాషయందు నాటకములు రచించి యజరామర యశస్సు నార్జించి తెనుగు వాఙ్మయమున తమ పేరు స్థిరముగా నిలుపుకొన్నారు.

# హృదయాన్ని జయించే మరో హృదయం

### శ్రీ రామచంద్ర మౌళి

కౌగితం కాలిపోతూంటే
అక్షరాలు దహించుకుపోతూ ఆక్రందిస్తున్నట్టు
రాజకీయాల వరదల్లో యిక్కడి యువతరం మునిగి
బురదలో కూరుకుపోయిన గులాబీ పూవైపోయింది
తుపాకీ దెబ్బతిన్న కుందేలు
నెత్తురులో అద్దిన మల్లెపువ్వులా ఎంత వికారంగాఉంటుందో
... ... ...,
పరుగెత్తుతున్నాయి తగులబడుతున్న ఆలోచనలు
రోడ్లపైనుంచి
జైళ్ళలోకి
తుపాకీ గొట్టాల్లోకి...ఆకాశం గుండెల్లోని పిడుగుల్లోకి—
పసివాని గాలిపటాన్ని చింపావనుకో
నువ్వు ఏ ప్రపంచాన్ని వాని జేబులోపెట్టి నవ్వించగలవు
అంతే ...,

జీవితం ఓ సుదీర్ఘ రసానుభూతిగా నిన్ను జయిస్తున్నప్పుడు
నీలో ఏర్పడే తీయని రాగశూన్యాన్ని
మరో హృదయం తప్పితే యింకేదీ భర్తీ చేయలేదు.

గర్జిస్తున్న సముద్రం ఒడ్డున కూర్చుని నీ కళ్ళలోకి చూచుకో
నీలో ఎంత తీవ్ర పోరాటం కన్పిస్తుందో
వెంటనే నువ్వు తలెత్తుకుని సరుగుడు చెట్టులా నడుస్తూ
వస్తావు
అడవిలోనుంచి పరుగెత్తుతున్న రైలుపట్టాల ప్రక్కన
పడేసివున్న పలుగూ, పారా
యిక్కడి మహామనిషి ఎక్కుపెట్టబోయే అస్త్రాలై
నిరీక్షిస్తున్నాయి
గాలినీ, నీటినీ, యీ నేలనూ చీల్చుకుని
వచ్చే చేతులకోసం ఎదురు చూస్తున్నాయి ఆకలితోఉన్న
పనిముట్లు —

శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# వాగర్థాద్వైతము

'వాక్కు' 'అర్థము' అను శబ్దములు భిన్న శాస్త్రములందు భిన్నార్థములలో వాడబడినవి. 'భారతదేశంలో భాషాశాస్త్రం' అను వ్యాసమున (ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1978) ఈ వ్యాస కర్తచే ప్రాచీన మీమాంసక నైయాయిక ఆలంకారిక మతములు భిన్నప్రయోజనముల నాశించి భాషను గురించి పరిశీలించిన తీరు స్థూలముగ సమీక్షింప బడినది. ఈ వ్యాసమున 'వాక్కు'ను గురించి, 'అర్థము'తో దానికి గల అవినాభావితమును గురించి వివరింపబడును.

కాళిదాసు స్తుతి ఒకటి ప్రసిద్ధము 'వాగర్థా వివ సంపృక్తౌ' అని. మరియొకచో నితడే 'తమర్థ మివ భారత్యా..' అనియు వ్రాసినాడు. కవియగువాడు వాగర్థముల సంపృక్తతను భావించినచో దోషములేదు. శాస్త్రకారుడీ విషయమును నిరూపించుటకు మిక్కిలి శ్రమింపవలసియుండును. శ్రమ ఎందులకనగా లోకము బుద్ధికి సన్నిహితముగ నుండునది. కావ్యము హృదయ సామీప్యము గలది. లోకమునందలి మనుష్యుడును ఒక్కొకసారి హార్దికముగ ప్రవర్తించుట గలదు. కాని లోకమున ఎక్కువ వ్యవహారము బుద్ధితో చేయబడునది. ఈ దృష్టి ఎట్టిదనగా సాధ్యసాధన దృష్టి. అనగా ఏందున్నది. ఎందులకు—తినుటకు. కుళ్ళిపోయినది ఎందులకు ?- పారవేయుట కను సమాధానము సమాధానము కాదు. అచ్చట పురుగులు సాధనములుగ పండున కుళ్ళుటయను కార్యము నెం వేరినది. ఈ హేతుహేతుమద్భావమును భావించువారినే నైయాయికు లందురు — అనగా నైయాయికు లనబడువారు ఒక నాడుండి ఈనాడు లేరని తాత్పర్యము కాదు. ఎప్పుడును ఉన్నదే ఈ మానసిక దశ. ఇదొక వికల్పము. ఈ వికల్పముచే పభావితుడైనవానికి లోక మంతయు సాధ్యసాధన సంబంధమయముగ కనిపించును.

కాని కవిమాత్రమానాడును ఈనాడును ప్రయత్నితుడైకాని అప్రయత్నితుడైకాని భావమునకు - వాక్కుకు నడుమ అంతర్భావ్య సంబంధమునే భావించుచున్నాడు. స్థూలముగ వాగర్థముల అద్వైత మనగా నిది. అనగా కవి భావిత భావమునే వాగ్రూపమున లోకమున కందించుచున్నాడని తాత్పర్యము.

సంగీతకుడున్నాడు. భిన్నస్థాయులలో భిన్నరాగ ప్రస్తార ములు చేయును. మంద్రమున - స్వరితమున — తారమున భిన్న భావములను స్వరరూపములుగ మార్చును. ఇక్కడ మార్చుచున్న దెవరు ? కవి ప్రయత్నమెట్టిది ? ఇచ్చటి సంగీతకుని ప్రయత్న మెట్టిది ?

ఒక కళాకారుడున్నాడు. ఒక చిత్రము గీయును. నచ్చదు. చింపివేయును. మరల గీయును. మరల నచ్చదు. చింపివేయును. ఒక చిత్రము నచ్చినది. అది మనలో ఒకనికి అర్థములేని బొమ్మగా కనిపించును. కాని చిత్రకారు డందొక భావమును నిక్షేపించెనని ఎవరో ఒకరందురు. ఆ తర్వాత చూతుము. అరే! నిజమే! అనుకొందుము. ఆధునిక చిత్రకళలో ఈ సమస్య మరింతయున్నది.

కవి గాయక చిత్రకారులలో ఇరువురున్నారు. ఒకరు దేశకాల బద్ధుడగు బాహ్యవ్యక్తి. మరొకరు అతనిలోని కళాస్వరూపుడు — ఆంతర వ్యక్తి. ఆ ఆంతర వ్యక్తి వాగ్రూపమున భావము నందించు వాడు, స్వరములతో భావములు పలికించువాడు, కుంచెతో భావము లకు రూపు కట్టించువాడు.

వాగ్రూపమనగా నేమి ?

'నేను' అను పదమున్నది — అర్థమును గలదు — 'ఉత్తమ పురుషైకవచన సర్వనామ' మని. వ్యవహారమున 'నేను' గలదు. అర్థము భావింపబడుచున్నది. కావున అంతర్గతమగు ఆ భావముతో 'నేను' నిత్యసంబంధమును కల్గియున్నది. ఇది పాఠశాలలో చెప్పు పద్ధతి. మాములుగ వ్యవహారమునందలి వాక్యములలో నిట్టి దశ చాల స్వల్పము.

ఒకడు 'వర్షించుచున్న' దని చెప్పును. మరియొకడు విని 'అవును' అనును. ఒక నవలలో ఈ వాక్యములు రెండు పాత్రల నడుమగల అనంత భావములకు సూచకములు కావచ్చును. ఆ మరియొకడు వర్షము రాకపోవుటను చూచియు 'అవు'ననవచ్చును. ఆ మొదటివాడు వర్షము పడుచున్నదా—లేదా — అను విషయమును గమనింపకయే అట్లనవచ్చును. శ్రోత వినవలయుననికాని, వినినను నమ్మవలయునని కాని వక్త కుండనక్కరలేదు. శ్రోతయు వక్తృ వాక్యమునకు తన సమాధానముగాక, అవహేళనగా 'అవు' నన వచ్చును.

ఇంతవరకు చేయబడిన వాదమంతయు బౌద్ధికము. అనగా బుద్ధికి సంబంధించినది. మొదటిసారిగా నైయాయిక వైశేషిక మతముల ప్రభావము బౌద్ధములో అనంతముగ పడినది. ఫలితముగ శబ్దమర్థబోధకము కాదను 'అపోహ' సిద్ధాంతము బయలుదేరినది. వీరి దృష్టితో వ్యవహారమునందలి 'పద'మసత్యము. అర్థాపోహకము మాత్రమే.

తరువాతి శాంకరము దీనిని అంగీకరించుచు వ్యావహారిక సత్యత్వము నంగీకరింపక తప్పినది కాదు. అద్వైత సిద్ధాంతము దేశమున చిలువలుపలువలుగ ప్రాకిపోయిన దశలో భర్తృహరి 'వాక్యపదీయము', ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోకము', అభినవుల 'లోచనము', మహిముని 'వ్యక్తి వివేకము', కుంతకుని 'వక్రోక్తి

జీవితము' శబ్దార్థములనుగూర్చి విశిష్ట సిద్ధాంతములను ప్రతిపాదించినవి.

శ్రీ శంకరుని వైదికమత స్థాపమున అంతర్గతముగ వాగర్థముల అద్వైత భావనయున్నది. దేవీం వాచమజనయంత దేవాః ఇత్యాది ఋక్కులు వాక్కును దేవీ స్వరూపముగ చెప్పినవి. కాని ప్రాథమికముగ జ్ఞానవాదము చేసిన శంకరుడుకాని-అనుయాయుడు భర్తృహరికాని – 'వాక్కు'ను 'శబ్దబ్రహ్మ'ముగా తలపక తప్పినది కాదు. తప్పినది కాదనగా వారును వాక్తత్త్వమున గల దైవ్యంశను గుర్తించిరని అర్థము – చత్వారివాక్పరిమితాపదానీత్యాది నిర్దేశమును వారు వైఖరి–మధ్యమ – పశ్యంతులకు మాత్రము పరిమితము చేసి శబ్దబ్రహ్మముగా తురీయదశను భావించిరి. 'అనాది నిధనం బ్రహ్మ' – ఇత్యాది వాక్యపదీయకారికలు నిదర్శనములు. ఇచ్చట గల శబ్దార్థాద్వైతమునకు – శబ్దార్థములు భిన్నములు కావు – అనుట తాత్పర్యము.

శ్రీ శంకరులు దక్షిణామూర్తి స్తవమున 'నానాచ్ఛిద్ర ఘటోదరేత్యా'ది శ్లోకమున జ్ఞాన స్వరూపునిగా బ్రహ్మమును ఇంద్రియ ద్వారమున బహిర్గతుడగుచున్నవానిగా స్తుతించిరి. ఇంద్రియములు చిల్లులు. దేహము ఘటము. ఆత్మమహాదీపము— దీపకాంతి చిల్లుల ద్వారమున బహిర్గతమగుచున్నది. ఇది యౌగ నద్య ప్రకాశము· (ఘటప్రదీపన్యాయమని పరిభాష. గీతచిత్రములందర్థములేకున్నను బహిర్గతమగు భావమే అర్థస్థానమునందువది. కావ్యమునకు నిదే చెల్లును.)

శ్రీ శంకరుల కాశ్మీర ప్రయాణము అద్వైతమున మరియొక చిటారు కొమ్మనుచేరుట. అది కాశ్మీర శివాద్వయవాదములో ప్రభవించినది. శాక్తవాదమిది. శివుడును శక్తిమంతుడైనపుడే కదలిక. లేనిచో స్థాణువు. భారతీదేవి శంకరుని వెంబడి దక్షిణదిశగా పయనించినదన్న చారితకేతి వృత్తమునకు తాత్త్వికార్థమిది. నిర్గుణమగు జ్ఞానవాదము సగుణమైనది. శక్తి శక్తిమంతునితో అవినాభావితకల్గినదిగా గుర్తింపబడినది శ్రీ శంకరులే.

'శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం' అని దేవిని స్తుతింపక తప్పినదికాదు. వాగర్థముల అద్వైతమును గుర్తించుటకిది మొదలు. ఇచ్చటగల అద్వైతము – ఒక దానిని వదలి మరియొకటుండదనుట.

సోమానందునితో 'పరా' వాక్స్వరూపము గుర్తింపబడినది. పరా పశ్యంతులనుభవదశలో అభిన్నములు. వ్యక్తదశలో పరపశ్యంతిగా మారును. మధ్యమా మార్గమున వైఖరీ రూపమునందును, మరల స్ఫురణానుభవమున పరతో నైక్యమగును. ఇట్లు సర్వసృష్టిని వాఙ్మయమున భావించుటతో జగత్సృష్టికిని, వాగ్వ్యక్తికిని ఒక సమన్వయము కుదిరినది. దీనితో తార్కికవాదముల నోళ్ళు మూయబడినవి.

'వాక్కు' అనుటతోడనే వ్యక్తమయినదని అర్థము అనగా బహిర్గతమైనదని వ్యక్తమగునది మరియొక దానిని స్ఫురింప జేయును. 'ప్రచేతయతి' అని వాగ్ధర్మముగా ఋగ్వేదము చెప్పినది. 'స్ఫురణ' తర్క మిమాంసాదులకు లొంగునది కాదు. కేవలము దివ్యమగు లక్షణము. అనగా మానవ ప్రయత్నమిందు ఇసుమంతయు లేదు ప్రయత్నమనగా బుద్ధి'తో చేయబడునది. 'హృదయ'ము స్వాతంత్ర్యము కల్గినది. చిత్త వికల్పములు కర్మానుబద్ధములు. హృదయమాత్మ ప్రకాశనస్థానము. శివుడు 'హృదయస్థు'డని భగవద్గీత. కావ్యగాయన లేఖనములందలి భావస్ఫురణ హృదయమున కల్గు కదలిక. స్పందము. కావుననే కాశ్మీర శివాద్వయవాదు లందరును ప్రత్యభిజ్ఞ — స్పంద — సూత్రములనాధారముగ సర్వ ఆలంకారిక దర్శనము గావించిరి. అది ప్రత్యేకముగ పరిశీలింప దగినది.

మొదటిసారిగ శబ్దార్థములనడుమ గల ఈ వ్యక్తావ్యక్త సంబంధమును నిరూపించిన వాడు 'ఆనందవర్ధనుడు' తత్త్వాలోకమను గ్రంథమున ఆనందవర్ధనుడే లోకము విద్యామార్గమున నుండునదనియు; భర్తృహర్యాదులు ప్రతిపాదించిన శబ్దము 'బ్రహ్మ' మనువాదము కేవలము వ్యవహార మార్గోత్తీర్ణులయిన వారికే చెల్లుననియు — వ్యవహారమున శబ్దార్థముల అవినాభావిత నంగీకరింపక తప్పదనియు ప్రతిపాదించినాడు. ధ్వన్యాలోకమున నీ సూత్రముపైననే ఘటప్రదీపన్యాయము వాడుకొనబడినది. ఒక వాక్యమునకు వాచ్యార్థముతో పాటు అర్థాంతర ప్రతీతి ఉండుట గలదు. ఈ అర్థానంత్యము ఒకే వాక్యమున కెట్లు సాధ్యము ? ఎట్లనగా ఒకేయాత్మ పదార్థము భిన్న ఇంద్రియముల ద్వారమున బహిర్గతమగునట్లు.

ఈ అర్థాంతరములేమి చేయుచున్నవి ? ఒక అర్థము మరియొక దానితో కలిసి - అప్రధానమై - ప్రధానమై - ఒకేయర్థమును వ్యక్తీకరించుచున్నవి. అనగా 'కవి' యనబడు బాహ్యవ్యక్తి ఊహించెడి ప్రక్రియలు కావివి ఆంతరవ్యక్తికి 'స్ఫురణావేశము' చేత బయల్వెడలు శబ్దార్థములు ఏకైకమగు భావమును భిన్నరీతుల వ్యక్తీకరించుచున్నవని అర్థము.

ఇట్లు బయటపడిన శబ్దార్థముల తత్త్వము=భావము ఎవరికి గోచరమగును ? మరల ఆ స్ఫురణానుభవమున్న వానికి. వానినే సహృదయుడనిరి. ఇది యొక చిత్రమగు మాట — అట్టి హృదయము కలవాడనియు, (మంచి) హృదయము కలవాడని. అనగా ప్రపంచమునందలి ఇంతవైవిధ్యమున కొన్నిజాతులు (types) మాత్రమున్నవి—అనిఆంగ్లమానసిక తత్త్వవేత్తలు చెప్పుచున్నట్లు సత్త్వరజస్తమో విభాగము నాశ్రయించి భగవంతుడు కార్యాకార్యములనిర్దేశించినట్లు - నవరసములని- 8 సాత్త్వికభావములని, 33 వ్యభిచారులని - ఆలంకారికులు దర్శించినట్లు — హృదయ సామ్యము ప్రపంచమున నున్నది. ఇట్లే ఒక దేశపు కళను మరియొకరు - భాషా పరిధులను దాటి — మెచ్చుకొనుట సంభవించుచున్నది. ఈ విశ్వజనీన భావములన్నియు భిన్న శబ్దరూపముల నందుచున్నను - అందుటలో వైవిధ్యమున్నను ఆ శబ్దములతో 'యోగము' కల్గియున్నవి

శబ్దము స్మృతిరూప ప్రభావమును చూపుట — శబ్దము కొంత వినబడియు పూర్తిరూపము గ్రాహ్యమగుట — తన భాష యందు ప్రతియొకనికిని 'జాత్యన్న'మునందువలె రుచియుండుట — ఇవి శబ్దార్థనిత్యత్వమునకు బాహ్యములగు నిరూపణములు. పైన చూపిన సర్వ తాత్త్విక నిరూపణము.

తంత్రాలోకమునను, పరాత్రింశిక వివరణమునను అభినవులు వాక్చతుష్టయ నిరూపణము చేసిరి. అవి వేరుగ చూడ దగినవి. అన్నిటను గల ప్రధాన సూత్రము వాగ్రూపయగు భగవతి శబ్దార్థముల రూపమున లోకావతరణము సేయుచున్నదనుట. ఇట్లూహించుటలో సౌందర్యమున్నది. శబ్దార్థ దాంపత్యమున్నది. లోచనము 'సరస్వతీ స్వాదుతదర్థవస్తు'ఇత్యాది ధ్వన్యాలోక శ్లోకమునకు వ్యాఖ్యానముచేయుటలోను వ్యంజనాశక్తిని నిర్వచించుటలోను దీనినే పాటించినది.

మహిమభట్టు పరా వాఙ్మమస్కారము చేసిన వాడే. కాని 'బౌద్ధ' మను వాదము చేసెను. వ్యక్తి స్ఫురణకు సంబంధించి యుండగా—శబ్దార్థములను మరల సాధ్య సాధన దృష్టితో విమర్శించి తీవ్రముగ విమర్శింపబడెను. శబ్దమర్థగమకము - అర్థాంతరమును మీయమానము - తప్ప వ్యంగ్యముకాదని అతనివాదము.

ఒక కుంతకుడు ఆలంకారికులలో విలక్షణవాదము చేసిన వాడు. పరావాక్పరిస్పందరూపములే ఇతరములు. కావున శబ్దార్థములు వాచక వాచ్య సంబంధము కల్గినవని ఇతని వాదము — ఒకనాడు అభిధావాదులును ఇట్లే వాచ్య వాచక సంబంధవాదము చేసిరి. కాని కుంతకునికి మరియొక విలక్షణ సూత్రమున్నది. అది శబ్దార్థముల స్పర్ధ. వ్యవహారమున శబ్దమర్థముతోను, అర్థము శబ్దముతోను 'పోటీ' పడి భాషా గతి నిశ్చితమగుచున్నది- ఇది కావ్యమున — అనగా శబ్దార్థములు రెండును వాచకములే - అనిర్వాచ్యమగు రసమునకు.

పై వ్యాసమునందలి ప్రధానాంశములను సమీక్షించినచో శబ్దార్థాద్వైతము భిన్న దృష్టులతో భావింపబడినదనుట స్పష్టమగును. వ్యవహారమున శబ్దార్థములు సాధ్యసాధన భావము కల్గిన చోట్లున్నవి. కాని కావ్యమున మాత్రము భావమునకు శబ్దార్థములు వ్యక్తరూపములు పరస్పరమచట వాచ్యవాచకములయినను.

ఈ సంశ్లిష్టత నిట్లు గుర్తించవచ్చు

వాక్కు=(శబ్దము + అర్థము)

భావము (అర్థము)=రసము

పైని కాళిదాసుని శ్లోకమువగల 'అర్థ'ము (భావమను) విశేషార్థముకల్గినది. రసమని ఆలంకారికులందురు — వర్ణ పద వాక్యకావ్యములను — శబ్దముగను (వాక్కుగను); అర్థ—భావ రసములను అర్థముగను వివక్షించుట వారి మర్యాద. వాగర్థాద్వైతము నెరుగుటకిది అవసరము కవులీ మార్గ ప్రవర్తకులు.

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

# బాలసాహిత్యం

బాలవాక్యం బ్రహ్మవాక్యమనీ, బాలుర దీవెనలు బ్రహ్మదీవెనలనీ మన విశ్వాసం. పిల్లలు పట్టి అమాయకులు. వారికి కల్లా కపటమూ తెలియవు. ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతూ ఆటపాటలలో కాలం గడపడం వారికి నచ్చిన పని. అశుభమూ శుభమూ తెలియని ఆ వయస్సులో వారు ఆశించేది కూడా అదే. చీకు చింతలు, మంచి సెబ్బరలు, కష్టసుఖాలు—ఇవేవీ బాలబాలికలను బాధించవు. నిజానికి మానవ జీవితంలో బాల్యం మరిచిపోదామన్నా మరపునకు రాని మధురఘట్టం. అందువల్లనే జవసత్వాలన్నీ ఉడిగిపోయి, జీవిత పరిసమాప్తి యిక నేడో రేపో అన్నట్లుగా ఉండే ముసలితనంలో సైతం బాల్యమూ తత్సంబంధమైన మధుర స్మృతులూ స్ఫురణకు వచ్చేసరికల్లా, ఆ మూడుకాళ్ల ముసలికి ఎక్కడలేని ఉత్సాహమూ కలుగుతుంది. అతని మనస్సు విద్యుత్తులా పని చేస్తుంది. ఎంతో సౌఖ్యావహంగా బాల్యం గడిచిపోయిందనీ, ఆ తరువాతి జీవితం తద్భిన్నమనీ తలుచుకుని తలుచుకుని కంటతడి పెడతాడు.

నిత్యాగ్నిహోత్రుడూ నానారుచిరార్థసూక్తినిధీ అయిన నన్నయభట్టువంటి మహాకవి కూడా పిల్లల తొక్కు పలుకులలోని తీపిని విస్మరించలేకపోయాడు. ఆయన వేదజడుడు కాదు; లోకజ్ఞుడు. ఏకచక్రపురంలో జరిగిన ఉదంతాన్ని నన్నయ అభివర్ణించిన తీరుని కనుక పరిశీలిస్తే, ఈ విషయం సుస్పష్టమవుతుంది.

> 'బాలుడొక్కండు కొండొకకోల సేత
> బట్టికొని యేను రక్కసు గిట్టి చంపి
> చులుకగా వత్తు, మీ రేడ్వ వలవ దనుచు
> గలయ నూరార్చె దన తొక్కుబలుకు లొప్ప.'

బకాసురుడికి ఆహారం పంపేవంతు ఆనాడు ఒక బ్రాహ్మణ కుటుంబానికి వచ్చింది. ఆ విప్రుని యింట్లోనే పాండవులు తల దాచుకున్నారు. ఎవరో ఒకరు ఆహారం తీసుకుని అసురునివద్దకు వెళ్లి తీరాలి. ఆహార పదార్థాలతోపాటు అవి తెచ్చిన వ్యక్తిని కూడా తన పొట్టను పెట్టుకుంటాడు బకాసురుడు. అది అతని దినచర్య. నేను వెడతానంటే నేను వెడతానంటూ ఆ విప్రదంపతులు ఆత్మ పరిత్యాగానికి సిద్ధమైనారు. అలా దుఃఖ జలధిలో మునిగివున్న తలిదండ్రులవద్దకు వారి కుమారరత్నం — చిన్నపిల్లవాడు—వచ్చాడు. అతని చేతిలో ఒక చిన్నకర్ర; వచ్చినవాడు బొమ్మలా నిలబడ్డాడా? లేదు. వచ్చీరాని మాటలతో 'నేనా రాక్షసుణ్ణి అనాయాసంగా చంపి యింటికి తిరిగి వస్తాను. మీరేమీ యేడవకండి' అని ఓదార్చాడు. ఆ తొక్కు పలుకులు వినేసరికి అంత దుఃఖంలోనూ ఉన్న ఆ తలిదండ్రులు ఊరట చెందారు!

దైవస్వరూపులైన బాలబాలికలు కలకల నవ్వినా ముద్దే; వలవల ఏడ్చినా ముద్దే. వచ్చీ రాని పలుకులు ఒలకబోసినా ముద్దే; వచ్చీరాని నడకలు నడిచినా ముద్దే. ఒక్కమాటలో చెప్పవలెనంటే, పిల్లలు ఏమిచేసినా ముద్దు ముద్దుగానే ఉంటుంది. ఇందుకు కారణం వారి మాటలలోనూ, చేతలలోనూ సహజత్వం, అప్రయత్న మాధుర్యం నెలకొనడమే. కంచుకాగడాలతో వెతికినా కృత్రిమత్వం కనిపించదు.

ఈ సందర్భంలో పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో చిత్రించిన గొడగూచిని స్మరించుకోవడం సముచితం. ఆమె ఒక బాలిక. తండ్రి ఆజ్ఞను తలదాల్చి ఆమె పరమశివునికి భక్తిపూర్వకంగా పాలు సమర్పించింది. ఆమె ప్రదర్శించిన 'నిశ్చల ముగ్ధభావ సంపద' మాటల కందనిది. ఆ బాల ముగ్ధత్వానికి పరమశివుడు సంతోషించడమేకాక, ఆమె కోరికను కూడా నెరవేర్చాడు. గొడగూచి కథ ద్వారా సోమనాథుడు బాలబాలికలలో సహజంగా కానవచ్చే ముగ్ధభావమును మధుర మోహనంగా తెలియజేశాడు.

తాత్త్వికుడూ, తమిళ వేదకర్త అయిన తిరువళ్లువర్ కూడా పిల్లలను గురించి చక్కని విషయాలెన్నో వ్యక్తం చేశాడు.

> 'చిట్టి చేతులతోడ చిటిపాప కలుపు
> పట్టెడన్నమె సుధాప్రాయమై తనుపు'

అని ఆయన పేర్కొన్నాడు.

(శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి తెలుగు సేత)

అన్ని భాగ్యములలోనూ సత్సంతాన భాగ్యమే మహాభాగ్యం; సత్సంతానం కన్నవారిని ఏడు జన్మలలో చేసిన పాపాలు సైతం స్పృశించవు. కన్న సంతానాన్ని కనక తాకితే చాలు తలిదండ్రులకు అనిర్వచనీయమైన సంతోషం కలుగుతుంది. పిల్లల మాటలు పెద్దలకు వీనులవిందు చేస్తాయి. వేణు వీణాస్వనములు మధురము అనే వారు తమ పిల్లల తొక్కు పలుకులు విననివారై వుంటారు—అని కూడా తిరువళ్లువర్ పేర్కొన్నాడు.

కనుక బాలబాలికలను దైవ స్వరూపులనడంలోనూ, వారి మాటలు బ్రహ్మవాక్కులని చెప్పడంలోనూ ఆశ్చర్యంలేదు. కాని ఆశ్చర్యం! బాలుడు పెరిగి పెద్దవాడై మానవుడవుతున్నాడు. దుర దృష్టవశాత్తు కొందరిలో అంతర్గతమైవున్న దైవాంశ కాలక్రమాన అట్టడుగున పడిపోయి రాక్షసాంశ పెరుగుతోంది. అప్పుడు మానవుడు దానవుడుగా రూపు దాలుస్తున్నాడు. సాటి మానవుడికే భయంకరుడుగా తోచి, తుదకు లోక కంటకుడవుతున్నాడు. అతని పలుకులలో తలపులలో చేతలలో — అన్నిటా — రాక్షసాంశ తిష్ఠ వేస్తోంది. ఈ రాక్షసాంశకల మానవుడు కూడా చిన్నప్పుడు మొలక నవ్వులు ఒలకబోసినవాడే; తొక్కు పలుకులు పలికినవాడే. అయితే

ఈ భయంకరమైన మార్పుకి కారణమేమిటి? ఇదమిత్థమని చెప్పలేము. కాని కొందరు పేర్కొనేలా వారిలో సంస్కారం లోపించవచ్చు; మరొకటి లేకపోవచ్చు. కారణం ఏదయినా, సకల చరాచర సృష్టిలోనూ ఉత్తముడైన మానవుడు, జ్ఞాన విశిష్టుడైన మానవుడు దానవాకృతి దాల్చకూడదు. ఈ దానవాంశను నిరోధించేందుకు కొంతవరకు ఉత్తమ సాహిత్యం తోడ్పడగలదని చెప్పవచ్చు. ఈ దృష్టితో చూసినప్పుడు, బాల సాహిత్యానికిగల వైశిష్ట్యం విదితమవుతుంది. ఉత్తమ బాల సాహిత్యం ప్రచుర ప్రచారంలోకి రావలసిన అవసరం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

అయితే ఏది ఉత్తమ బాల సాహిత్యం? ఇది చిక్కు ప్రశ్న వంటిది.

పిల్లలకోసం ఉద్దేశించబడిన రచనలు సులభ సుందరమైన భాషలో ఉండాలనడం చర్విత చర్వణం. భాషా శైలీ పిల్లల్ని ఆకర్షించేలా ఉండాలి· అప్పుడే వారు ఆ రచనను ఆసక్తితో చదివి అర్థం చేసుకోగలుగుతారు. అయితే పిల్లలమనస్తత్వాన్ని కుణ్ణంగా అవగాహన చేసుకున్న రచయితే ఉత్తమ సాహిత్య సృష్టి చెయ్యగలడు. పిల్లల అభిరుచులూ, అభిమాన విషయాలూ మొదలైనవాటిని అర్థం చేసుకోవాలి· ఇందుకు ఊహాగానం ఏ మాత్రమూ పనికిరాదు. పిల్లలకు ఫలానా విషయాలు నచ్చుతాయని మనం సర్వసామాన్యంగా అనుకున్నా, ఈ విషయమై వ్యాప్తమైన పరిశీలన జరగాలి. మనం అనుకునేటట్లుగా, ఈనాటి బాలబాలికలు మరీ అమాయకులు కారు. చలన చిత్రాలు, టి. వి. కార్యక్రమాలు, పత్రికలు — మొదలైనవాటి ద్వారా వారు ఎన్నో విషయాలు తెలుసుకో గలుగుతున్నారు. కనుక పేదరాసి పెద్దమ్మ కథలతో నేటి బాలల్ని మనం సంతృప్తి పరచలేము. ఆ కోవకుచెందిన కథలే బాల సాహిత్యం అని భావించినా, అది పొరపాటవుతుంది. అయితే అటువంటి కథలకు కూడా బాల సాహిత్యంలో చోటు లేకపోలేదు.

బాలల మనస్తత్వాన్నీ, వారి అభిరుచుల్నీ చక్కగా పరిశీలించి, వారికి అర్థమయ్యే భాషలో, ఆసక్తిగొలిపే విధంగా కనక రచన సాగించినట్లయితే అది ఉత్తమ బాల సాహిత్యం కాగలదని నా అభిప్రాయం. వింతగొలిపే కథలతోపాటు విజ్ఞాన శాస్త్ర విషయాలను కూడా రచయితలు పిల్లలకి తెలియజేయాలి. శాస్త్ర శాస్త్రేతరాలకు మధ్యగల అంతరం నానాటికీ తగ్గుముఖం పడుతున్నది. కాగా బాలల భాష, బాలల మనస్తత్వం మొదలైనవాటిని గురించి పరిశీలన జరగాలి. అప్పుడే నేటి బాల బాలికల అభిరుచులూ, సమస్యలూ మొదలైనవి తెలియగలవు. అంతర్జాతీయ బాలల సంవత్సరమైన యీ 1979 ఉత్తమ బాలసాహిత్య సృష్టికి బహుధా తోడ్పడగలదని ఆశించవచ్చు.

శ్రీ కలువకొలను సదానంద

# రంగు రంగుల చీకటి

కాకా హోటల్ పెరటి గోడమీద వాలిన కాకి, కత్తులు సానబెడు తున్నట్లుగా కుత్తుక చించుకుంటోంది, బెత్తెడు కడుపు కోసం !

బస్టాండు ముందర కొళాయి దగ్గర నిలబడి ఇటుక రాతి పొడితో పళ్ళు తోముకుంటూ, రాత్రికి రాత్రి గోడమీద వెలసిన సినిమా పోస్టరుకేసి చూస్తున్నాడు రాములు.

గర్భస్థ శిశువు మాట్లాడుతున్నట్లుగా, కంటికి కనిపించని కంఠమేదో దూరంగా ఎక్కడో మేడల చాటునుంచీ గాలి రథాన్ని అధిరోహించి నేలనూ నింగినీ ముట్టడిస్తోంది... "నేడే ప్రారంభం! రోజూ మూడు ఆటలు. మేట్నీ మధ్యాహ్నం రెండున్నర గంటలకు! మొదటి ఆట సాయంకాలం ఆరున్నరకు! రెండవ ఆట రాత్రి పది గంటలకు! ..."

రాములు చూపులు వాల్‌పోస్టరు మీదనే వేలాడుతున్నాయి, మేకులు దిగవేసినట్లు! తెలుగు లిపిలోని తక్కిన అక్షరాలన్నీ అసూయపడేటంత పెద్ద సైజులో సినిమాపేరు! వేశ్యావాటికలో అడుగిడిన రాచబిడ్డను గుమ్మంలో నిలవేసి, అమ్మాయి అందచందాలను ఏకరువుపెట్టే వేశ్యమాతలా, మరో మాట కూడా చెబుతోంది పోస్టర్ : 'కలర్ !'

తెరమీద రంగులెలా వుంటాయో ఊహించుకుంటూ తల పైకెత్తాడు రాములు. బస్టాండుకు తూర్పున, తాటాకు పాకలకు అవతల, నీలికొండలకు బారెడెత్తున నిలిచి, సూర్యుడు రంగులు కుమ్మరిస్తున్నాడు. కుంచెలు చేతబట్టుకున్న నీరెండ సృష్టి సౌందర్యాన్ని ఆవిష్కరింపజేస్తున్నది. ఆ కాంతి పుంజానికీ ఈ కంటి పాపకూ నడుమ అలౌకిక సౌందర్య సేతువులా — నింగీ నేలా, చెట్టూచేమా, కొళాయి నీళ్ల దూకుడులోంచి ఎగిరిపడుతూన్న తుంపర, బస్సుకోసం వేచివున్న పడుచుదాని తలలో పువ్వులు, పెదవులపైన నవ్వులు, బంగారం కరిగించి పులుముకున్నట్లున్న నుదుట కుంకుమ బొట్టు, ఉల్లీ ఉల్లీ చీరలోంచి కనిపిస్తోన్న పావడ, పావడ కుచ్చిళ్ళ దిగువ దాగుడుమూత లాడుతున్న పాదాలు...ఎన్నెన్ని చిత్రవర్ణాలు! వర్ణ సంకరంలో ఎన్నెన్ని కొత్త రంగులు! ఈ రంగులన్నిటికీ ముస్తాబు చేస్తే ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే, సినిమా తెరమీద చూడాల్సిందే !

నోరు పుక్కిలించుకుని, భుజం మీది చింకి తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ కాకా హోటల్‌లోకి ప్రవేశించబోయిన రాములు, ఆగి, వెనక్కి తిరిగి చూశాడు. లౌడ్‌స్పీకర్లను, పోస్టర్లను అంటించిన తడికలను నెత్తికెత్తుకుని, ఒంటినిండా మామిడాకుల్నీ, రంగు తోరణాల్నీ సింగారించుకున్న రెండెడ్ల బండి కొత్త సినిమాను గురించిన వ్యాఖ్యానంతో బస్టాండు ముందరికి వచ్చి ఆగింది, రాజుగారి పడకటింట్లో నుంచి జన బాహుళ్యంలోకి వొచ్చేసిన ఆస్థాన నర్తకిలా !

హోటల్‌లోకి వెళ్ళి, రోడ్డుమీద ఆగిన సినిమాబండికి అభిముఖంగా బెంచీమీద కూర్చుని, టీ పట్టుకురమ్మన్నాడు రాములు.

అది, సంతరోజు !

తిరుపతి బ్రహ్మోత్సవాలుగానీ, పూరీ జగన్నాథ రథోత్సవంగానీ రంగంపేటలో జరగవు. అయితే రంగంపేట విశ్వరూపం దాల్చటాన్ని సంతరోజే చూడగలం. గాజు పట్టకంలోంచి చొచ్చుకుపోయిన ధవళకాంతి వర్ణమాలగా రూపాంతరం పొందినట్లు, సంతరోజున రంగంపేట రంగ రంగ వైభోగంగా దర్శనమిస్తుంది. సినిమా బండి మామూలు కంటే మరికొంత ఎక్కువ మోతాదులో సింగారించుకుని, పదహారు వేలమంది గోపికల్ని చాటు చేసుకుని కృష్ణుడితో దాగుడుమూతలాడే రాధలా, సంతగోలలో అడుగడుగునా అడ్డుపడుతూ ఉంటుంది.

రాముల్ని రంగంపేటలో అన్నిటికంటే ఎక్కువగా ఆకర్షించింది, సంత. సంత కంటే ఎక్కువగా ఆకర్షించింది, సినిమాబండి. సినిమాబండి కంటే మిక్కుటంగా ఆకర్షించింది కూడా ఒకటుంది. చారల పైజామా, చారలచొక్కా తొడుక్కున్న వాడొకడు ఆబండిలో కాస్త వెనకగాకూర్చుని, చేతిలో మైకుపట్టుకుని, ఊళ్ళోఆడుతున్న సినిమానుగురించి చెప్పవలసినవన్నీ ఏకరువు పెడుతుంటాడు. సినిమా చూడటం అన్న వ్యసనానికిలోనై సాక్షాత్తూ సుమతీశతకకారుడే అలా వచ్చి కూర్చుని జనావళికి సందేశం యిస్తున్నాడా అనిపిస్తుంది. వాడి వ్యాఖ్యానమూ, జనాదరణ పొందిన సినిమా పాటలూ ఒకదాని తర్వాత ఒకటి వినబడుతుంటాయి. వాడి వ్యాఖ్యానంకంటే సినిమా పాట బాగుందో, సినిమా పాటకంటే వాడి వ్యాఖ్యానం బాగుందో చెప్పటం అంత తేలికైన పనేమీకాదు. రాముల్ని రంగంపేటలో అన్నిటికంటే మిన్నగా ఆకర్షించింది, ఆ చారలచొక్కా వాడి అనౌన్స్‌మెంటే !

రాములు టీ తాగి, తనవద్దవున్న ఒకే ఒక పావలాబిళ్ళను హోటల్ యజమానికిచ్చి, వాడు తిరిగి యిచ్చిన పదిపైసల నాణెం జేబులో వేసుకుని, రోడ్డుమీదికి వచ్చాడు. కథానాయకుడు నటించిన రెండువందలపై చిలుకు చిత్రాల పేర్లలోంచి చాలానాటివి కథానాయకుడికి విశేషణాలుగా వాడుకుంటూ, అతని బిరుదాలు వల్లిస్తూ, చూచితీరవలసిన చిత్రం అంటూ సెలవిస్తున్నాడు, చారల చొక్కావాడు. వాడి మాటల వేగానికి ఉపమానంలేదు. వ్యాసుడు చెబుతుంటే మహాభారతాన్ని గరగరా రాసెయ్యగలిగిన గణపతి, చారల చొక్కావాడి దగ్గర బిక్కమొహం వెయ్యాల్సిందే !

ఎక్స్‌ప్రెస్ బస్సు ఒకటి స్టాండుముందర ఆగుతుండటం చూసి, అర్జునుడి బాణంపోటుకు పైకి ఉబికిన పాతాళ జలధారలా, ఉన్నచోటునుంచి ఎగిరివెళ్ళి బస్సు దగ్గర వాలాడు రాములు. మ్యూజికల్ ఛేర్స్ పందెంలో ఏదో ఒక కుర్చీని దొరకబుచ్చుకోవాలన్న పట్టుదలను కళ్ళల్లో నింపుకుని పరుగెత్తే ఆటగత్తెలా, వాడు బస్సుచుట్టూ గింగుర్లు తిరిగాడు: "కూలీ సార్, కూలీ కూలీ! కూలీ బాబూ కూలీ!"

విసిరిన బంతి గోడకు తగిలి తిరిగి వచ్చినంత వ్యవధిలోనే, బస్సు ఆగింది; మళ్ళీ ముందుకు వెళ్ళిపోయింది. బస్సులోంచి దిగినవాళ్ళు యిద్దరే! ఒకడు ఉత్తచేతులతో దిగాడు. మరొకడు, వీధి నాటకంలో చేతిరుమాలు వూపుకుంటూ రంగంమీదికి వచ్చే రాజపాత్రధారిలా, చిన్న బ్రీఫ్‌కేస్‌ను తేలికగా వూపుకుంటూ నడిచిపోయాడు.

రాములు పాలిటి వర్తమానకాలం, మచ్చుకు ఒక్క వాహనమైనా లేని బస్టాండులా ఖాళీగావుంది. ఏ బస్సు ఏ వేళకు వస్తుందో తెలియని అనిశ్చిత స్థితిలాంటిది వాడి భవిష్యత్తు. ఇక వాడి ఇరవై ఏళ్ళ గతంతో ఈ కథకు సంబంధంలేదు. రోడ్డుపడ్డ చిత్తుకాగితానికి స్థిరశ్చలత వుండదు. అది గాలివీచినవేపు కొట్టుకుపోతూ వుంటుంది. ఏ రాయో రప్పో అడ్డు తగిలినప్పుడు, అక్కడ కొంతసేపు ఆగుతుంది. మళ్ళీ ఏ గాలివాటుకో అక్కణ్ణుంచి కదిలి, మరెక్కడికో ప్రయాణమౌతుంది. చిత్తుకాగితంలాంటి రాములు రంగంపేటకు వచ్చి పదిరోజులైంది.

వాడి రెక్కలకష్టంమీద ఆధారపడి వుంటున్నవాళ్ళు ఎవరూ లేరు, వాడి కడుపుతప్ప! ప్రపంచంలో, తిండికీ ప్రాణానికీ వున్న బాంధవ్యం తరవాతనే, మరి ఏ యితర బాంధవ్యమైనా! తిండి లేకపోతే ప్రాణం నిలవదు; ప్రాణం లేకపోతే తిండికి విలువలేదు. ఒంటిమీద అంతో యింతో కండలున్నాయి గనుక, రంగంపేటలో తిండి సంపాదించుకోవటం పెద్ద సమస్యగా కనిపించలేదు రాములుకు. రంగంపేటలో రైల్వేప్లాట్‌ఫారమూ, బస్సు షెల్టరూ ఉన్నవి - వాడు పడుకుని నిద్రపోవటంకోసమే!

షార్ట్‌రూట్ బస్సులు రెండుమూడు వచ్చి వెళ్ళాయి. హోటళ్ళలో కాఫీ తాగి వెళదామని వచ్చినట్టున్నారు ప్రయాణీకులు! కాకపోతే, కూలీ ఎందుకు దొరకదు?

కాళ్ళీడ్చుకుంటూ బజార్న పడ్డాడు రాములు. దుకాణాలన్నీ ఆకలితో నోళ్ళు తెరిచేశాయి. బస్టాండునుంచీ, రైల్వేస్టేషనుకు మూడు ఫర్లాంగులదూరం వుంటుంది. అంతదూరమూ, కుడి ఎడమలలోవున్న గోడలన్నీ ఇటుకతోనూ సున్నంతోనూ కట్టినట్లు కాక, సినిమా పోస్టర్లతోనే కట్టినట్లున్నాయి.

రాములు రైల్వే ఓవర్‌బ్రిడ్జి దగ్గర ఆగాడు. బ్రిడ్జిఎదుట ఎత్తైన కర్రలు పాతి, వాటి చివర సినిమా హీరోను కట్టేశారు. మెడలో పెద్ద పూలదండ వేలాడుతోంది, చచ్చిన కొండచిలువలా! ఆ బరువుకు హీరో మెడకాస్త పక్కకు ఒరిగిపోయింది.

పక్కనేవున్న పూలదుకాణం, అప్పుడే తాడు తెంచేసిన పూబోణి ఒకతె "పావలా పువ్వులియ్యి కిష్టయ్యా!" అని అడుగుతుంటే, "పువ్వుల కోసమే మనిషిని పంపాను. ఉన్న పువ్వులన్నీ అభిమాన సంఘం వాళ్ళు పట్టుకుపోయారు," అంటున్నాడు దుకాణంవాడు.

తాపసి వెంటబడే ఊర్వశిలా, రాముల్ని వెతుక్కుంటూ వొచ్చేసింది సినిమాబండి. మూడురోడ్ల కూడలిలో నిలబడి, సమ్మోహనాస్త్రాలు ప్రయోగిస్తోంది. కరపత్రాలు కురుస్తుంటే, జనం వాటిని బిస్కత్తుల్లాగా అందుకుంటున్నారు. చారల చొక్కావాడు వీనుల విందుగొలిపే కంఠంతో, కథలోని ముఖ్య సన్నివేశాల్ని వివరిస్తూ, నాయకీ నాయకుల యుగళగీతాల్లోని పల్లవి పాడుతూ, ఏఏ పాటలు ఏఏ సుందర ప్రదేశాల్లో చిత్రించబడ్డాయో చెబుతూ జనానికి మత్తెక్కిస్తున్నాడు.

బండి మళ్ళీ కదిలింది. చుట్టుపక్కల పల్లెలవెంట తిరిగి రావటానికి కాబోలు, ఊరుదాటి వెళ్ళిపోయింది. పల్లెటూళ్ళవాళ్ళు ఒకవేళ సంతకు రావటానికి బద్ధకిస్తే, సినిమాకోసమైనా రంగంపేటకు వస్తారని థియేటరు వాళ్ళ అంచనా!

రాములు మళ్ళీ బస్టాండుకేసి నడిచాడు. నడుస్తూ నడుస్తూ, మేట్నీకి వెళ్ళి తీరాలనుకున్నాడు. కథానాయిక సొంపుసోయగాలు, ఆమెతో కథానాయకుడి పచ్చి సరసాలు, పదహారేళ్ళ లేత కండలతో విందుభోజనం వడ్డించే క్లబ్ డ్యాన్సు, హాస్యనటులు గురి తప్పకుండా వదిలే బూతుబాణాలు — వీటినంతా అతి చౌకధరకే అందుకోవచ్చు. అతి సామాన్యుడైనా సరే, ప్రేక్షకుడు ఆయా రసవత్తర సన్నివేశాలలో తెరమీది పాత్రలతో తాదాత్మ్యం చెంది, ఇంద్రియ సుఖంలోని ఉచ్చస్థితిని సిద్ధింప చేసుకోవచ్చు. టిక్కెట్లు మామూలే - బెంచీ యాభై అయిదు పైసలు. సెకండ్ క్లాస్ రూపాయీ ఒకపైసా, ఫస్ట్‌క్లాస్ రూపాయీ ఇరవై ఎనిమిది పైసలు!

జేబులో వున్నది పదిపైసలే! క్రితంరోజు, లారీలోనుంచి సిమెంటు బస్తాలు దింపినందుకు ముట్టిన కూలిడబ్బులతో కలిపి మొత్తం నాలుగు రూపాయలు సంపాదించాడు. కానీ, రాత్రి దీపస్తంభం కింద కూర్చుని పులీమేకా ఆట ఆడి ఆ డబ్బు పోగొట్టుకున్నాడు. మధ్యాహ్నానికల్లా ఒకటో అరో సంపాదించలేకపోతానా అన్న ధీమా మాత్రమే యిప్పుడు వాడికి మిగిలింది.

అదేమి ఖర్మమో, ఆ రోజు డబ్బు కళ్ళజూడటమన్నది — స్వర్గలోకానికి వెళ్ళి సౌగంధిక పుష్పాన్ని సంపాదించటమంత కష్టమైపోయింది రాములుకు. స్టాండులోకి బస్సు రాగానే, తనలాంటి కూలీలంతా కాట్లకుక్కలై పోతున్నారు. మధ్యాహ్నం రంగంపేట మీదుగా వెళ్ళే రైళ్ళు రెండున్నాయి కానీ, లైసెన్సు కూలీలు తనను స్టేషనులోకి రానివ్వరు. బజార్లవెంట, మండీల వెంట రెండుసార్లు తిరిగాడు. గిరాకీ తగల్లేదు. వాచీ కట్టుకున్నవాడెవడైనా కంటబడితే చాలు, టైం అడిగి తెలుసుకుంటున్నాడు రాములు. నిమిషాలూ గంటలూ లెక్కబెట్టుకుంటున్నాడు. అయితే కాలం వాడిమీద జాలి చూపనూలేదు, వాడికోసం ఆగనూలేదు.

ఆ సమయంలో మగవాడి స్పర్శ ఎరుగని ఏ కన్నెపిల్లయినా

నీ పాత వంట్లాం ఉతికిపెట్టమంటావా, నీ చిరుగుల చొక్కా కుట్టిపెట్టమంటావా, నీ జీబురుతలకు నూనె రాసి, పేలు కుక్క మంటావా?' అని అడిగితే, 'నీ దగ్గిర అర్ధరూపాయి వుంటే యివ్వు!' అని మాత్రమే కోరుకుంటాడు రాములు.

ఏ కన్నెపిల్లా వాణ్ణి అలా అడగనూలేదు, ఏ దేవతా దిగి రానూలేదు. కానీ, మధ్యాహ్నం రెండు గంటలయ్యేసరికి వాడి కోరిక మాత్రం నెరవేరింది. బస్సుటాపుమీదినుంచి బంగాళా దుంపల మూటల్ని కిందికి దించి, పేచీపెట్టుకుని అర్ధరూపాయి సంపాదించుకున్నాడు. కనకవర్షంలో తడిసినంత సంబరంతో, సినిమాటాకీసు వైపు బయలుదేరాడు.

బస్టాండు పక్కనే వున్న సంత మైదానంలో దుకాణాలు బారులుతీరున్నాయి, పంక్తిభోజనాలకు చోటు వెతుక్కుంటున్న బంధుజనంలాగా! రోడ్లల్లో సంతరద్దీ అప్పుడప్పుడే ప్రారంభ మౌతున్నది.

రాములుకు ఆకలి వేయసాగింది. తనవద్ద వున్న అరవై పైసలతో ఏదో ఒకటి కొనుక్కుతిని, ఆకలి చిచ్చును కొంతవరకు చల్లార్చుకోవచ్చు! కానీ, సినిమా మాటేమిటీ? హోటలుముందర చెత్తకుండీలో ఎంగిలాకుల్ని కెలుకుతూన్న కుక్కల్ని చూస్తూ నడుస్తున్న రాములుకు సినిమాబండి ఎదురుపడింది. చారల చొక్కావాడు సినిమాలోని హాస్య నటుల గొంతుకల్ని అనుకరిస్తూ, వాళ్ళ సంభాషణల్ని అప్పజెబుతున్నాడు. చిత్రాన్ని నేడే చూచి ఆనందించమంటున్నాడు. ఇదివరకే చూచివుంటే మళ్ళీ చూడ మంటున్నాడు. ఎన్నిసార్లు చూసినా తనివితీరని నవరస భరిత చిత్రం అంటున్నాడు.

షడ్రసోపేతమైన భోజనం అని పేరేగానీ, హోటల్‌లో అది దొరకవద్దా? అర్ధ రూపాయికే నవరసాలు దొరుకుతాయి సినిమాలో! ఈ ఒక్కపూట తిండి తినకపోయినంతమాత్రాన ప్రాణం పోతుందా? ... లక్ష్యంతప్పని బాణంలా నేరుగా సినిమా థియేటరు చేరుకున్నాడు రాములు.

చారల చొక్కావాడు సమీకరించి పంపిన ఆటవిక సైన్యంలా థియేటరును మోదేస్తున్నారు జనం. పాతికేళ్ళకు పూర్వం, అప్పటికి లభ్యమైన సామానులతో నిర్మింపబడిన థియేటరు అది. టిక్కెట్లు యిచ్చే గదుల్ని మాత్రం ఏడాది కిందట పడగొట్టించి, స్వయంగా దగ్గిరుండి గట్టి కాంక్రీటుతో పునర్నిర్మించాడు థియేటర్ యజమాని.

పోరాటం అనేది జీవలక్షణం. పూర్వం అమృతంకోసం దేవదానవులు పోట్లాడుకున్నారన్నది పురాణకథ. పోట్లాడుకున్నా, సంఘటిత శక్తితోనే వాళ్ళు ఆ పని చేశారు. అమృతం కోసం రాక్షసులంతా ఒక్కటై దేవతల్ని ఎదిరించారు. దేవతలూ అంతే! సినిమా టిక్కెట్టుకోసం ఎవడికి వాడు ఒంటరివాడై, తక్కిన వాళ్ళందరితోనూ పోట్లాడటం, నేడు మానవ లక్షణమైంది.

కష్టజీవిగా వారంరోజుల దాకా ప్రజాసేవ చెయ్యటానికి చాలినంత జీవశక్తిని పావుగంటలో ధారపోసినా, టిక్కెట్టుమాత్రం దొరకలేదు రాములుకు. హౌస్‌ఫుల్!

ఫస్ట్‌క్లాసుకయితే, ఎక్కువ శ్రమలేకుండా టిక్కెట్టు దొరికి వుండేదేమో? నిరాశతో మళ్ళీ బజారు వేపు నడిచాడు రాములు. ఏమైనా సరే, సాయంకాలం బెంచీ టిక్కెట్టు దొరక్కపోతే, ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టయినా కొనేసి ఫస్ట్‌షో చూడాల్సిందే!

రంగంపేటలో తిరుపతి బ్రహ్మోత్సవాలో, కాకపోతే పూరీ జగన్నాథ రథోత్సవమో ప్రారంభమైందనే అనుకోవాలి. రోడ్డు నిండా జనం. ఎంత జాగ్రత్తగా ఉమ్మేసినా, ఆ ఎంగిలి మనిషిమీద తప్ప మరోచోట పడదు. ఆగమని మొత్తుకున్నా ఆగే సంప్రదాయం లేని ఆర్.టి.సి. బస్సులు సైతం పెళ్ళినడక నడుస్తున్నాయి

కాయకష్టం చేసుకోలేని ముష్టివాళ్ళు రోడ్డుకు యిరు వైపులా మకాంవేసి, తాము చెయ్యగలిగినపని యిదొక్కటేనన్నట్లుగా గొంతు చించుకుంటున్నారు, కడుపుకోసం!

ఒళ్ళువంచి పనిచెయ్యలేని సోమరి ఒకడు, తనను నమ్ము కున్న ఆడది నవమాసాలు మోసి కన్నబిడ్డను ముళ్ళతీగలపైన పడుకోబెట్టి, గుడ్డపరిచాడు, కడుపుకోసం!

అచ్చుపోసిన ఆబోతులాంటి వాడొకడు తన నగ్నవక్షంమీద, వీపుమీదా నెత్తురోడేలా కొరడాతో ఛెళ్ళు ఛెళ్ళున బాదు కుంటున్నాడు, కడుపుకోసం!

గడ పాతి గరిడీలు చేస్తున్న వాడొకడు; మామిడిటెంక పాతి మరికాసేపటికే మొక్క మొలిపిస్తానని మాయమాటలు చెబుతున్న వాడొకడు; చిలక, జోస్యం చెబుతుందంటూ చిల్లరకోసం చెయ్యిజాపుతున్న వాడొకడూ ... అన్నిపాట్లూ కడుపుకోసమే!

రెక్కాడితేనేగానీ డొక్కాడని రాములు కడుపును బుజ్జ గిస్తున్నాడు, సినిమాకోసం!

యుద్ధభూమిలో కూరుకుపోయిన కర్ణుడి రథంలా, సినిమా బండి సంతగేటు దగ్గర ఆగిపోయి, అక్కణ్ణుంచి మరి కదల్లేదు. పాటల హోరులో సంతగోల అణిగిపోయింది, మొరటోడి కౌగిట్లో మరదలు పిల్లలా! సంతకు వచ్చిన ఇంతులందరూ బండి వైపు చూచి ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నారు.

చారల చొక్కావాడు గొంతు మార్చి మార్చి, పల్లెటూరి బావా మరదళ్ళ డైలాగులు చెబుతున్నాడు.

సినిమాలో హీరోయిన్ వాడిన చీరల రంగులూ, జాకెట్ల డిజైన్లూ, గాజుల రకాలూ, సెక్సుతార ధరించిన ఆభరణాల సొంపులూ కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి, తనకు అలాంటివి తెచ్చి పెట్టమని ముద్దు ముద్దుగా బావను అడుగుతుంది మరదలు.

'అయితే సినిమాకు వెళ్ళి, అవి ఎలా వుంటాయో చూసి, ఆ తరవాత అలాంటివి కొనుక్కువస్తా' నంటాడు బావ.

'పద మావా, నేనూ వస్తా' అంటుంది మరదలు.

'ఈ సినిమా నువ్వు చూశావుగదే, మళ్ళీ ఎందుకూ?'

'ఏదో ఉబలాటం కొద్దీ అడిగాను గానీ, అవన్నీ నువ్వు కొన గలవా ఏమిటీ? సినిమాలో చూస్తేవాల్లే! రూపాయితో ముచ్చట తీరిపోతుంది. ఎన్నిసార్లు చూస్తేనేం మావా? వందలౌతుందా, వేలౌతుందా?'

ప్రో. రా. : దీనిలో ప్రత్యేకించి అందజేయ తగిన ప్రతిజ్ఞా పత్రిక ఏమియు లేదు. నేను నేరము మోపుటలేదు.

అందరు : అది ఎట్లు సంభవము ?

అధికారులు : నిశ్శబ్దము.

మ. దే. రా : మహారాజుల పక్షమున యువరాజగు నేను ప్రతిజ్ఞా పత్రమును సమర్పిస్తున్నాను. ఇదుగో (అని కోపము పట్టలేక దగ్గును)

ధర్మయ్య : ప్రాడ్వివాకులు ఆ పత్రమును గ్రహించి చదువ గోరెదను.

[పోలరాజు తలవంచుకొని కూర్చుని యుండును. వృద్ధ మంత్రులు, గురువులు ఆందోళన వ్యక్త పరుచుచుందురు.]

రామయ్య : ఇది, నా, అనగా, యువరాజు మహాదేవరాజుల ప్రతిజ్ఞా పత్రిక. ప్రతివాది అయిన రుద్రదేవరాజు రాజద్రోహ చింతనతో, రాజ్య కాంక్షతో, కాకతీయ రాజ్యమును హస్తగతము కావించుకొను దురాశతో...

[రాజు, పెద్దలు, రుద్రదేవుడు 'శివ శివ', 'హర హర' అని చెవులు మూసుకొందురు.]

మహారాజుని వంటరిని చేసి హత్య గావించబోయెను. రుద్ర దేవరాజు ఉన్నత రాజ వంశమునకు చెందని అనామకుడయ్యు, మహారాజుగారి ఆలనలో పెరిగి, విశ్వాస ఘాతకుడై తన స్థితి గతులను విస్మరించి నేడు మహారాజునే హత్య చేయ యత్నించిన...

[ కలకలము — 'శివ శివ' అను మాటలు. రుద్రదేవరాజు ఒక విప్తపాటు ఆగ్రహావేశుడై మరల సర్దుకొని నిస్తేజముగా నిలబడును ]

'రాజ్యములో తనకన్న వీరుడు లేడన్న గర్వాంధకారముతో, రాజ్యకాంక్షతో హత్యకు పాల్పడిన రాజద్రోహి. వానిని తగు శిక్షితుని చేయ గోరుచున్నాను.''

రామయ్య : రుద్రదేవా ఈ అభియోగమునకు నీ సమాధాన మేమి ?

(రుద్రదేవుడు నిశ్శబ్దముగా వుండును.)

మ. దే. రా. : (ఆవేశంగా) రాజద్రోహి ఏమి చెప్పగలడు ?

పెద్దలు : అనవసర ప్రసంగములు చేయ తగదు.

రామయ్య . : రుద్రదేవా ! నీ మీద గురుతరమైన అభియోగము మోపబడి యున్నది· నీ వేమియు పలుకనిచో న్యాయ మెట్లు చెప్పగలరు ?

రుద్రదేవుడు మాట్లాడడు.

ధర్మయ్య : రుద్రదేవా ఇది కడు వింతగా నున్నదయ్యా. నీపై అభియోగము, అందులో రాజద్రోహ నేరము మోపి ఇందరు పెద్దల ఎదుట నిన్ను సమాధాన మడుగు చుండగా నీవు మిన్నకుండుటేమి ?

రు. దే. : పెద్దలకు నమస్కారములు. నన్ను మన్నింతురుగాక. ఏ శిక్ష భరించుటకైనను నే సంసిద్ధుడనేనని మొదటనే విన్నవించితిని కదా. దేనికైనమా తల వొగ్గెదను. (అని తల వంచును)

మ. దే. రా. : (వ్యంగ్యంగా) వింటిరా వాని జవాబు. సామ పద్ధతిలో మిమ్ములను ప్రసన్నుల చేసుకొని దండన నుండి తప్పుకో ప్రయత్నించుచున్నాడు. రుద్ర దేవుడు శిక్షార్హుడు. వానిని వధించి అందరకూ గుణపాఠము నేర్పకోరెదను.

ధర్మయ్య : మహాదేవరాజా ఆగుము. ఇది ప్రతిష్ఠిత ముద్రిత ధర్మాసనము. నేను ధర్మాధికారిని. న్యాయాన్యాయ విచక్షణ నామీద కలదు. ఇతరులు ఆవేశ పడుట తగదు.

మ. దే. రా. : (బిగ్గరగా) అతడు ద్రోహి అందురా లేదా ?

ధర్మయ్య : నేరము ఎచ్చట, ఎప్పుడు, ఎట్లు జరిగినది తెలియకయే నిర్ణయమెట్లు జరుగ గలదు ? ఆ విషయములు వాది చెప్పుటలేదు. ప్రతివాది కాదనుట లేదు కదా ఇక నేరమేవిధముగా మోపగలము ?

మ. దే. రా. : అయినచో మహారాజులు అస్వస్థులుగా నుండుట అబద్ధమా ? ప్రభువుల మాటనే అపహాస్యము చేయుచున్నదా ఈ ధర్మాసనము ?

ధర్మయ్య : ప్రభువులు అభియోగము చేయుటకే నిరాకరించగా వారి మాటలను అపహాస్యము చేయుట ఎక్కడ ? యువరాజుల మాటలే ధర్మాసనాన్ని అపహాస్యము చేయుచున్నవి కాని ధర్మాసనము ఎదుట అనవలసినవి కావు.

మ. దే. రా. : (ఆవేశంతో) అయినచో ప్రభువులు స్వర్శవేది శంభుని గుడికి వెళ్లుట అబద్ధమా ? రుద్రదేవుడు ప్రభువులను మారణాయుధముతో గాయపరచుట అబద్ధమా ? ... మీ కనులతో మీరు చూచునది అబద్ధమా ? నేరస్థుడు తన నేరము నొప్పు కొనుచు మారు పలుకక పోవుట అబద్ధమా ? పలుకరేమి ? ఇందులో ఏది అబద్ధము..(దగ్గును)

ధర్మయ్య : కావచ్చును. కాని వాదినేరమును ఆరోపించుటలేదే? నేరారోపణ లేకయే దోషిగా పరిగణించుట ఎట్లు ?

మ. దే. రా. : ప్రభువులకు దయ, కరుణ, ప్రేమ, జాలి, మిక్కుటము. వారికి ఈ అపరాధిపై మొదటి నుండియు అపార కరుణయే, అవ్యాజానురాగమే. వాని శక్తి సామర్థ్యములమీద ఎడతెగని నమ్మకమే. ఇంతఎందుకు. యువరాజులమైన మమ్ములను

మించి వానిపై ప్రభువులకెప్పుడును పక్షపాతమును, అనురాగమునుగలవు.

ధర్మయ్య : అందులకేనా యువరాజులు ఈ నేరమును మోపి విచారణలేకయే శిక్షింపవేయ ప్రయత్నించుచున్నారు? పగ సాధింపగోరుచున్నారా ?

మ. దే. రా : (పరిహాసముగా) ధర్మాసనాధిపతులకు సహితము పక్షపాతమున్నట్టులున్నదే ?

ధర్మయ్య : అది ఎట్లు ?

మ. దే. రా : లేనిచో నేనింతగా చెప్పుచున్నను మీరిట్లేల వాని వైపు మాట్లాడుచున్నారు ?

ధర్మయ్య : రుద్రదేవుడు ఎపుడును వీరోచితముగా వ్యవహరించెనే కాని ఇంతవరకెన్నడును భీరువుగా ప్రవర్తించ లేదు గనుక.

మ. దే. రా : మీరు చెప్పెడుతీరు చూచినచో ప్రతి హంతకుడును నిత్యము తప్పక ఒక హత్య అయినను చేస్తూనే వుండవలసినట్టున్నది. పోనీండు. నిందితుని బంధించిన వారినైన ధర్మాధికారి ప్రశ్నించవచ్చును కదా ?

ధర్మయ్య : నిందితుని బంధించిన వారెవరు ?

(ఎవరూ మాట్లాడరు)

ప్రభూ తమరు శెలవివ్వండి.

(ప్రోలరాజు మౌనము పాటించును.)

చూచితివా యువరాజా. ఆవేశపడతగదు. చూడగా ఈనాటి విచారణలో కంటికి కనపడనిది ఏదో దాగియున్నది. వాది ప్రతివాదుల మౌనమే దీనికి నిదర్శనము. పరిశీలించవలసిన విషయముకాని, విచారించ వలసిన వ్యక్తులు కాని సాధారణులు కారు. వాది నేరము మోపుటలేదు. ప్రతివాది మోపని నేరమును తలదాల్చుచున్నాడే కాని పెదవి కదుపుట లేదు. ఇది క్లిష్టమైన సమస్య. ఆలోచించినమీదట కాని ఏమియు చెప్పజాలను. అందులకుగాను ఈ విచారణ తిరిగి సోమవారమునాడు చేయగలవాడను. ఇందుకు ప్రభువులకు అసమ్మతి లేదుకదా ?

ప్రోలరాజు : లేదు. ముమ్మాటికి లేదు. నాకునూ కొంచెము స్పష్టత చేకూరకలదు. అటులే కానిండు.

ధర్మయ్య : సభాసదులారా... ఈ విచారణ అనివార్య కారణముల చేత ఇప్పటికి ఆపుచేయుచున్నాను. రాగల సోమవారమునాడు విచారణ తిరిగి కొనసాగింతము. లేఖకులారా ఇప్పటికి జరిగినదంతయు మీరు గ్రంథస్థము చేసితిరా. అయినచో ఇక లెండు.

తెర / విరామం

తెరలేచును. కుటీర ప్రాంగణము రామేశ్వర పండితులు శిష్య సమేతముగా కూర్చునియుండును. శిష్యులు పఠనమందు లీనమైయుందురు. ఇంతలో ధర్మయ్య ప్రవేశము.

ధర్మయ్య : నమఃవాకములు గురువర్యా.

రా. పం. : దీర్ఘాయుష్మాన్‌భవ. ఆశీనులు కండు ధర్మయ్య గారూ. అంతాకుశలమేకదా? ఊరకరారేమహాత్ములు.

ధర్మయ్య : తమరికి తెలియనిదేమున్నది. మీతో ప్రసంగించ వలెనని.........

రా. పం. : దానికేమున్నది. కుఱ్ఱలారా, పోయి మీ పనులు చూచుకొనుడు. అయ్యా, ఇప్పుడు చెప్పుడు ?

ధర్మయ్య : సర్వజ్ఞులు మీకు చెప్పవలెనా ? ఈ విచారణయే ...

రా. పం. : ఆఁ విచారణ ఏమైనది ?

ధర్మయ్య : నాకేదో అనుమానముగా నున్నది.

రా. పం. : ఎందులకు ?

ధర్మయ్య : వాది, ప్రతివాదు లిద్దరూ మౌనము పాటించుచున్నారు. దాని భావమేమి ? నేరారోపణ చేయువారు, చేయబడినవారు ఇద్దరును మెదలకుండిన ఏమి చెయ్యగలను ? ధర్మము నెట్లు చెప్పగలను ? వారైనను సామాన్యులుకారే ? ఏమి చేయుటకు పాలుపోక ఇటు వచ్చితిని గురువర్యా.

రా. పం. : (ఆలోచనా పరుడుగా నుండును) (కొంతసేపటికి)

ధర్మయ్య : ఏమి శెలవు గురువర్యా ?

రా. పం. : అదియే ఆలోచించుచున్నాను. దీనికి పరిష్కారము ... మరల విచారణ సమయమందే దొరకగలదు. అదొక్కటే మార్గము కనిపించుచున్నది. అచ్చటనే కలిసెదను గాక.

ధర్మయ్య : అట్లే కానిండు. నాకు శెలవొసంగుడు గురువర్యా.

రా. పం. : మంచిది పోయిరండు.

తెర / విరామం

అంతరంగిక సమావేశం.

రామేశ్వర పండితులు, ప్రోలరాజు.

ప్రోలరాజు : నమోవాక్కులు గురువర్యా. ఆసీనులు కండు.

రా. పం. : అభీష్ట సిద్ధిరస్తు. కుశలమా రాజా ?

ప్రోలరాజు : కుశలమే స్వామీ. కాని మనసుకే శాంతి లేకున్నది ఆందోళనతో శరీర స్వాస్థ్యము చిక్కుటలేదు.

రా. పం. : మహారాజుల మనసు నాకు అవగతమైనది.

ప్రోలరాజు : త్రికాలజ్ఞులు. మీకు తెలియరానిదేమి? నా ఈ అశాంతి తీరు మార్గము చూపుడు స్వామీ.

రా. పం. : దానికొక్కటే మార్గము. చేసినది నలుగురిలో చెప్పుటయే

ప్రోలరాజు : చెప్పక తప్పదా?

రా. పం. : తప్పదు. పండితులపాదించిన పితృహత్యా దోషము ఈ స్వల్పగాయముతో సమసిపోయినది. ఇంక ప్రమాదమేమియును లేదు. అంతియేకాదు. కాకతీయ రాజ్యమునకు భద్రత దానివల్లనే కలుగును. ఈ వంశము చిరస్థాయిగా నిలుచును. కీర్తిగాంచును. ఇందులకేమియు లోటురాదు.

ప్రో. రా : అయినచో ఆచార్య రామారణ్యులను తదితర పేద్దలను పిలిపింపుడు. సోమవారము విచారణనాటికి వారు వచ్చునట్లు చూడుడు. హమ్మయ్య ఈ నిశ్చయమునకు వచ్చిన వెనుక మనసు ఎంత హాయిగా నున్నది. ఎంతటి ప్రశాంతత కలిగినది. కృతజ్ఞుడను గురువర్యా.

రా. పం. : ఆయుష్మంతుడవు కమ్ము మహారాజా. విశ్రాంతిగా నుండుము.

ప్రోలరాజు : ఇంక అంతయు శాంతే. విశ్రాంతేకదా.

తెర, విరామం

[సమయం - సోమవారము ఉదయం తొమ్మిది గంటలు.

స్థలము—స్వర్శవేది శంభుని గుడి ప్రాంగణము. ధర్మాసన విచారణకంతయు ఆయత్తముగా నున్నది. ఎవరి స్థలములలో వారు యథాప్రకారముగా నున్నారు. వారుకాక అనేక మంది వృద్ధులు కాన వచ్చుచున్నారు.]

ధర్మయ్య : నేడు మరల విచారణ జరుప నిశ్చయించబడినది. అది మీ అందరికి విదితమేకదా. నేడు సభాముఖమున ఈ మధ్యకాలమున చూడని అనేకమంది పెద్దలను చూచుచున్నాను. అందరికి నా నమస్సులు. మీరందరు ఈ విచారణ త్వరలో ముగియునట్లు తోడ్పడ ప్రార్థించుచున్నాను. రామయ్యగారూ ప్రారంభింతమా. వాది ప్రతివాదులు సిద్ధముగా నున్నారా?

రామయ్య : చిత్తము.

ధర్మయ్య : మహారాజా నేడైనను అభియోగము..............

ప్రో. రా. : నేను అభియోగము చేయుటలేదు.

ధర్మయ్య : నేనేమి చేయగలను. ఎట్లు తీర్పుచెప్పగలను.........

సభికులు : వీలేదు. తీరు చెపువలసిందే.

ప్రో. రా. : ప్రజలారా శాంతించండి. మీకు మీ ఏలికపైన ఏపాటి గౌరవమున్నను శాంతించండి. నేను అభియోగము చేయననుట నిజమే. కాని దాని పూర్వాపరములు మీరు వినగోరెదను. దానికొరకై ఇరువది సంవత్సరములు వెనుకకు పోవలసియున్నది. ఆనాటి దుస్సంఘటన మీకు తెలియవలసియున్నది. అంతయు తెలిసికొన్న పిదప న్యాయము నిర్ణయింతురు గాక.

అందులకే ఆనాటి సభికులను, పెద్దలను అందరిని ఇచ్చటకు రా బిలిచితిని. వారలు ఆనాటి చరిత్రకు సాక్షులు కాగలరు. కొలదిమంది కాల గర్భములో కలిసిపోయిరి. కాని మీకు అదంతయును విశదము కాగలదు. కొంచెము శాంతించుడు. ఆచార్య రామారణ్యులకు పెద్దలకు నా నమస్కారములు. మీ సహకారము కోరుచున్నాను.

అందరు : అవశ్యము ప్రభూ.

ప్రో. రా. : ధర్మపండితులారా, మహాజనులారా ఇరువదేళ్ల కిందటిది ఈ విషాదగాథ. అవధరించండి.

తెర / విరామం

తెర లేచును. (20 సంవత్సరముల వెనుక)

(విశ్రాంతి మందిరంలో మహారాజు కాకతి ప్రోలరాజు ఆసీనుడై వున్నాడు. అతనిని పరివేష్టించి పండిత రామారణ్యుడు, రామేశ్వర పండితులు, మాచన పండితుడు, శ్రీపతి పండితుడు, కామచమూపతి, మంత్రి దేచన, గంగాధర మల్లినాయకులు, మొదలైన ఆంతరంగిక పరివారము వుచితాసనముల నున్నవారు. ప్రోలరాజు ముఖమున వుండి వుండి ఆతృత పొడకట్టుచున్నది. ఆయన దృక్కులు ద్వారమువైపు ప్రసరించుచున్నవి. మహారాజు దృష్టిని మరల్చుటకు ఎవరును సాహసించకుండిరి.

[ఇంతలో ప్రతీహారి ప్రవేశము]

సింగన : జయము జయము మహారాజా. అంతఃపుర ప్రతీహారి నాగాంబిక తమ దర్శనార్థమై వేచియున్నది.

ప్రో. రా. : ప్రవేశ పెట్టుము సింగనా.

నాగాంబిక : జయము జయము మహారాజా.

ప్రో. రా. : నాగాంబికా ఏమా శుభవార్త.

నాగాంబిక : ఏలినవారికి జయమగుగాక. సుపుత్రోదయమైనదని చెప్పుటకు ఆనంద.. .........

ప్రో. రా. : ఆహా ఎంత సుదినము. సుపుత్రోదయమైనదా? ఎంత సేపైనది? యువరాజులు ఎట్లున్నారు?

నాగాంబిక : మహారాజా ఆ ప్రశ్నల కన్నిటికి వుత్తర మీయజాలను. పుత్రోదయమైన వెంటనే పరుగున ఇటు

వచ్చితిని. ముప్పది లిప్తలకాలమై యుండును. నేనును యువరాజుల వారిని చూడలేదు.

ప్రో. రా. : అటులనా కామమ్మ. ఈ ముత్యాలహారమును మా సంతోష చిహ్నముగా పుచ్చుకొనుము. (అనుచు పరివారమువైపు తిరుగును)

పరివారం : జయము జయము మహారాజా. కాకతీయ వంశోద్ధారకుల జనన వృత్తాంతము మాకు కర్ణపేయముగా నున్నది. మా జన్మలు సార్థకమైనవి. కాకతీయాంధ్రావనియే తరించినది.

ప్రో. రా. : ఇది అంతయు గురుదేవుల, పరదేవతల దయ.

రామార. : ప్రభువులు అంతఃపురమునకు వెడలి యువరాజును చూచి వత్తురా ?

ప్రో. రా. : మహాప్రసాదము గురువర్యా. ఇప్పటికి బిడ్డకు స్నానాదికములు ముగించియే యుందురు. ఆచార్యులారా, అంతఃపురమునకు విజయముచేసి నన్ను సంతోషపెట్ట గోరుచున్నాను.

అందరు : అవశ్యము ప్రభూ (అని అనుగమింతురు)

తెర / విరామం

(అంతఃపురము. రాణి ముప్పాంబికాదేవి పరిచారికా పరివృతయై యుండును. మంత్రసాని మాచాంబ తన అనుచరులతో సంభ్రమముగా ఉయ్యాలలోని బిడ్డను చూచు చుండును. పరివారమంతయు ద్వారముకడ నాగిపోగా మహారాజు పురోహితునితో గురువర్యులతో లోనికి ప్రవేశించును)

అం. స్త్రీలు : జయము జయము మహారాజా. ప్రభువు వారికి సుస్వాగతము.

ముప్పాంబిక : మహారాజులకు, గురువులకు ప్రణామములు.

పం. డి. : దీర్ఘసుమంగళీభవ.

ప్రో. రా. : దేవీ, ముప్పాంబా. ఈనాటికి నా జన్మ ధన్యమైనది. కాకతీయ వంశమును నిలిపిన ఘనత నీకు దక్కినది. రాజపత్నివే కాదు. రాజమాతవైనావు.

ముప్పా. : ధన్యురాలనైతిని.

ప్రో. రా. : మాచాంబా. పుత్రోదయమైనవేళ వివరములు ఈ పండితుల కొసగుము.

మాచా. : అవశ్యము మహారాజా.

ప్రో. రా. : గంగాధరా, మాచాంబికా ప్రభృతులకు వేయేసి మాడలిప్పింపుడు.

మాచాంబిక } మహాప్రసాదము.

గంగా. : చిత్తము ప్రభూ

ప్రో. రా. : పండితులారా. యువరాజుల జననకాల నక్షత్రములు పరికించి భవిష్యత్తును నిర్ధారించుట ఇంక తమ కర్తవ్యము. రేపు ఇదేవేళకు మరల సమావేశము కాగలము. ఇంక నాకు శెలవిండు.

అందరు : శుభముగాక, మహారాజా. అటులనే చేయగలము.

తెర / విరామం

[మరునాడు విశ్రాంతి మందిరమున అందరు సమావేశమై యున్నారు. ]

శ్రీ పండి. : (ఆందోళనగా) ఇంకను పభువులు విజయము చేయలేదు. కటకటా. ఈ దుర్వార్త ఎట్లు నివేదించుట ?

రా. రణ్యుడు : శ్రీపతి పండితా అట్లు బెంగటిల్లెదవేమయ్యా. కానున్నది కాకమానదు కదా. విధి నెవ్వరు తప్పగలరు...

కా. పతి : పండితవర్యులారా ఇంతమందిమి వుండిచేయ కలిగిన దేమియునులేదా ? శాంతులు, జపములు చేసి యైనను ఈ అవాంతరమును గడుపలేరా ?

రామార. : నాయనా కామాయ్యా, చమూపతివై యుండియు ఏమా పేద మాటలు ? మానవ మాత్రులు చేయ కలిగిన దేమియు లేదు నాయనా. అంతా విధి లిఖితము.

గంగాధరుడు: గురువర్యులు తమరే అట్లు శల విచ్చినచో మాకిక వేరు మార్గమే కానరాకున్నది.

మాచనపండి : అయ్యో మహారాజునకు ముఖమెట్లు చూపగలము. ఇంతకన్న మరణమే మేలు.

శ్రీ పండి. :
గంగా. : అదియే శరణ్యము.

రామార. : నాయనలారా శాంతించుడు శాంతించుడు. అన్నియు ఎరిగిన...

ప్రతీహారి : మహారాజులు విజయము చేయుచున్నారు.

పండితులు : ఆయురారోగ్య కీర్తిరస్తు. జయమస్తు.

ప్రోలరాజు : ఆశీసులు కందు. పండిత శ్రేయోభిలాషులారా మీ కందరకు కుశలమే కదా ? ఈనాటి కార్యక్రమము ప్రారంభింతుమా ?

అందరు : ప్రభువుల ఆజ్ఞ.

ప్రోలరాజు : ఏమిది ? అటులనే అని ఈ నిశ్శబ్దమేమి ? మీ ముఖము లింత ఆందోళనా ద్యోతకముగానున్నవేమి? ఎందులకీ దైన్యత? ఒక్కరును బదులుపలుకరేమి? శ్రీపండిత, మాచనవర్య, గురువర్యులు, మీరందరూ ఊరక చూచెదరేల. ఇట్లు అశక్తులవలె మ్లాన ముఖములతో చూతురేమి ?

అందరు : ప్రభూ ఏమనుటకు నోరాడకున్నది. మా నాలుకలు వుత్తరింపుడు.

ప్రోలరాజు : అక్కటా. ఇటువంటి వాక్యములు వినవలసి వచ్చె గదా. హతవిధీ ! గురువర్యా, మీరైన చెప్పరా ?

రామార. : ప్రభూ ఏమి చేయగలను. పెద్దనుచేసి అడిగిన చెప్పక తప్పునా ప్రభూ. కాని అశుభ వాక్కులు పలుకవలసి వచ్చినందుకు ఖేదపడుచున్నాను. యువ రాజుల ... ... అదే ప్రభూ పసిబాలుర జననకాల నక్షత్రములను గురించి చూచితిమి కాని...కాని...

ప్రోలరాజు : (ఆతృతముగా) త్వరితముగా శలవిందు గురుదేవా.

రామార. : తప్పునా ప్రభూ. యువరాజుచేతనే ప్రభువులు ...

ప్రోలరాజు : ఏమి ... నేను ...

రామార. : యువరాజు పితృహంతకు లగుదురు మహారాజా.

ప్రోలరాజు : అయ్యో హతవిధీ.

అందరు : పాపము శమించుగాక. మేము పోయి వత్తుము మహారాజా శలవిండు.

ప్రోలరాజు : అటులనే కానిండు. గురుదేవా మీరుఒకింత తడవు నిలువుడు.

రామార. : నాయనా ప్రోలరాజా ఇట్టి దుర్వార్త నీకు చెప్పినందుకు నన్నెట్లు శిక్షింతువయ్యా.

ప్రోలరాజు : మహానుభావా అవి ఏటి మాటలు. మా కర్మ పరిపాకమునకు చింతింప వలెనే కాని ఒరుల నెట్లన గలను; అందునా తమరినా గురుదేవా !

రామార. : నాయనా ఆత్మనిగ్రహము అవశ్యము, రాజోచిత కర్తవ్యము. ధైర్యము వహింపుము.

ప్రోలరాజు : కర్తవ్యము తోచకున్నది గురువర్యా.

రామార. : నేనొక్కటి చెప్పెద, చేయగలవా నాయనా. మనసు నిలువ దొక్కుకొనవలెను. రాజ్యశ్రేయస్సునకు బాలుని హతమార్చవలెను.

ప్రోలరాజు : గురుదేవా మీరా అటుల శలవిచ్చునది! నాచేతకాదు.

రామార. : అయినచో ఇంకొకమార్గము చెప్పెదను.

ప్రోలరాజు : చెప్పుడు. అటులనే చేయుగలవాడను. శలవిండు.

రామార. : అయినచో ఆ బాలుని రుద్రేశ్వరుని గుడిమండపములో తెల తెలవారు వేళ త్యజింపుము.

ప్రోలరాజు : గురుదేవా అదెట్లు సాధ్యము ? కన్నబిడ్డను ...

రామార. : నిజమే ప్రోలరాజా కష్టమే. కాని, వేరొకమార్గము గలదా చెప్పుడు ?

ప్రోలరాజు : లేదు గురుదేవా !

రామార. : నేను పోయి వచ్చెద· నీకు శుభమగుగాక. యోచించుకొనుము. కాకతీయ రాజ్య క్షేమమును మనసున నిడుకొని చెప్పితిని రాజా. ఇకపైన తమ ఇష్టము. (నిష్క్రమించును) (రాజు దీనముగా చూచును.)

తెర / విరామం

[మరునాడు కొలువు కూటములో రాజు సపరివారముగావున్న సమయమున ]

వంది, మా. : జయము జయము మహారాజా
'' '' కాకతీయ కులప్రదీప,
జయము కాకతీయ కుల తిలక
జయము సమధిగత పంచ మహా శబ్ద మహామండలేశ్వర,
జయము చలమర్తి గండ
జయము అనుమకొండ పురవరేశ్వర
జయము పరమ మహేశ్వర
జయము శ్రీమన్మహా మండలేశ్వర
జయము శ్రీ కాకతీయ ప్రోలమహారాజా జయము, జయము.

ప్రో. రా. : సభాసదులారా ఆశీనులు కండు. సభ ప్రారంభింపుడు.

ప్ర. సింగన : ప్రధాన అర్చకులవారు రుద్రజియ్యరువారు ప్రవేశము కోరుచున్నారు.

ప్రో. రా. : త్వరితముగా ప్రవేశపెట్టుము సింగనా. అభివందనము ఆచార్యా.

రు. జి. : జయమస్తు శుభమస్తు మహారాజ.

ప్రో. రా. : ఆశీనులు కండు. తమరి రాకకు కారణమేమి ? మా సహకార మేమైన కావలయునా ? సత్వరము శలవిండు.

రు. జి. : ప్రభూ ఒక చిత్రమైన సంఘటన జరిగినది. అది ప్రభువుల కెరింగించుటకు ఇటు వచ్చినాడను.

ప్రో. రా. : అదేమి ? అవశ్యము తెలుపుడు·

రు· జి· : నేడు వేకువజామున స్వామివారి సేవకై రుద్రేశ్వరుని ఆలయమునకు పోయి యుంటిని. ఆ కపిరి చీకటులలో స్వామిధ్యాన నిమగ్నుడనై వున్న నాకు

ముఖమండపమునుండి శిశురోదనము వినవచ్చినది ప్రభూ.

ప్రో. రా. : (ఆత్రముగా) తరువాత తరువాత.

రు. జి. : కలయా నిజమా ఈ శిశురోదనము అనుకొనుచుండగా మరల నదే శబ్దము విన వచ్చెను ప్రభూ.

ప్రో. రా. : అంతట... ? !

రు. జి. : ప్రాంగణ ద్వారములు, లోపలి కక్ష్య ద్వారములు తెరువకనే ముఖమంటపమున సంచార మెట్లుండ గలదు అనిసంకోచించుచు మంటపము ప్రవేశించితిని.

ప్రో. రా. : ఏమి చూచితిరి ఆచార్యా త్వరితముగ తెలవిండు.

రు. జి. : చిత్తము ప్రభూ. మంటపమున దీపపు కాంతిలో స్వర్ణమూర్తివలె వెలిగి పోవుచున్న ఒక పసిగుడ్డును, మగ శిశువును కాంచితిని మహాప్రభూ.

(సభలో హాహాకారములు)

ప్రో. రా. : ఔరా ! ఏమిచిత్రము ! ద్వారములు తెరువని ఆలయ ముఖమంటపములో మగ శిశువా !

(రాజు, ఆంతరంగికులు ముఖములు చూచుకొనుచుందురు)

రు. జి. : చిత్తము ప్రభూ. ఆ శిశువు మహా తేజశ్శాలి. మహా రుద్రునివలె కాంతులు వెదజల్లుచున్నాడు.

ప్రో. రా. : అంతట ఏమి జరిగినది ?

రు. జి. : ఆ బిడ్డ ముఖ లక్షణములు చూచి పరవశుడనైతిని. బాహువులు చాచి ఎత్తుకుంటిని పులకాంకితుడనైతిని. బిడ్డలు లేని నాకు రుద్రేశ్వరుడే నా సేవలకు మెచ్చి యిచ్చిన వరప్రసాదమని హృదయమునకు హత్తుకొంటిని.

ప్రో. రా. : తరువాత...

రు. జి. : వెనువెంటనే గృహమున కరిగి నా గృహలక్ష్మి దాక్షాయణికి ఆ బాలు నొసంగితిని. ఆమె మహదానందమున అక్కున జేర్చుకొన్నది ప్రభూ.

ప్రో. రా. : ఆ పిమ్మట.

రు. జి. : ఆ బాలుని విడువజాలక ఇద్దరము ఖేదమందితిమి. చివరకు ప్రభువులకు మనవిచేసి ఆజ్ఞ అయినచో మా బహిర్ ప్రాణముగా చూచుకొన దలచితిమి ప్రభూ.

ప్రో. రా. : ఆ బిడ్డ ఎక్కడ ?

రు. జి. : ఒక్క క్షణమైనను విడువజాలని దాక్షాయణి చేతులలో నిడుకొని ద్వారము వెలుపల వేచి యున్నది ప్రభూ.

ప్రో. రా. : అయ్యయ్యో ఆసాధ్విని బయట నిలిపితిరేమి ఆచార్యా. ప్రతీహారీ ఆచార్యులవారి సతీమణిని సగౌరవముగా ప్రవేశ పెట్టుము.

(దాక్షాయణి అడ్డాలలో బిడ్డతో ప్రవేశము.)

ప్రో. రా. : స్వాగతము తల్లీ.

దాక్షా. : జయమస్తు మహారాజ.

ప్రో. రా. : ఆశీనులుకండు తల్లీ .... ఆచార్యుల వారంతయు తెలియ చేసినారు. మేమా బాలకుని చూడవచ్చునా తల్లీ.

దాక్షా. : అవశ్యము మహారాజా. కాని ఈ బాలుని ...

ప్రో. రా. : చెప్పుము తల్లీ సంకోచించవలదు.

దాక్షా. : ప్రభువులు అనుగ్రహించి ఈ బాలుని మా పుత్రునిగా ప్రకటింప గోరెదను.

ప్రో. రా. : అటులనే కానిమ్ము తల్లీ. భూసురోత్తముల సంతోషమే మా సంతోషము. ఆహా బాలునిది ఏమి తేజస్సు ఏమి అందము ఏమి ఠీవి. ఆ దర్పము ఆ కళాకాంతి అంతయు చూడగా ఏ రాచబిడ్డో అని తోచుచున్నది.

రామార. : ప్రభువులు బాలునకు దిష్టిపెట్టుచున్నారు. ఆ తల్లి సహింపగలదా. చూడుడు ఎట్లు ఆత్రముగా మీ చేతులలోని బిడ్డవంక చూచుచున్నదో.

ప్రో. రా. : (సంభ్రమముగా) పొరపాటైనది గురువర్యా. మాతా శిశువులను వేరుచేయుట స్వల్పకాలమైనను తగదు. తల్లీ ఈ బాలుని మీ హస్తములందు నిడుచున్నాను. మీరీ కుమారుని ఎట్లు వృద్ధిలోనికి తెత్తురో. నేటి నుండియు భారమంతయు మీదే. ఏమి నామమిడ నిశ్చయించితిరి, ఆచార్యా ?

రు. జి. : రుద్రేశ్వరుని వరప్రసాదియైన ఈ బుడుతనికి రుద్రదేవుడనియే నామధేయ ముంచెదను మహా ప్రభూ.

ప్రో. రా. : సముచితమైన నామమే ఆచార్యా. నా దొక్క విన్నపము.

రు. జి. : తెలవిండు ప్రభు. తమ ఆజ్ఞ సర్వదా శిరోధార్యము.

ప్రో. రా. : సంతాన హీనుడనైన నన్ను ఒక నిముషకాలము మురిపించి మైమరపించిన ఈ బాలునకు తమరు సర్వోత్కృష్టమైన విద్యా వ్యాసంగము గావించ గోరెద అతని ప్రతిభ బహుముఖముగా ప్రజ్వరిల్లు రీతిలో శిక్షణ నివ్వగోరెదను. అపర పరశురామునిగా తీర్చి దిద్దండి ఆచార్యా.

రు. జి. : అవశ్యము ప్రభూ.

ప్రో. రా. : అందులకగు ధనమునకై మీరు ఏ మాత్రము వెనుకాడ నవసరము లేకుండగా అన్ని ఏర్పాట్లు రాజ ధనాగారమునుండి చేయింతును. గంగాధరా, ఆచార్యులవారికి వారు కోరినంత ధనము కోశము నుండి దయచేయించగలరు.

గంగా. : చిత్తము ప్రభూ. అటులనే ఏర్పాట్లు గావించెద.

ప్రో. రా. : ఆచార్యా, తల్లి, కుమారుడైన రుద్రదేవుని మీరు ప్రతి జన్మదినమున మాకు జూపింప ప్రార్థన, వీనికి జరుగు అన్ని వేడుకలు మా సమక్షమున జరుగ గలవు.

రు.జి.,దాక్షా: మహాప్రసాదము ప్రభూ. అటులేకావించెదము మాకు శలవొసంగుడు.

తెర / విరామం

(తెరలోనుండి "ఇది జరిగిన 17 సంవత్సరాలకు" అను మాటలు.)

ప్రతీహారి : మహారాజా ఆచార్య రుద్రజియ్యరు, కుమార రుద్రేశ్వరులు తమ దర్శనముకొరకు వేచియున్నారు.

ప్రో. రా. : సత్వరము ప్రవేశపెట్టుము. ఆచార్యులకు అభివాదనము. ఆశీనులుకండు. నాయనా రుద్రా. చిరంజీవివి కమ్ము.

రు. జి. : జయము మహారాజా. ప్రభువులకు శుభమగుగాక.

ప్రో. రా. : అందరును సుఖులేకదా, బాలుని విద్యావ్యాసంగము బాగుగా సాగుచున్నదా?

రు. జి. : అంతయు కుశలమే ప్రభూ. కుమారు డత్యంత కుశాగ్రబుద్ధి. గురువులు చెప్పినది తడవుగా నేర్చుటయే గాక నైపుణిని చూపుచున్నాడు. సకల శాస్త్రములు, విలువిద్య, కత్తిసాము, కర్రసాము, అశ్వశిక్షణ, ఒకటననేమి, సర్వవిద్యలందు ఆరితేరు చున్నాడు.

ప్రో. రా. : అంతకుమించి కావలయునదేమి. ఆచార్యా రాజనీతి సారము బోధించుచున్నారా?

రు. జి. : చిత్తము ప్రభూ. ఒకటననేల, సకల విద్యలలో ప్రావీణ్యము సంపాదించుచు అందరిలో అగ్రగణ్యుడని అనిపించుకొనుచున్నాడు. మహారాజులు పరీక్షింప వచ్చును.

ప్రో. రా. : భళి కుమారా. అయినచో రుద్రకుమారులకు ఇతర బాలురతో పోటీ ఏర్పాటు చేయమని గురువులతో మా మాటగా చెప్పుడు. రానున్న దుర్గాష్టమి మహర్నవమి విజయదశములయందు వీరి ప్రావీణ్యము తిలకించ దలచితిని.

తె ర / వి రా మ ం

జయము జయము కాకతీయ సార్వభౌమ బహుపరాక్ బహుపరాక్.

| | | |
|---|---|---|
| శ్రీమన్మహామండలేశ్వర | బహుపరాక్ | బహుపరాక్ |
| ఉద్దండ మండలాగ్ర ప్రచండ | ,, | ,, |
| ధనుర్విద్యా విహరణ | ,, | ,, |
| ఆశ్రితజన కల్పవృక్ష | ,, | ,, |
| కొసర మసరగండ | ,, | ,, |
| షట్కాల శివపూజా దురంధర | ,, | ,, |
| సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర | ,, | ,, |
| చలమర్తిగండ | ,, | ,, |
| పరమమాహేశ్వర | ,, | ,, |
| కాకతీయ కులప్రదీప | ,, | ,, |

సభాసదు లందరు } జయము జయము మహారాజా

ప్రో. రా. : ప్రజలారా, సామంతులారా, అమాత్యులారా, చమూపతులారా ఆశీనులుకండు. గంగాధరామాత్యా ఈనాటి కార్యక్రమమును ఆరంభింతమా ?

గంగాధరుడు : అవశ్యము ప్రభూ. నేటితో దసరా ఉత్సవములు పరిసమాప్తి నొందినవి. పోటీలలో నెగ్గిన వీరపురుషులకు బహుమతి ప్రదానము జరుగవలసియున్నది.

ప్రో. రా. : అటులనా. అయినచో ప్రారంభించుము.

గంగాధరుడు : చిత్తము మహాప్రభూ. కత్తిసాము, కర్రసాము, విలువిద్య, గుర్రపుస్వారి మొదలైన అన్ని పోటీల లోను దరిదాపు ఇన్నూట పాతికమంది బాలవీరులు పాల్గొనిరి. వారిలో ఉత్తమశ్రేణిలో నిలిచినవారు గోవర్ధనుడు, బల్లాలుడు, గంగాధరుడు, బద్దన, రుద్రదేవ మహాదేవులు, మల్లారెడ్డి, విఠలరెడ్డి, అన్నమయ్య, నాగయ, కాటయ, బమ్మిరెడ్డి, మల్లె నాయకుడు, బేతిరెడ్డి మల్లిరెడ్డి మొదలైనవారు.

ప్రో. రా. : సంతోషము అమాత్యా. నా రాజ్యములో ఇంతమంది మేటి బాలవీరులుండుట అదృష్టము. తదుపరి—

గంగాధరుడు : వీరిలో సహితము అన్నిట అందరకూ మేటి సాటి లేని పోటు వీరుడనిపించుకున్న వీరుడొక్కడుగలడు, మహారాజా.

ప్రో. రా. : అతనెవరో వెంటనే ప్రకాశము చేయుడు, అమాత్యా. ఆ వీరాగ్రణిని సన్మానించ ఉవ్విళ్లూరుచున్నాను.

గంగాధరుడు : ఆ వీరాగ్రేసరుడు, రుద్రదేవ కుమారుడే ప్రభూ.

ప్రో. రా. : (ఆనందము నుప్పిరిగొన) ఏమిటిట్లు ! ఆ వీర పురుషుడు మన వీరరుద్రేశ్వరుడా ! రుద్రదేవుడేనా! ఎంతటి సుదినము. నాయనా రుద్రా. ఒకసారిటు రావయ్యా. నిన్ను అభినందించనిమ్ము.

రు. దే. : పాద ప్రణామములు మహారాజా.

ప్రో. రా. : ఆయుష్మంతుడవుకమ్ము కుమారా. వీరాగ్రణీ, నా సంతోష చిహ్నముగా ఈ మణిమయహారమును గైకొనుము. ఈ ఖడ్గమును కేలగొనుము. రుద్ర కుమారా, నిన్ను ఈనాడు చూచుట, మరల నిన్ను పసిబిడ్డగా చూచిన రోజువలె నున్నది. ఆనంద పార వశ్యము కలుగుచున్నది ... ......మాటలు.........

రామార. : ప్రభూ, వీరుని రిక్తవాక్యముల సత్కరింతురా యేమి?

ప్రో. రా. : గురువర్యులు ఏమరక నన్ను కాచుచునే యుందురు కదా. చక్కగా గుర్తుచేసితిరి. ధన్యులము. అయి నచో కాకతీయ రాజ్యము సుక్షేత్రముగా నుండుటకు సర్వప్రజలు అత్యంత జాగరూకతతో భక్తిప్రవృత్తులతో కాపాడవలసినది పరుసవేది లింగమేకదా.

అందరు : చిత్తము మహాప్రభూ. నిశ్చయము.

ప్రో. రా. : నేటినుండి కుమార రుద్రదేవులను ఆ పరుసవేది లింగని రక్షకులుగా నియమించుచున్నాము.

సభికులు : జయము జయము మహారాజా. సముచితమైన నిర్ణయము కావించితిరి. (అని కేకలు)

ప్రో. రా. : రుద్రదేవా నేటినుండి నీవు పరుసవేది లింగని నీ ప్రాణములొడ్డి అయినను రక్షించుకొనవలెను. ఈ కాకతీయ రాజ్యరమ ఆ లింగని దయావీక్షణ ముల మీదనే ఆధారపడి యున్నదని చెప్పనవసరము లేదనుకొందును.

రు. దే. : ధన్యుడను ప్రభూ. ప్రభువుల ఆజ్ఞ సదా శిరోధార్యము.

ప్రో. రా. : నిన్ను పెంచిన తల్లిదండ్రులు ఆచార్య రుద్ర జియ్యరు, ఆయన సతీమణి ధన్యులు కుమారా. నిన్ను కన్న............

రామార. : ప్రభువులు రుద్రజియ్యరులను మాటలతోనే సత్క రింతురా ఏమి ?

ప్రో. రా. : గురువర్యులు అప్రమత్తులు. క్షణ క్షణము నాకు పరాకు చెప్పుచునే యుందురుకదా. ధన్యుడను.

రుద్రజియ్యరులకు యేటా దశ సహస్ర సువర్ణ కాసులు పంపు ఏర్పాటు చేయుడు. ముత్యాలపల్లకి, వెల్లగొడుగు, చామరము అమర్చుడు.

రు. జి. : మహాప్రసాదము ప్రభూ. ధన్యుడను.

ప్రో. రా. : నిజముగనే ధన్యుడవు ఆచార్యా. నేటికి ఈ సభ చాలింతమా.

తెర / విరామం

(తెరలోనుండి ప్రకటన)

(న్యాయవిచారణకు పన్నెండు రోజులక్రిందట అర్ధరాత్రి **సమయమున** రాజు శయనాగారమున)

ముప్పమాంబ: ఏమి మహారాజా విశ్రాంతి నందక ఇట్లు ఆయాస మొందుచున్నారు. కొంతసేపు శయనింపుడు.

ప్రో. రా : నా కెక్కడి విశ్రాంతిదేవీ ? ఎట్లుండగలదు ? మన పుత్రుడు మహదేవరాజు మిక్కిలి అస్వస్థుడుగా నున్నవాడు కదా.

ముప్ప. : ఔను ప్రభూ. ఎన్ని వ్రతములు **పూ**జలు చేసినను, యే దేవతలకు మొక్కినను ప్రయోజనము లేశ మైనను కన్పించుటలేదు. కానున్నది కాకమానదు. ప్రభువులింత కుంగిపోవుట పాడి కాదు.

ప్రో. రా. : అది ఎట్లు సంభవము దేవీ ? నాడు త్రికాల జ్ఞుల మాటలకు తలవొగ్గి వజ్రవంటి కుమార వీర రుద్రేశ్వరుని దూరము చేసికొని నేటికిని బహి రంగముగ చెప్పుకొనలేక లోలోపల భరించలేక బడ బాలనమును మోయుచుంటిమి కదా.

ముప్ప. : అందులకే ప్రభువులకు, నాకు, పుత్రులకు భగవంతు డిట్లు శిక్షవేసెనేమో ప్రభూ (అని దుఃఖించును.)

ప్రో. రా. : నన్నూరడించి నీవు జాలవలె దుఃఖించుచుంటివా దేవి ? ఊరడిల్లుము. నేను కొంత తడవు పరుస వేది లింగేశ్వరుని దర్శించుకు వచ్చెదను.

ముప్ప. : నేడు కార్తీక పర్వదినము. పగలంతయు మీ రుపవసించి రుద్రునారాధించుచు బడలియుంటిరి. ఈఅపరాత్రమందు మీరు వెడలుట మంచిది కా**దు** ప్రభూ.

ప్రో. రా. : నిజమేదేవి. కాని మనసు ఆరాట పడు**చు**న్నది. దానిని శాంతింప చేయుటకు ఆ భగవత్ సన్నిధి ఒక్కటే శరణ్యము.

ముప్ప. : ప్రభూ నా కుడి కన్నదురుచున్నది. నేడు చన వలదని ప్రార్దన.

ప్రో. రా : దేవీ అంతయు భగవత్ లీల. భగవత్ నిర్దేశనము. కానున్నది కాకమానదు. శాంతింపుము.

ముప్ప. : **అటులైనచో,** నాడు రుద్రుని ఏల వొదులు **కుంటిరి** ప్రభూ ? నా మనః ప్రాణములు **కాల్చి** బూడిద చేసి, రోజునిండని ఆ పసికందుని ఆ మంటప శైలముపై వదలి వచ్చువరకూ నన్ను నిలువనీయలేదే తమరు ?

ప్రో. రా. : అదియు ప్రారబ్ధమేదేవీ కన్నబిడ్డను పరిత్యజించి, పరులెవరో పెంచుట చూచి సహించి జీవచ్ఛవ మునై బతికి యుండిన నన్నింక యేమనగలవు. కాని నేడు నా మనసెందుకో రుద్రుని సాన్నిహిత్య మునే కోరు చున్నది. అతడే మనల నుద్ధరించువాడని అనిపించుచున్నది దేవీ.

ముప్ప. : తథాస్తు దేవతలు ఔనను చున్నారను కొందును.

ప్రో. రా. : నే పోయి వత్తును దేవీ.

ముప్ప. : అనుచరుడు భద్రుని వెంటనిడుకొని పొమ్మని నా ప్రార్థన.

ప్రో. రా. : ఎందులకు దేవీ, అనవసరము.

ముప్ప. : కాదనవలదు. ఇయ్యకొనుడు.

ప్రో. రా. : అట్లే కానిమ్ము. భద్రా, నీవు దేవాలయ ధ్వజ స్తంభమువద్ద నిలువుము.

భద్రుడు : అట్లే ప్రభూ.

తెర / విరామం

[ప్రోలరాజు ఆలయ మంటపము ప్రవేశించ**బోయి** దారి కడ్డముగా శయనించియున్న రుద్రదేవుని చూచి, ఆనందపారవశ్యముతో]

ఆహా భగవత్‌లీలలు అతి చిత్రములు. **అనూ**హ్యములు. ఎచ్చోట ఈ రుద్రుని, పురిటికందుని తెచ్చి విడిచి పుచ్చితినో, అచ్చటనే, ఆ మంటపముననే ఆజానుబాహుడై పసిడి వెన్నెలలు చిందించుచు శౌర్యపరాక్రమ**ము**లు **రూ**పు దాల్చెనన్నట్లు అత్యంత తేజోరాశివలె వెలుగొందుచు, బలగరిష్టుడై యవ్వనదశలో నేటికి మరల నాకనులవిందు ఒనర్చుచున్నవాడు. వీనిని కని దూరము చేసుకున్న నేను వ్యర్థుడను. దొరికిన పెన్నిధిని ఔదల దాల్చి మనః ప్రాణములు ధారపోయుచు పెంచుకున్న ఆచార్య రుద్రజియ్యరు, అతని సతీలలామ దాక్షాయణి, భగవదనుగ్రహ సంపన్నులు. జన్మసార్థక పరచుకొనినవారు. అయినను ఇటువంటి తేజోరాశి రాజ్యరక్షణకు వుండగా నేను వీని చేతిలో నుడసిన మాత్రమేమి? నా అనంతరము ఈ విశాలరాజ్యమును సర్వతో భద్రముగా కాపాడగల మేటివీరుడు కనులముందుండగా నాకు చింత ఏమిటికి? నేనిక నిశ్చింతగా నుండ వచ్చును. పెన్నిధి నెదుట పెట్టుకుని వూర్తంతయు వెదికిన వెంగళినైతిని. నేనింక మరణించినను నష్టములేదు. భగవంతుడీనాటికైనను నా కన్నులు తెరిపించినాడు. ఇక నా జన్మ తరించినట్లే. కుమారుడు లేవకముందే స్వామివారిని దర్శించి పోగలను. **ము**ందు కార్యము జరుపవలెను.

[అరుపులు—దొంగ, దొంగ]

రు. దే. : ''వేళకాని వేళ క్రుమ్మువలె ఆలయ ప్రవేశము చేయుచున్నాడవా'' అని పొడుచును.

ప్రో. రా. : అబ్బా! రుద్రా! ఎంత పోటు పొడిచినావు నాయనా.

రు. దే. : అయ్యో! దారుణము. మహారాజా తమరా. (జనుల అరుపులు) ఎంతటి ఘాతుకము జరిగినది. మహారాజు హత్యచేయబడినాడు. ఓరీ నగర రక్షకులారా రండు. జన్నిగదేవా, క్షణములో వైద్యుని కొని రమ్ము. మారన, అన్నమయ్య, శివదేవయ్యా, అమాత్యులవారిని, చమూపతులను, గురువులను, ఆచార్యులను కొనిరండు. (విలపించుచు) ''అయ్యో ఎంతటి అకృత్యమును చేసితిని? నన్ను తండ్రివలె కాచిన మహారాజునే చేజేతులా పొడిచితినే. నా పాపమునకు ప్రాయశ్చిత్తములేదు. ప్రభూ, నన్ను కన్నులు పొడిపించి చంపుడు. కన్నులున్న గుడ్డినైనందుకదే తగిన శిక్ష. ప్రభువులనే కాననైతిని. చోరుడనుకొంటిని. నా కాలు చేతులు ఖండింప నాజ్ఞనిండు. నన్ను ఖండ ఖండములుగా చీల్చి కాకులకు గద్దలకు వైవ ఆనతిండు ప్రభూ. అటుల మిన్నక చూతురేల మహారాజా. ఈ పాపిని ఏ తీరున శిక్షించిన బాగుగాయుండునని ఆలోచించుచున్నారా? ఏమిచేసినను నాకు శిక్షచాలదు ప్రభూ. ఇంత దారుణము జరిగిన వెనుక నేను ప్రాణములతో నిలువజాలను.

తమ మొలనున్న కైజారుతో పొడువుడు ప్రభూ. లేనిచో నేనే పొడుచుకొందును'' అని కైజారు తీసికొనబోవును.

ప్రో. రా. : నాయనా కుమారా, రుద్రా. ఆగుము, నాయనా. అదుగో, హాహాకారములు చేయుచు అందరు వచ్చుచున్నారు. భద్రా, ముఖ్యులందరిని నిశ్శబ్దముగా ఇచట కూర్చుండబెట్టుము. వచ్చితిరా గురువర్యా. అమాత్య, చమూపతులారా అందరూ ఆశీనులుకండు.

అందరూ : ప్రభూ ఎంత ఘోరము, ఎంత దారుణము జ...

రు. దే. : ప్రభూ నాకీ కైజారు అనుగ్రహింపుము. లేనిచో ఈ రాతి స్తంభమునకు నా తల కొట్టుకొనియెద (అని కొట్టుకొనును) (వారింతురు) చమూపతీ, ఆ నిశిత కరవాలముతో నన్ను చిత్రవధ కావింపుము. ప్రభూ, నన్ను శిక్షించుటకు ఏ శిక్షయును చాల దనుకొనుచున్నారా?

అందరూ అతనిని వారింతురు.

ప్రో. రా. : కుమారా రుద్రా. ఇంకనూ ప్రభూ, రాజా అనే అనుచున్నావా తండ్రీ. ఒక్కసారి నాయనా, తండ్రీ అనలేవా? శిక్షించవలసినది నిన్నుకాదు నాయనా, నే చేసిన మహాపరాధమునకు నాకు భగవంతుడే తగిన శిక్ష వేసినాడు. కుమారా ఒక్కసారి నన్ను తండ్రీ, నాయనా అనుము.

రు. దే. : మహారాజా!

ప్రో. రా. : మరల మరల ఆ పిలుపుతోనే నన్ను కోత పెట్టుచుంటివి నాయనా. నువ్వు భుజములో దింపిన ఈ కత్తికన్న ''మహారాజా'', ''ప్రభూ'' అన్న నీ పిలుపులే ఈటెలై బాధించుచున్నవి. (అనుచు కనుల నీరు తుడుచుకొనుచుండును.)

అందరు : మహారాజా శాంతింపుడు. వైద్యశిరోమణి ఇదే వచ్చుచున్నాడు. మిమ్ములను సేదదీర్చగలడు.

ప్రో. రా. : నన్నింక ఎవరు సేద దీర్చగలరు? మాన్యులారా నన్ను సేదదీర్చి తరింపచేయగలవాడు ఒక్కడే యున్నాడు. నే నతని చెంతనే సేదదీరుచున్నాను. నాయనా రుద్రా. ఒక్కసారి నాన్నా అని పిలువుము బాబూ.

రు. దే. : నాన్నా...తండ్రీ.. మీరు నా జనకులా? ఇది కల కాదు కదా?...

ప్రో. రా. : ఔను కుమారా ఔను. గురువర్యా, అమాత్యా, చమూపతులారా, ప్రజలారా అందరునూ సావధానులై వినమని ఆజ్ఞ.

రుద్రకుమారా నీవు నా పుత్రుడవే బాబు. నేను నీ జనక తండ్రిని. (రుద్రుడు తండ్రీ అనుచు అవిరళముగా దుఃఖించును. రాజు కన్నుల ఆనంద బాష్పములు దొరలుచున్నను, ముఖము దివ్యానందముతో వెలుగొందుచుండును. మాట పెగలక డగ్గుత్తి పడును.)

తెర విరామం

దామార. : ప్రభువుల ఆజ్ఞ అయినచో తరువాతది నేను తెలియచేసెదగాక. ప్రభువులు చెప్పిన దంతయు యథార్థమే. అంతయు, నా మాట పాటించి చేసిన పనియే. ఈ దోషములో పాలు నాకే ఎక్కువ అనిపించు చున్నది. కుమారుల జనన వృత్తాంతము వినినంతనే ప్రభువులు చిరంజీవి జన్మించిన వేళా విశేషములను పరిశీలించి, జననకాల నక్షత్రములను గుణించి, ఘడియలు, విఘడియలు లెక్కించ పండితులకాజ్ఞ నొసగిరి. అన్నియు నిశితముగా మరల మరల పరికించిన వారు విపరీతమైన ఆందోళన చెందిరి. యువ రాజుల జాతక చక్రము లిఖించమని చెప్పిన రాజాజ్ఞను ఎట్లు అమలు జరుపుటయో తెలియక కొట్టుమిట్లాడి, చివరకు, నన్నాశ్రయించిరి. ఆ విజ్ఞాన నిధులు చెప్పినది— ఈ కుమారులు తండ్రి హత్యా పాతకమునకు గడం గుదురనియే. దాని నివారణము కొరకై వారు చేయ కలిగినది ఏమియు లేకపోవుటచే, ప్రభువుల ముందు నిలువ జంకిరి. ఆ సమయమున నేనే సాహసించి

ప్రభువులకీ వార్త నెరింగించి, శిశువును అంత మొందింప వలసినదని ప్రభువులితో విన్నవించితిని. కాని ఎప్పుడో కుమారుడు చంపునని తెలిసినంత మాత్రమున తాము కుమారుని చంపజాలమని ప్రభువులనిరి.

రు. ద్రే. : తండ్రీ నన్నానాడే వధించియుండినచో నేడీ పితృ హత్యా దోషము నాకు కలిగెడిది కాదుగదా. నేను పితృ హంతకుడను కానుగద (అని దుఃఖించును)

ప్రో. రా. : కుమారా! నీ వంటి కుమారుని చంపుకొను మూర్ఖుడెందైన నుండునా ? రుద్రా నీవే నా సర్వస్వము నాయనా గురువర్యా కానిండు.

రామా. : ప్రభువులు శిశుహత్య చేయనిరాకరించగా కర్తవ్యము తోచక ఆలయ ముఖమంటపమున విడనాడి వచ్చుట కెట్లో ఒప్పించ కలిగితిని మహారాణి ముప్ప మాంబను ఓదార్చ శక్యము కాలేదు. కాని తప్పని సరియగు పరిస్థితులకు, రాజాజ్ఞకు తలవొగ్గి, పతి మాటకు ఒడంబడినది. తత్‌ఫలితమే రోజైనను నిండని పసిగుడ్డు రుద్రేశ్వరుడు ముఖమంటపములో వెలయుట. అప్పటినుండియు మీకు తెలిసినదే కదా. ఆ బాలుని, రుద్రుని వరప్రసాదముగా, తపః ఫలముగా ఎంచి, ఆచార్య రుద్రజియ్యరు, వారి సతీమణి ఔదల నిడుకొని పెంచినారు. ఆ పసికందే నేటి ఈ రుద్రదేవ కుమారులు. దీనికి ఇచట చేరిన ఈ పెద్దలందరు సాక్షులు.

పెద్దలు : ఔను అంతయు యధార్థమే.

రు. దే. : హా తండ్రీ! ఎంతటి నీచుడను. తుదకు కార్తాంతి కుల మాటనే యధార్థము చేసితిని కదా. నన్నానాడే ఏల చంపవైతివి తండ్రీ ?

ప్రో. రా. : నాయనా రుద్రా ! నిన్ను చంపుటయా ? కళ్ళు తెరువని పసికందుని నిర్దాక్షిణ్యముగా విడనాడి నందులకే భగవంతుడు ఈ తీరున శిక్ష అమలు జరిపినాడయ్యా. అంతియే. నీవు చింతించవలదు. ఏ రుద్రుని నేను షట్కాలములోనూ నియమము తప్పక నిష్ఠతో కొలిచి యున్నానో అతడే నాకు మరల దయచూపినాడు. నన్ను చల్లని దృక్కుల చూసినాడు. నిన్నూ, నన్నూ ఈ విధముగా ఏకము చేసినాడు. రుద్రా, నా జన్మ ధన్యమైనది కుమారా.

ఈ సమయములో ప్రజలు వుద్రిక్తులై, దోషిని విచారించ వలసినదని కోరుట మీకు తెలిసినదేకదా. దానిపై ధర్మాసన మేర్పాటు చేయుట మీరెరిగినదే. అంతయు ఎరిగిన మీరిపుడు న్యాయము చెప్పుడు.

ఇందులో దోషి ఎవరు ?

నేనా ? విధిని ఎదిరించు ప్రయత్నములో పధమసంతానము, న్యాయముగా నా తదనంతరము సింహాసన మధిష్ఠించి రాజ్యము చేయవలసిన యువరాజును విసర్జించిన నేను శిక్షార్హుడనా ? క్షంతవ్యుడనా ? చెప్పుడు. ఆచార్య రుద్రజియ్యరుకు దొరకగా నాకు చూపబడిన ఆ పసికందును ఏమీ తెలియనట్లు అతని కందచేసిన నేను దోషినా ? బాలునిపై వ్యామోహము తెంచుకొనలేక; బహిరంగ పరచలేక సతమత మవుచూ, వాని విద్యాభివృద్ధులలో, పెంపులో జోక్యము కలగ చేసికొనుచు, వానిని అహర్నిశలూ కని పెట్టుచునే వున్న నేను శిక్షార్హుడను కానా ? పలుకరేమి ? ఆ రుద్రుడు అందరిలోను వీరాగ్రగణ్యుడని ఎరిగి పరవశించుచు వానికి అంత పిన్న వయసులోనే స్వర్శవేది లింగని రక్షకునిగా అంతటి గురుతర బాధ్యత అప్పచెప్పిన నేను దోషిని కానా ? చివరకు అర్ధరాత్రమున అందరను వారించి నేనొక్కరుడ ఆలయ ప్రవేశను చేయుట దోషము కాదా ?

నా తదనంతరము ప్రభువగుటకు రోగ గస్తుడు,కోపిష్ఠి, ఆత్మనిగ్రహములేని మహదేవరాజు తగిన వాడు కాడని దిగులంది, చిట్ట చివరకు నా ప్రాణము పోయినను సరియని తలంచి ఈ కాకతీయ రాజ్యరమను సుస్థిరము చేయుటకుగాను రుద్రుని వెదకుచు ఆలయమునకు వెళ్లిన నా ఆశయమునకు అర్థమేమి ? ఈ రాజ్యమును రుద్రుని హస్తగతముచేసి వానిని మీకు కాగల ఏలికను చేయ సంకల్పించిన నా మనోరథము తీరుట ఎట్లు ? నా లలాటలిఖితము జరగకయే అది ఎట్లు సిద్ధింపగలదు ? అర్ధరాత్రమున నన్ను జూచి రుద్రదేవుడు దొంగ అనుకొని ఆయుధము ఎత్తుట దోషమా ?

మ. దే. రా. : (ఆగ్రహావేశముతో) కాదా ? అప్రమత్తతతో కాపాడవలసిన దేవుని సన్నిధిలో, విధి నిర్వహణము మరిచి నిద్రించుట దోషముకాదా ? మేల్కొని మహారాజునే కానక క్షతగాత్రులను చేయుట ఇంకను మహా నేరము. ఏమి ధర్మయ్యగారూ మాట్లాడరేమి ?

ప్రజలు : ఔను. సమాధానం చెప్పండి.

ధర్మయ్య : నిద్రించుట కొంతవరకు దోషమే. అహర్నిశలు రక్షణ చేయవలసిన వ్యక్తి ఏదో ఒక సమయమున నిద్రించక తప్పదు కదా ? నిద్ర, ఆహారము మనుష్యునకు తప్పని సరైనవే కదా.

మ. దే. రా. : (తొందరపాటుతో) అయినచో చోరులు వచ్చి అపహరించు కొనిపోయినను తప్పులేదా ?

ధర్మయ్య : అందులకే గద మహారాజులు సహితము గాయ పడవలసి వచ్చినది ?

ప్రో. రా. : కనుక నా ప్రజలనే నే కోరుచున్నాను తీర్పు చెప్పుడని: నన్ను మించిన శౌర్య రాసిని యువరాజుని చేసి నేను నిశ్చింతగా విశ్రమించ దలచినాను. నా

నా పాపానికి ప్రాయశ్చిత్తముగా ఇదొక్కటే మార్గముగా నాకు కనబడుచున్నది. ఇంక తుది నిర్ణయము మీదే.

(నిశ్శబ్దము)

ప్రో. రా. : ఏమి ఈ నిశ్శబ్దము ? మీ నిర్ణయము తెలుపుడు.

ప్రజలు : మహారాజుల నిర్ణయమే మా నిర్ణయము. జయము యువరాజు రుద్రదేవులకి జయము. (జయ జయ ధ్వానములు)

రు. దే. : అంతటి అపార కరుణకు నేను తగను తండ్రీ.

ప్రో. రా. : గురువర్యా, ఆచార్యులారా, దండనాయకులారా, అమాత్యులారా, ప్రజలారా అందరును శ్రద్ధగా వినుడు.

ఈ పరుసవేది లింగని సమక్షములో నా గురువులు, ఆచార్యులు, అనుచరుల ఎదుట నా జ్యేష్ఠ తనయుడైన కుమార రుద్రదేవుని యువరాజుగా ప్రకటించుచున్నాను. యువరాజు నా అనంతరము ఈ రాజ్యలక్ష్మిని ప్రాణప్రదముగా రక్షించి, పాలించగల మీ వీరప్రభువుగా, రాజుగా ప్రకటించుచున్నాను. నా రాజ ముద్రిక తీయుము ఆచార్యా, ఇదే రుద్ర కుమారుని అంగుళికి నా రాజ ముద్రికను తొడుగుచున్నాను. రాజఖడ్గమును, రాజ్యరమను ప్రజల రక్షణార్థము యువరాజుల చేతిలో పెట్టుచున్నాను. నా కిరీటమును రుద్రకుమారుని తల నలంకరింప చేయనున్నాను. ఈ క్షణమునుండియు మీరు ఈ వీరరుద్రుని బిడ్డలు, అనుచరులు, హితులు, ప్రాణములు. ఇంతకాలము నన్ను అనుగ్రహించి సేవించినట్లుగా ఈ రుద్రేశ్వరుని సేవించగలమని బాస చేయుడు.

అందరు : చిత్తము ప్రభూ. మీ ఆజ్ఞానుకర్తులమై యువ రాజ రుద్రేశ్వరులను వెన్నంటి అనుసరించగలము. వారే మా ఏలిక. మా ప్రాణము లొడ్డియైనను వారిని సేవించెదము. జై రుద్రేశ్వర ప్రభువులకుజై.

కాకతీయ రాజ్యరమా ధురంధరులకు జయము.
వీరప్రతాప రుద్ర ప్రభువులకు ,,
అనుమకొండ పురవరాధీశ్వరులకు ,,
పరమ మహేశ్వర జయము జయము
శ్రీ మన్మహా మండలేశ్వర ,, ,,

(తెర వెనుకనించి)

శ్రీ కాకతీయ ప్రోలరాజునకు జయము
ఉద్దండ మండలాగ్ర జయము ,,
సమధిగత పంచ మహా శబ్ద మహామండలేశ్వరులకు
జయము జయము.
చలమెత్తు గండ జయము జయము.
శ్రీ స్వయంభూదేవ దివ్యపాద పద్మా రాధక,
జయము జయము.
కాకత్య భూపాలకుల ప్రదీప జయము జయము.

# పిరికివాడు

## శ్రీ కె. అంజయ్య

కప్పు ఆవిర్లను
మననం చేసుకుంటున్న హృదయం
వాటిని ఖననం చేయడం
సహించక ఉరిపోసుకుంది.

కప్పు ఆవిరిలో
కట్టుబడిపోయిన చెమట జీవాలు
ఊపిరి బిగపట్టుకొని వణుకుతున్నాయి.
అయితేనేం ?

చుట్టూఉన్న చూపులకు జడిసి.
ఉరిపోసుకున్న హృదయంతో
కప్పును ఖాళీచేశా.

# ఇండియన్ కాఫీ ఇండస్ట్రీ

## ఇండియన్ కాఫీకి, పేరు, రుచి, ప్రత్యేకతలు, సారవంతమైన భూమి, వాతావరణము భారతీయ సంస్కృతినుండి లభించినది.

పశ్చిమ కనుమల చల్లని సానువులలో, తూర్పుగా వ్యాపించిన ప్రదేశములో, శ్రేష్ఠమైన కాఫీకి కావలసిన అనుకూల వాతావరణంలో ఇండియన్ కాఫీ పండించబడుతున్నది.

భారతదేశంలో కాఫీ 80,587 ఎస్టేట్సులో 1,71,535 హెక్టర్ల విస్తీర్ణముగల భూమిలో పండించబడుతోంది. ఇందులో 10 హెక్టర్లకంటే తక్కువ విస్తీర్ణముగల ఎస్టేట్లు 78,358 వరకు, 10 హెక్టర్లకు మించిన ఎస్టేట్లు 2,229 వరకు వున్నవి. ఈ ఎస్టేట్సులో రోజు 2,31,208 మంది దినకూలీలు పనిచేస్తూ వుంటారు.

భారత కాఫీ పరిశ్రమ అభివృద్ధికి, అభ్యున్నతికి కాఫీబోర్డు పనిచేస్తున్నది. కేంద్ర కాఫీ పరిశోధనాసంస్థ కర్నాటక రాష్ట్రంలోని, చిక్‌మగళూరుజిల్లా, బాలెహొన్నూరులో నెలకొల్పబడినది. శాస్త్రీయపద్ధతిలో కాఫీ ప్లాంటేషనులలో కాఫీ పంటను పండించడానికి రీసర్చి డిపార్టుమెంటు తోడ్పడుచున్నది.

### కాఫీ సాగు చేసే ప్రాంతం

| రాష్ట్రం | అరబికా (హెక్టార్లు) | రోబస్టా (హెక్టార్లు) | మొత్తం (హెక్టార్లు) |
|---|---|---|---|
| కర్నాటక | 68,966 | 32,710 | 1,01,676 |
| తమిళనాడు | 23,501 | 4,567 | 28,068 |
| కేరళ | 4,177 | 36,325 | 40,502 |
| ఆంధ్రప్రదేశ్ | 1,023 | — | 1,023 |
| అస్సాం | 174 | — | 174 |
| ఇతర రాష్ట్రములు : | | | |
| ఒరిస్సా, ప.బెంగాల్, అండమాన్స్, మధ్యప్రదేశ్ మరియు మహారాష్ట్ర (ప్రయోగాత్మక ప్లాంటేషన్లు) | 53 | 39 | 92 |
| | 97,894 | 73,641 | 1,71,535 |

భారతదేశంలో అత్యుత్తమమైన కాఫీపంట దిగుబడి లక్షటన్నులుగా అంచనా.

పండిన కాఫీని ప్రాసెస్‌చేసి, శుద్ధిచేయబడుతుంది. దేశంలో మొత్తం 31 కాఫీ క్యూరింగ్ సంస్థలు పనిచేస్తున్నాయి. దేశంలో శ్రేష్ఠమైన కాఫీ ఉత్పత్తికి యివి నిరంతరము శ్రమిస్తున్నవి. కాఫీపండ్లను జాగ్రత్తగా కోయుట, శాస్త్రీయపద్ధతిలో ప్రాసెస్ చేయుట, క్యూరింగ్ చేయుట, మొదలైనవి ప్రమాణాల ననుసరించి చేయడంద్వారా శ్రేష్ఠమైన కాఫీ ఉత్పత్తికి దోహదం చేస్తుంది.

1977–78లో కాఫీ ఎగుమతులుద్వారా 230 కోట్లు విలువైన విదేశమారకం మనదేశానికి లభించింది.

ప్రస్తుతం సాగుచేస్తున్న ప్రాంతాలలో హెచ్చు కాఫీ పంటకు, మరియు యితర ప్రాంతాలను కాఫీపంటకు అనువుగా మార్చడానికి, అంతర్జాతీయ మార్కెట్లలో కాఫీకిగల గిరాకిని, ఎగుమతులను దృష్టిలో వుంచుకొని కృషి జరుగుతోంది.

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

# మార్క్సు దృష్టిలో సాహిత్యం

"సమాజంలో ఉత్పత్తిద్వారా ఏర్పడే మానవ సంబంధాలకూ, భౌతికమైన ఉత్పత్తిశక్తులకూ పరిణామదశరీత్యా సంఘటితమైన వ్యవస్థ ఆర్థికవ్యవస్థ. ఇది పునాది. దీనిమీద న్యాయశాస్త్ర, రాజ్యాంగ నిర్మాణమూ, దాని తాలూకు సామాజిక చైతన్యనిర్దిష్ట స్వరూపాలూ ఏర్పడివుంటవి. భౌతిక జీవనోత్పాదకమైన విధానమే సామాజిక, రాజకీయ, విజ్ఞాన జీవితక్రమాన్ని నియమిస్తుంది. మనుష్యుల చైతన్యంకాదు వారి సత్తాను నిర్ణయించేది; వారి సామాజిక సత్తాయే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. భౌతికమైన ఉత్పత్తిశక్తులు ఒక పరిణామదశలో అప్పటికే ఏర్పడివున్న ఉత్పత్తి సంబంధాలతో (అంటే ఆస్తిపాస్తుల తాలూకు సంబంధాలతో) ఘర్షణ పడటం ప్రారంభమౌతుంది. ఉత్పత్తి శక్తుల పరిణామానికి దోహదం చేసే బదులు ఈ సంబంధాలు వాటికి సంకెళ్లుగా మారుతవి. అప్పుడు సామాజిక విప్లవం ప్రారంభమౌతుంది. ఆర్థిక వ్యవస్థ అనే పునాది మారడంతో దానిమీది బృహన్నిర్మాణం యావత్తూ యించుమించు త్వరితంగా మారిపోతుంది. ఈ మార్పులను అవగాహన చేసుకోవడంలో ఒక ముఖ్యమైన తేడాను గమనించాలి. ఉత్పత్తియొక్క ఆర్థిక పరిస్థితుల్లో కలిగే భౌతికమైన మార్పుని ప్రకృతి శాస్త్రంలాగే స్పష్టంగా నిర్ధారణ చేయవచ్చు. కాని న్యాయశాస్త్ర, రాజ్యాంగ, మత, దర్శన శాస్త్ర, కళా సంబంధమైన — అంటే భావసంబంధమైన — మార్పుల విషయం అలాకాదు. వాటిద్వారా మనుష్యుల్లో ఘర్షణను గూర్చిన చైతన్యం అభివ్యక్తమై వాళ్లు పోరాటాన్ని సాగిస్తారు'' [1] అన్నాడు మార్క్సు. ఇక్కడ ఆర్థికవ్యవస్థ 'పునాది'; సాంస్కృతిక స్వరూపము 'నిర్మాణము'గా అభివర్ణింపబడింది. పునాదిగా అభివర్ణింపబడటంతో ఆర్థిక వ్యవస్థ ఒక్కటే విప్లవాన్ని నిర్ణయిస్తుందనే వ్యాఖ్యానాన్ని, అపోహగా ఎంగెల్స్ తిరస్కరించాడు. ఒకలేఖలో 1890లో ఎంగెల్స్ యిలా వివరించాడు: 'చరిత్రను భౌతికవాదం దృష్ట్యా వీక్షించడంలో, చరిత్రలో చివరకు పరిణామాన్ని నిర్ణయించేది ఉత్పత్తి దానితాలూకు జీవితవాస్తవికత అనడమే తప్ప, అంతకంటే మార్క్సుగాని నేనుగాని చెప్పలేదు. ఆర్థికవ్యవస్థను ఒక్కదాన్నే నిర్ణయశక్తిగా ఎవరైనా వక్రభాష్యం చెబితే అది సిద్ధాంతాన్ని అర్థరహితం చెయ్యడమే అవుతుంది. ఆర్థిక పరిస్థితి 'భూమిక' అవడం సరే, కాని 'నిర్మాణం' తాలూకు అంశాలు — వర్గ సంఘర్షణల రాజకీయాలు, విజేతయైన వర్గం ఏర్పరిచే రాజ్యాంగం న్యాయవిచారణా మార్గాలూ, వీటి తాలూకు ఘర్షణలు ఆయా మనుష్యుల బుర్రల్లో కలిగించే సంచలనాలూ, రాజకీయ దార్శనిక సిద్ధాంతాలూ, మతాభి

ప్రభావితం చెయ్యడమేకాదు, చాలాసార్లు దాని స్వరూపాన్ని నిర్ణయించడంలో ప్రధానంగా పైచెయ్యిగా వుంటాయి. ఈ అన్నిటియొక్క సంకుల సమరం ఫలితంగానే (ఈ శక్తుల, సంఘటనల పరస్పర సంబంధం అంచనా వెయ్యడం అసాధ్యం) చివరకు ఆర్థికమైన ఉద్యమం తన విజయాన్ని సాధిస్తుంది. అది అలా కాకపోతే, సిద్ధాంతాన్ని చరిత్ర సన్నివేశానికి అన్వయించడం గణితంలో సామాన్య సమీకరణం లెక్క చేసినంత సులువుగా వుండేది.'' [2]

చరిత్ర గతిలో ఆధారభూతమైన శక్తులు ఆర్థికశక్తులే అయినా విప్లవంలో రాజకీయాలకూ, సాంస్కృతిక సాహిత్యోద్యమాలకూ ప్రధానపాత్రే వున్నది అనడం మార్క్సు దర్శనం. ఇందులో ఆర్థిక శక్తుల పరిణామ స్వరూపం గోచరించినంత నిర్ధారణగా, శాస్త్రీయంగా, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్యోద్యమాల స్వరూపం, వాటి దారితెన్నులూ గోచరించవు. గమనించవలసింది ఏమిటంటే ఇక్కడ రాజకీయవాదీ, సాహిత్యకారుడూ మేధావులుగా సమానమే తప్ప రాజకీయవాదికి సాహిత్యకారునికి లేని దివ్యదృష్టి ప్రత్యేకంగా మార్క్సు దర్శనం ప్రసాదించడంలేదు. సామాజిక చైతన్యంలో విప్లవ సృజనశక్తి అభివ్యక్తమయ్యే రంగభూమి రాజకీయవాది బుర్రే కానక్కరలేదు. రచయితా అందుకు అర్హుడే!

ఉత్పత్తి సాధనాలను కైవసం చేసుకోవడంద్వారా పార్టీ నియంతృత్వంద్వారా, ఆర్థిక వ్యవస్థలో మార్పుల్ని తీసుకువచ్చే బాధ్యత రాజకీయవాదులైన మేము వహిస్తున్నాను కాబట్టి, సాహిత్య ఉత్పత్తికి సాధనాలైన రచయితలను గూడా కైవసం చేసుకుని వారిని నియంత్రించడంద్వారా సాంస్కృతిక ('నిర్మాణం'లో) విప్లవం తీసుకు వస్తామంటే కుదరదు. స్టాలిన్ రష్యాలోనూ, మావో చైనాలోనూ ఈ ప్రయత్నం చేశారు. ఫలితం ఈనాడు అందరికీ విదితమే!

సాహిత్యమూ, మార్క్సిస్టు దర్శనసూత్రాల కవిలెకట్ట (ideology) రెండూ ఒకటే, రెండింటికి అభేదమే అంటే అది మార్క్సు దర్శనానికి విరుద్ధమే అవుతుంది! ఆ అభిప్రాయంతో రచనలుచేసి మెప్పు సంపాదించటానికి ప్రయత్నించిన తొత్తు రచయితల్ని గూర్చి ఎంగెల్స్ ఏమన్నాడో చూడండి: ''చిల్లర రచయితలకు యిదో పెద్ద అలవాటైపోయింది. ప్రజ్ఞ లేకపోవడాన్ని దాచిపెట్టుకుంటూ, రాజకీయాలనుగూర్చి ఉల్లేఖిస్తుండడం, యిది కేవలం ఆకర్షించే ప్రయత్నం. కవిత్వము, నవలలు, సమీక్షలు, నాటకాలూ, సాహిత్యమంతా యిలా 'గాలివాటు' (tendency) రచనగా తయారైపోయింది...'' ''ప్రతిభలేని వెధవ ఒకడు, తన విశ్వాసాన్ని ప్రకటిస్తూ, సొంతడబ్బా వాయించడంలో మరీ శ్రుతి మీరి

యితలు తెలుగులో మనకూ ఉన్నారంటే మనం ఆశ్చర్యపడనక్కర లేదు! చరిత్ర పునరావృతమౌతూ వుంటుంది దేశ కాలాల్నిబట్టి.

సోషలిస్ట్ విశ్వాసాల్ని వర్ణించడమే సాహిత్యం కాదంటూ మార్క్స్ 'సామాజిక స్పృహ' వున్న రచయితలుగా ఫ్రెంచిరచయిత బాల్జాక్‌నీ, ఆంగ్లనవలా రచయితలు డికెన్స్, థాకరే, బ్రాంటేవంటి వారినీ ఉగ్గడించాడు. "నేటి ఇంగ్లీషు నవలా రచయితల పుటల్లో ధారాశుద్ధిగల శైలిలో కన్నులకు రూపుకట్టేవిధంగా ఎన్నో రాజకీయ, సామాజిక సత్యాలు ప్రపంచానికి ఆవిష్కరింపబడ్డాయి. రాజకీయవాదులూ, ప్రచారకులూ, నీతిబోధకులూ అందరూ కలిసి కట్టుగా సాధించలేని కార్యం వీరు సాధించారు" అన్నాడు మార్క్స్ [4]

'ఫ్రాంజ్ వాన్ సికెంగెన్' అనే నాటకాన్ని మార్క్స్ ఎంగెల్స్‌లు సుదీర్ఘంగా సునిశితంగా చర్చించడం చూస్తే ఒకనాటి చారిత్రక–సామాజిక సంక్షోభాన్ని అవగాహన చేసుకునేందుకు సాహిత్యం ఎలా వుపయోగిస్తుందో బోధపడుతుంది. అటువంటి విలువా, సామాజిక స్ఫూర్తీ సోషలిస్టు సిద్ధాంతాన్ని వర్ణిస్తూ ప్రచార సాధనంగా సృష్టించే సాహిత్యానికిరాదు.

ఇక్కడే రచయితయొక్క 'నిబద్ధత' (Commitment)ను గూర్చి సరియైన అవగాహన అవసరం అవుతుంది. సార్త్రే అంటాడు: "సాహిత్యము (రచయితకు) సర్వస్వమూ కాకపోతే అది ఎందుకూ కొరగాదు. కమిట్‌మెంట్‌కి నేనిచ్చే అర్థం యిదే." [5] "దాన్ని అమాయకత్వానికి; పాఠకూ దిగజారిస్తే నశిస్తుంది. వ్రాసినవాక్యం, మనిషీ – సమాజమూ అన్ని స్థాయిలలోనూ ప్రతిశబ్దించకపోతే దానికి అర్థం శూన్యం. ఒకయుగం సాహిత్యమంటే ఏమిటి? యుగాన్ని తన సొంతంచేసుకున్న సాహిత్యమన్నమాట. రచయితలు అర్థాన్ని సృష్టిస్తూ (సామాజిక సత్యాన్ని) ఆవిష్కరిస్తారు, నిరూపిస్తారు, నివేదిస్తారు. తర్వాత జనం ఒకరి మొహం ఒకరు చూసుకుని కార్యోన్ముఖులు కావచ్చును." [6]

మార్క్స్ అభిప్రాయాలు సాహిత్యాన్ని గూర్చియిలావున్నా, ఆచరణలో రష్యాలోనూ చైనాలోనూ భిన్నంగానే జరిగింది. "రచయిత తన భావాల మేరకు సృష్టించవచ్చు ఏ నిబంధనా లేకుండా" అని లెనిన్ మొదట అన్నప్పటికీ, రష్యన్ విప్లవ సమయంలో అదే లెనిన్, సంస్కృతిపరంగా రచయిత "అయోమయంగా ఏవైపుకంటే ఆ వైపుకి లాగటానికి వీల్లేదని" అన్నాడు. [7] అక్కడినుంచీ ప్రారంభమైంది రచయిత దాస్యం. క్రమంగా రచయితయొక్క 'కమిట్‌మెంట్' 'మానవత' అనే ఆదర్శం నుంచి 'జనత' అనీ 'జనత' నుంచీ 'విప్లవం' అనీ, 'విప్లవం' నుంచి 'పార్టీ' అనీ, అక్కడినుంచి 'మారుచెందే పార్టీ నిర్దేశాలు' అనీ అలాసంకుచితమై పతనమైపోతూ వచ్చింది. స్టాలిన్ పరిపాలనలో యీ విషమ పరిస్థితి సాహిత్యాన్ని, కళారంగాన్నీ రాహువులా కప్పివేసింది. దీన్నిగూర్చి 1966లో సోవియట్ రచయితలు ఏమన్నారో చూడండి: "వ్యక్తిపూజ వలన కలిగిన దుష్ఫలితాల్లో ఒకటి - కళల్లో వైయక్తిక ప్రమాణాల్ని, సామాజిక ప్రమాణాల్ని యాంత్రికంగా (విచక్షణా రహితంగా) ఒకటి చేయ్యడం. దానికి సమర్థన యిలా వుండేది! ఆదర్శాల్లో రాజకీయాల్లో భావసమైక్యమూ, దృక్పథంలో ఏకత్వమూ సాధించాము. కాబట్టి మనకు కళా ప్రమాణాల్లోనూ ఒకటేవ్యవస్థ వుండాలి, కళాభినివేశం సర్వమూ ఏక ముఖంగానే రూపొందాలి అనడం కళాభిరుచులు సమాజంలోని సౌందర్యభావనల యొక్క అభివ్యక్తి కావడం నిజమే అయినా, వాస్తవంలో వైయక్తికమైన అభిరుచులన్నింటినీ ఒక సామాజిక కళాసూత్రంగా సంక్షిప్తం చెయ్యడం కానిపని ఏమంటే కళల్లో వ్యవస్థ ఒక్కటే అయినా అభిరుచుల వైవిధ్యం పుష్కలంగా ఉండటానికి వీలున్నది. ఈ వైవిధ్యం ఒక్కొక్క జాతిని బట్టీ, మనస్తత్వాన్నిబట్టీ, వయోభేదాన్ని బట్టే వైయక్తికంగా వుత్పన్నమౌతుంది... అందుకే కళాభిరుచులూ, హృదయ ప్రేరణలు ఒకే ప్రమాణానికి కట్టుబడి ఉండాలన్న నిర్దేశాన్ని మేము నిరాకరిస్తాము." [8]

స్టాలిన్ తర్వాత రష్యాలో, కళలూ, సాహిత్యమూ, వైవిధ్యంతో వైయక్తికాభిరుచులతో వికాసం చెందాలి అన్న గుర్తింపు ఏర్పడినా, రచయితకు మాత్రం సామాజికునిగా (as a social being) ఉండవలసిన స్వతంత్ర ప్రతిపత్తి లభించలేదనే తెలుస్తోంది. సోవియట్ రచయిత లేమంటున్నారో చూడండి: "మార్క్సిస్ట్ – లెనినిస్ట్ దృక్పథం కళాభిరుచిలో వైయక్తికమైన అంశను గుర్తిస్తుంది. కాని దాన్ని కేవలం ఆత్మాశ్రయమైన దానిగా అంగీకరించదు. సమాజంలో అభిరుచుల వైవిధ్యానికి కూడా ఒక స్పష్టమైన కళావ్యవస్థ, ఆదర్శాలు (ideology) ఆధారమనీ తద్వారా అందులో ఒక ఏకత్వంకూడా వుంటుందనీ నొక్కిచెబుతుందీ దృక్పథం. అభిరుచులలో వైవిధ్యం సరేగాని, ఏదంటే అది కుదరదు అనడమే యీ నిర్దిష్ట దృక్పథం." [9] ఈ నిర్దిష్ట దృక్పథం పరిధిలోకి ఏ అభిరుచి వస్తుందో ఏదిరాదో నిర్ణయించే అధికారం ఎవరిది? అది రాజకీయవాదికి కాకుండా మొత్తం సమాజానికి వుండాలనే యిక్కడ మనవి చేయడం. అప్పుడే అది సరియైన మార్క్స్ దృక్పథం అవుతుంది.

మార్క్స్ దర్శనంలో వ్యక్తికీ రచయితకూ నిర్దిష్టమైన ప్రతిపత్తివున్నా, దాన్ని గూర్చి మార్క్సిస్ట్ రాజకీయవాదులు వక్రభాష్యం పలుకుతూ, భావవాద సంప్రదాయంలో వ్యక్తికీ – సమాజానికీ గల వైరుధ్యాన్నే పునశ్చరణం చేస్తూ వచ్చారు. సమాజవాదం అంటే వ్యక్తిని కొన్నిసూత్రాలమేరకు సమాజానికి తొత్తుగా లొంగదీసుకోవడమేననే అపోహ కల్పిస్తూ రావడం, మార్క్స్ దర్శనమంటే మేధావుల్లో రచయితల్లో భయమూ, వైముఖ్యమూ ఏర్పడటానికి కారణమైంది. మార్క్స్ దర్శనంలో "వ్యక్తి"ని గూర్చిన తాత్త్విక వివరణ (metaphysical description) ను అర్థం చేసుకుంటే యీ అపోహలు అదృశ్యమౌతవి. ఆ వివరణ వైపు యిప్పుడు దృష్టి మళ్లిద్దాం.

మార్క్స్ దర్శనం గతి తార్కిక భౌతికవాదం (Dialectical Materialism.)

దీనికీ, అంతకు పూర్వం ప్రచారం పొందిన భౌతికవాదానికీ, మౌలికంగా చాలా భేదమున్నది. భౌతిక ద్రవ్యము (Physical

matter) చరమ సత్యమె అయినా అది నిత్య పరిణామశీల మనీ, దాన్ని పరిణామం ద్వారానే చైతన్యవంతంగానే, అవగాహన చేసుకోవాలనీ చెబుతుంది. గతి తార్కిక భౌతిక వాదం. ''ఇంతవరకూ వచ్చిన భౌతిక వాదాలలో ప్రధానమైన లోపం ఏమిటంటే — విషయము, (object) సత్యము అంటే మనం యింద్రియాలద్వారా గ్రహించేది.'' అది కేవలం దృశ్యవిషయంగా యథారూపంలోనే అర్థం చేసుకుంటున్నాము. దాన్ని సేంద్రియమానవ చైతన్యంగా, వ్యవహారంగా తీసుకోవడంలేదు. అంటే 'విషయి'(subject) పరంగా తీసుకోవడం లేదు. అందువల్లనే భౌతిక వాదానికి ప్రతిద్వంద్విగా, చైతన్యవంతమైన భాగాన్ని ఒక అమూర్త వస్తువు (abstraction ) చేసి భావవాదం పెంపొందించడం జరిగింది — దానికీ సేంద్రియ చైతన్యం యొక్క యథా స్వరూపం తెలియదు.''[10] ఇలా 'విషయి — విషయము' అనే ద్వంద్వాన్ని అధిగమించే తాత్త్విక భూమిక మీద ఏర్పడింది — మార్క్సు ప్రవచించిన భౌతిక వాదం. సమాజానికీ - వ్యక్తికీ గల సంబంధం పరిణామ శీలమైనది. గతితార్కిక బద్ధమైనది. ''భాష''ను గూర్చి మార్క్సు దర్శనం ఏమి చెబుతుందో పరిశీలిస్తే మనం సులువుగా అర్థం చేసుకోవచ్చు దీన్ని.

''భాష, చైతన్యం అంతా ప్రాచీనమైనది. భాష వ్యావహారిక చైతన్యం. అంటే అది ఇతరులకు గ్రాహ్యమౌతున్నదిగాబట్టి వ్యక్తిగతంగా నాకూ గ్రాహ్యమౌతున్నది. భాష, చైతన్యంలాగే మనుష్యులు ఒకరితో నొకరు సాంగత్యం, సంబంధం నెరపవలసిన అవసరం నుంచీ, ఆవశ్యకతనుంచీ పుట్టుతున్నది.''[11] భాషకూ సామాజిక చెతన్యానికీ గల అభేదస్థితి అవగాహన చేసుకోవలసిన కీలకమైన విషయం మార్క్సు దర్శనంలో. (భావవాద సంప్రదాయచ్ఛాయలు అవగాహనకు అవరోధం. వాటినితొలగించుకొని చూడాలి). భాషలో శబ్దాలు సామాజిక వ్యవహారంలో ఉద్భవించినవి. అయినా వాటి అర్థవిన్యాసంలో వాటికి రెండు ముఖాలుంటవి. ఒకటి పూర్వప్రయోగంవల్ల సిద్ధించిన రూఢమైన అర్థం (నిఘంటువులోనిది). రెండోది, వ్యవహారంలో శబ్దాన్ని విలక్షణంగా, సృజనాత్మకంగా వ్యక్తి ప్రయోగించడంవల్ల భవిష్యత్తులో సిద్ధించే కొత్త అర్థం. మొదటిదాన్ని అనుసరించేవున్నా, వ్యవహారంలో సహజంగా సిద్ధించేదే అయినా, యీ రెండో అర్థాన్ని అది పుట్టక ముందే వూహించి నిఘంటువులో వ్రాయడం సాధ్యంకాదు గదా! కొత్త అర్థాన్ని సంతరించుకోవడానికి వీల్లేదంటూ శబ్దాన్ని నియమించడమే జరిగితే భాష స్తంభించి మృతప్రాయమే అవుతుంది. భాష సామాజిక చైతన్య స్ఫూర్తిని కోల్పోతుంది.[12]

ఈ కీలకాన్ని అర్థంచేసుకుంటే వ్యక్తి చైతన్యానికీ, సామాజిక చైతన్యానికీగల సంబంధం అర్థమౌతుంది. వ్యక్తిచైతన్యం సామాజిక చైతన్యంయొక్క అభివ్యక్తికీ, పరిణామానికీ రంగభూమి. తద్ద్వారా వ్యక్తి జీవిత సాఫల్యమూ అందులోనే యిమిడివుంటుంది. జీవభాషలో శబ్దానికి ఎటువంటి ప్రాధాన్యం వున్నదో, తాత్త్వికంగా సామాజిక చైతన్య పరివర్తనలో వ్యక్తి చైతన్యాని కటువంటి ప్రాధాన్యమే ఉన్నది.[13] వ్యక్తి—సమాజమూ చైతన్యంయొక్క రెండు ముఖాలు. ''సమాజం ఒక అమూర్త వస్తువుగా (as an abstraction) వ్యక్తి నెదుర్కొంటున్నట్లు ప్రతిపాదించడం మనం మానుకోవాలి. వ్యక్తి సామాజికుడు. అతని జీవితంయొక్క అభివ్యక్తి—సామాజికమైన అభివ్యక్తిగా, ఇతరులతోడి వ్యవహారంగా రూపొందక పోయినప్పటికీ తప్పకుండా అది సామాజిక జీవితం తాలూకు అభివ్యక్తే అవుతుంది. మనిషి విశిష్టత కలిగిన వ్యక్తి అయినప్పటికీ—అతనిలోని ప్రత్యేకతేగదా అతన్ని వ్యక్తిని చేస్తున్నదీ, వ్యక్తిగా విశిష్ట సామాజికుణ్ణి చేస్తున్నదీ—అతను సంపూర్ణుడే (శకలంకాదు). ఎందుకనగా సమాజం తాలూకు 'విషయి'గా దాని ఆలోచనకూ అనుభూతికీ నెలవుగా అతడు భావపూర్ణుడు (ideal whole) అవుతున్నాడు.''[14]

మానవుడు సామాజికుడు (Social being) అనడంలో ప్రతి వ్యక్తికీ సమాజంలో ''విషయి''గా కేంద్రస్థానాన్ని, భావస్వాతంత్ర్యాన్ని ప్రతిపాదిస్తున్నది మార్క్సు దర్శనం. అందువల్లనే మార్క్సిజం గొప్ప మానవతా దర్శనం అవుతున్నది. ఈ దర్శనానికి మార్క్సిస్టు రాజకీయవాదులూ, వారి పరివారమైన రచయితలూ వక్రభాష్యం చేస్తూనే వున్నారు. మానవుడు సమాజం అనే అమూర్త వస్తువుతో లీనం కావలసినవాడుగానూ, మందిలో ఒక శాల్తీగాను వ్యక్తిని మార్చి, పశుమార్చి వ్యవహరిస్తూవచ్చారు. ''సామాజికుడు'' అంటే కొన్ని నిశ్చిత ప్రమాణాలనూ, భావాలనూ, (రాజకీయవాది ఏర్పరచినవి) సామాజిక చైతన్య వ్యవస్థగా తీసుకుని ఆ పరిధిలో వ్యక్తిత్వాన్ని యిముడ్చుకునేవాడు (covective man) అని భాష్యం చేశారు.

వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యం తాలూకు విషయిగావడంవల్ల ఒక విశిష్టవ్యక్తి (రచయిత)యొక్క సృజనాత్మక కృషి సామాజిక చైతన్యం తాలూకు సృజనాభివ్యక్తే అవుతున్నది. (భాషా, సామాజిక చైతన్యమూ ఒక్కటే అయినందువల్ల భాష లేకుండా భావాలులేవు; వ్యక్తి అంతరంగంలోని తలంపులు కూడా సామాజిక చైతన్యంలోని భాగమే.) అయితే 'సృజన' ఏమిటి? కొత్త భావాలు ఎలా వస్తున్నవి? వ్యక్తికీ వ్యక్తికీ మధ్య భిన్నాభిప్రాయాలూ, అభిరుచుల వైవిధ్యం వీటి తత్త్వం ఏమిటి? సామాజిక చైతన్యం తాలూకు ''విషయి''గా వ్యక్తి స్థితినిబట్టి దృశ్యం భిన్నస్వరూపాలలో, పరిమాణాలలో కన్పించడంవల్ల భిన్నభావాలూ, సామాజిక చైతన్య పరిణామంవల్ల కొత్తభావాలూ ఉదయిస్తున్నవని సమాధానం. అన్ని కొత్త భావాలకూ విప్లవ గతిలో సార్థక్యంవుంటుందా? అంటే వుండదు; కాని ఆ విషయం సమాజమే, సామాజిక చైతన్య పరిణామమే నిర్ణయించి తేల్చివేస్తుంది. చరిత్ర గతిలో, రాజకీయవాదికి ప్రత్యేకమైన అధికారంలేదు యీ విషయంలో.

మార్క్సు గొప్ప మానవతావాది. విప్లవకారుడుగా, కమ్యూనిస్టు ఉద్యమ విజయంకోసం సాహిత్యాన్ని సాధనంగా నిర్దేశించినప్పటికీ, కాలాతీతమూ నిత్యనూతనమూ విశ్వజనీనమూ అయిన సృజనాత్మక సాహిత్యానికి ఆయన ప్రత్యేకస్థానం యిచ్చారు. హోమర్, షేక్స్పియర్, డాంటే, గెథే ఆయనకు అభిమాన రచయితలు. వారి కావ్యాలలోని మాటలూ, నుడులూ మార్క్సు వ్యాసంగంలో సర్వత్రా దర్శనమిస్తాయి. ''సామాజిక స్పృహ' కలిగిన సాహిత్యంగా డికెన్స్, థాకరే, బాల్జాక్‌వంటి రచయితల

[illegible] ...వ్వ దర్శం [illegible] ...వ్లవిస్టు రచయితలు; కాకపోయినా సరే ఉత్తమ సాహిత్య స్రష్టలుగానే పరిగణింపబడ్డారు ఆయన దృష్టిలో. విప్లవ భావాలను వెదజల్లే రచనలూ, సృజనాత్మకం కాకపోయినా, ప్రచార సాహిత్యంగా వాటి విలువను గుర్తించాడు మార్క్సు. పై మూడురకాల సాహిత్యాన్నీ విస్పష్టంగా వేరు వేరుగా దర్శించాడు మార్క్సు. మార్క్సిస్టులు యీ మూడు రకాల సాహిత్యాన్నీ ఒకే ప్రమాణంతో తమ రాజకీయాలకు పనికి వస్తుందా? రాదా? అన్న దృష్టితో చూసి మార్క్సు మానవతా వాదానికి అపచారం చేశారు.

కమ్యూనిస్టు మేనిఫెస్టోలో యిలా వున్నది: "మానవుని భావాలూ, అభిప్రాయాలూ, ఊహలూ—అంటే మానవ చైతన్యం అనేది భౌతిక పరిస్థితులతోబాటు మానవ సామాజిక సంబంధాల మార్పుతోబాటు మారుతూ వుంటుందనే అవగాహనకు లోతైన గ్రహణశక్తి ఏమీ అవసరంలేదు. భావాలు మారుతూ వచ్చిన చరిత్ర గతి చూస్తే భౌతికమైన ఉత్పాదనతో సరితూగుతూ భౌతిక ఉత్పాదన లక్షణం కూడా మారుతున్న వైనమే నిరూపణ అవుతున్నది. ఒక్కొక్క యుగంలో వైభవాన్నీ, ప్రాధాన్యాన్నీ గడించిన భావాలు ఆనాటి అధికార వర్గంయొక్క భావాలే గావడం ఎప్పుడూ వున్నవిషయమే."[15] ఆ చివరి వాక్యం ఆధారంగానే రాజకీయవాది రచయితనూ సాహిత్యవేత్తనూ తనకు లొంగి ప్రవర్తించమంటున్నాడు.

కాని కమ్యూనిస్టు మేనిఫెస్టోలో మార్క్సు ప్రధానంగా బూర్జువా రచయితల్ని గూర్చి ప్రస్తావిస్తున్నాడనటంలో సందేహం లేదు. "బూర్జువా వ్యవస్థ ప్రతి వృత్తినీ భ్రష్టంచేసి దాని సహజ మర్యాదనూ గౌరవాన్నీ మంటగలిపింది. వైద్యుణ్ణీ, న్యాయవాదినీ, మతాచార్యుణ్ణీ, కవినీ, శాస్త్రవేత్తనూ కూలివానిగా మార్చివేసింది ...తత్ఫలితంగానే జర్మనీలో సోషలిస్టు కమ్యూనిస్టు పేరు పెట్టుకొన్న ప్రచురణలు ఏవో కొన్ని తప్ప మిగిలినవన్నీ, కుళ్లిన నిర్జీవమైన సాహిత్యంక్రిందే వస్తాయి."[16] ఇక్కడ ఒక రచన సోషలిస్టు కమ్యూనిస్టు భావాలలో నిండివున్నదా, లేదా అని చూడటంలేదు మార్క్సు. అది బూర్జువా 'ఉత్పత్తి' క్రింద వస్తుందా, రాదా అనే చూస్తున్నాడు.

ఒక రచన బూర్జువా "ఉత్పత్తి" క్రింద ఎలా పరిగణింపబడుతుంది? దాన్ని మార్క్సు యిలా వివరిస్తాడు: "ఒక రచనే 'ఉత్పత్తి'గానూ, తద్భిన్నంగానూ కూడా వుండవచ్చు. మిల్టన్ 'పారడైజ్‌లాస్ట్' అయిదు పౌన్లకి వ్రాయడం అది ఆయన్ని 'ఉత్పత్తి' శ్రామికుణ్ణి చేయదు. పుస్తక విక్రేతకోసం కూలివాడుగా వ్రాసే రచయితే ఉత్పత్తి శ్రామికుడు. మిల్టన్ 'పారడైజ్ లాస్ట్' వ్రాశాడంటే అది పట్టుపురుగు పట్టును వుత్పత్తి చెయ్యడం వంటిది. అది అతని సహజధర్మం. ఫలితాన్ని అయిదు పౌన్లకి అమ్మితే అమ్మి వుండవచ్చు......తన పాటని తనుగా అమ్ముకునే గాయని చేస్తున్నదీ ఉత్పత్తి శ్రామికత్వంగాదు. ఒక వ్యాపారి ఆమెని నియమించి [illegible] ద్వారా డబ్బు సంపాదించడం ప్రారంభించగానే ఆమె వుత్పత్తి శ్రామికుల్లో చేరుతుంది. అప్పుడామె పెట్టుబడిని ఉత్పత్తి చేస్తున్నది."[17] మార్క్సు మానవతా దృక్పథాన్ని సరిగా అవగాహన చేసుకోవలసిన సందర్భం యిది. దీన్ని అవగాహన చేసుకోని రాజకీయవాది తను కమ్యూనిస్టునని చెప్పుకుంటూనే, రచయితని ఉత్పత్తి శ్రామికునిగా దిగజారుస్తూ అతని శక్తిని రాజకీయాలకు పెట్టుబడిగా మార్చే ప్రయత్నం చేస్తున్నాడన్న మాట.

కాల ప్రభావానికి లొంగని విశ్వజనీన సాహిత్యాన్ని గూర్చి, కళలను గూర్చి మార్క్సు యిలా చర్చించాడు: "కళల విషయం చూస్తే కొన్ని యుగాల్లో అవి చెందిన వికాసం, మానవ సమాజం యొక్క ఆనాటి అభివృద్ధి స్థాయి దృష్ట్యా చాల విపరీతంగానూ, అసంబద్ధంగానూ కనిపిస్తుంది. అంటే సమాజంయొక్క భౌతిక ప్రాతిపదికలో ఆనాటి సామాజిక సంవిధానం అనే అస్థిపంజరంతో పోసగని పరిమాణంతో ఆ కళల ఔన్నత్యం ఉంటున్నది. ఉదాహరణకు ఆధునిక రచయితలతో గ్రీకుల్నీ, షేక్స్పియర్నీ పోల్చండి. అంతే కాదు, కొన్ని ప్రక్రియలు "ఇతిహాసం" (ఎపిక్) వంటివి ఆ స్థాయిలో, ప్రపంచ చరిత్రలో గణనీయమైన స్థాయిలో, స్పృహణీయమైన ఆ స్వరూపంలో మళ్లీ ఉత్పత్తి చెయ్యడం అసాధ్యం అని కూడా గుర్తించక తప్పదు. అందువల్ల కళారంగంలో కొన్ని విశిష్ట రచనలు బహుశా సమాజ పరిణామంయొక్క తొలి పరిస్థితులలోనే సాధ్యమేమో అనిపిస్తుంది. కళారంగంలోనే యిలాంటి వైవిధ్యాలూ వాటి అంతర సంబంధాలూ నిర్ణయించడం కష్టమైతే, కళారంగం మొత్తాన్నీ తీసుకొని దానికీ సమాజ పురోగతికీ గల సంబంధాన్ని నిర్ణయించడం అసాధ్యం కావడంలో ఆశ్చర్యం లేదు. ఈ వైరుధ్యాలను సూత్రీకరించడమే కష్టం. వాటిని గుర్తిస్తే మనకు వివరణ లభించినట్లే."[18]

తన దర్శన సిద్ధాంతం ప్రకారం విశ్వజనీనమైన కళా సృష్టిని సూత్రీకరించడం కష్టమని అంగీకరించినా, మార్క్సు బూర్జువా వ్యవస్థదృష్ట్యా మానవుని సృజనశక్తిని గూర్చి ఆలోచించినప్పుడు మరొక వివరణను అందించాడు: "తొలియుగాల్లో మానవత్వం, జాతి, మత, రాజకీయ సంకుచిత పరిధుల్లో బందీయై ఉపలక్షింపబడినప్పటికీ, ఆనాటి 'ఉత్పత్తి'కి ధ్యేయం మానవుడే అయినట్లు కనిపిస్తుంది. ఆ స్థితి ఆధునిక ప్రపంచంతో పోలిస్తే ఉన్నతంగానే తోస్తుంది. ఇక్కడ మనిషి ధ్యేయం ఎంతసేపూ ఉత్పత్తి; ఉత్పత్తి ధ్యేయం సంపద (వెల్త్). బూర్జువా ముసుగు తొలగిస్తే "సంపద" అంటే ఏమిటి? వ్యక్తుల తాలూకు అవసరాలూ, సామర్థ్యాలూ, విలాసాలూ, ఉత్పత్తి శక్తులూ వగైరా. ప్రకృతి వనరులమీద మనుష్య ప్రకృతిమీద పెత్తనం సాగించడంలో అభివృద్ధి సాధించడమేనా? దీని అర్థం మానవ సృజన శక్తుల్ని ఎటువంటి ముందుచూపూ ఆలోచనా లేకుండా (గత చరిత్ర స్ఫురణ తప్ప) సాగదీసుకుంటూ పోవడమే. ఎటువంటి ప్రమాణం లేకుండా, దానికదే లక్ష్యం అనే ధోరణిలో తప్ప మరేమున్నది? ఒక నిర్దిష్ట స్వరూపం ధ్యేయంగా పెట్టుకొని మానవుడు పునఃసృష్టి కావడం బదులు, తన సర్వస్వాన్నీ ఉత్పత్తిగా మార్చడమే జరుగుతున్నది. ఈ బూర్జువా ఆర్థిక

వ్యవస్థలో, దీని తాలూకు ఉత్పత్తియుగంలో, మానవ అంతరిక శక్తియుక్తుల పూర్ణ విజృంభణ ఫలితం పూర్తిగా వట్టిపోవడమూ, ఖాళీఅయిపోవడమూ మనిషితాను వస్తువుగామారి ఆత్మప్రత్యాఖ్యానం పొందటమూ, లక్ష్యశుద్ధి కోల్పోయి తన స్వాతంత్ర్యాన్ని తనకుగాని లక్ష్యానికిబలిపెట్టడమూ, అందుచేత పాత ప్రపంచపు పసితనమే మన కంటే ఉన్నతంగా భావిస్తోంది. మరోవిధంగా చూస్తే ఆనాటి సృజన ఒక నిర్ణీత పరిధిలో, పరిణితి పొందిన ఆకృతిగా, స్వరూపంగా అన్నింటిలోనూ వ్యక్తం అవుతూ వుండడంవల్ల, అది నిజంగానే మనకంటే ఉన్నతస్థితి అవుతున్నది. ఆ ప్రాత లోకం ఒక సంకుచిత దృక్పథంనుంచీ మనిషికి పరితృప్తినిస్తుంది. ఈ ఆధునిక లోకం అటువంటిదేమీ యివ్వలేదు; ఎక్కడైనా తనలో తను తృప్తి పడినా ఆ అనుభవం అల్పమైనదిగానూ, అతి సాధారణమైనదిగానూ వుంటున్నది.''[19]

మానవుని పరిశ్రమ, సృజన అతనికి తృప్తినీ ఆనందాన్నీ యివ్వాలి. అది లోపించడమే బూర్జువా వ్యవస్థలో 'ఉత్పత్తి' లక్షణం అయి, మానవుడు తన శ్రమ తాలూకు ఫలితంనుంచీ అన్ని విధాలా వంచితుడౌతున్నాడు? మార్క్స్ ఏ వ్యవస్థలో కానీ 'సృజన'ను 'ఉత్పత్తి'గా పరిగణించడు దాన్ని మానవ సహజ ధర్మంగానూ, స్వేచ్ఛకు లక్షణంగానూ వర్ణిస్తాడు. ఆయన ఊహలో, కమ్యూనిస్ట్ వ్యవస్థలో 'స్వేచ్ఛ' దాని ఫలితమైన 'సృజన' పరాకాష్ఠ పొందుతవి. భౌతిక 'ఆవశ్యకతను' అధిగమించే మానవ స్వేచ్ఛ ప్రతియుగంలోనూ ఎంతో కొంత సాధ్యమే అయినా బూర్జువా వ్యవస్థలో దానికి అవకాశం అతి స్వల్పమనీ, కమ్యూనిస్ట్ వ్యవస్థలో అత్యధికమనీ మార్క్స్ భావనగా తోస్తుంది. 'కాపిటల్–3 భాగం'లో మార్క్స్ యిలా వ్రాశాడు.

''ఆవశ్యకత (నెసెసిటీ) నిర్దేశించే పరిశ్రమా, యితర ప్రాపంచిక నిర్బంధాలూ ముగిశాకే స్వేచ్ఛాలోకం ప్రారంభమౌతుంది. అందువల్ల సహజంగానే అది భౌతికమైన ఉత్పత్తి పరిధికి చెందదు. అనాగరక మానవుడు నైమిత్తికల కోసం ప్రకృతితో పెనుగులాడిన రీతిగానే, ఆధునిక మానవుడు సామాజిక వ్యూహంలో అన్నిరకాల ఉత్పత్తి విధానాల మధ్యన పెనుగులాడక తప్పదు నాగరకతతోబాటు వాంఛలూ, వాటితో భౌతిక ఆవశ్యకతా ఇతోధికంగా పెరుగుతూ వుంటాయి. వాంఛల్ని తీర్చేందుకు ఉత్పత్తి శక్తులూ పెరుగుతవి. అటువంటి పరిస్థితుల్లో స్వేచ్ఛా స్వరూపం ఏమిటి ? సామాజికులైన మానవులు ఒకరిమీద ఒకరు ఆధారపడిన వుత్పత్తి దారులుగా వుంటూ ప్రకృతితో తమ లావాదేవీలను హేతుబద్ధంగా నియమించుకొని, ప్రకృతి శక్తులకు గ్రుడ్డిగా లోబడి పోకుండా, ప్రకృతిని ఉమ్మడిగా అదుపులోనికి తెచ్చుకొని మానవశక్తి వ్యయం చాల తక్కువగా వుండేలా చూస్తూ, మానవ ధర్మానికి అనుగుణమైన పరిస్థితుల్ని సృష్టించుకోవడం. అయినప్పటికీ ఆవశ్యకతా బంధం ఆధారంగానే ఆ స్వేచ్ఛా లోకం రేకు విప్పగలదు. రోజులో పనిచెయ్యవలసిన కాలం తగ్గడం దానికి మొదటి మెట్టు...''[20]

అవశ్యకతను దాటి వికసించే మానవ శక్తియుక్తుల సృజనాత్మకత ప్రతియుగంలోనూ, సైన్సులో, కళల్లో, సాహిత్యంలో వైవిధ్యంలో సంస్కృతి పరంగా అభివృద్ధి పొందుతుందనే మార్క్స్ అవగాహన భౌతిక ఆవశ్యకత నుంచీ 'సృజన'ను సూత్రీకరించడం, నియమించడం సాధ్యం కాదనే ఆయన భావం.

బూర్జువా వ్యవస్థలో మార్కెట్, పెట్టుబడి, లాభం ప్రాముఖ్యం వహించడంవల్ల కళాకారునికీ, రచయితకూ న్యాయం జరుగదు. ''పెట్టుబడిదారీ ఉత్పత్తి కొన్ని రకాల మేధాగతమైన ఉత్పత్తికీ విరోధి — ఉదా : కళలకూ, కవిత్వానికీ'' అన్నాడు మార్క్స్.[21] జరుగుతున్న విడ్డూరం ఏమిటంటే ఈ బూర్జువా వ్యవస్థలో మార్క్సిస్ట్ ముసుగువేసుకున్న వాళ్ళు ఒక రకం సాహిత్యాన్ని పెట్టుబడి చేసుకొని రాజకీయంగా లేక ధన రూపేణా లాభం పొందాలని ఆశిస్తూవుండటం. తెలుగుదేశంలో నేటి సాహిత్యం అటు పుస్తక విక్రేతల చేతుల్లోనూ ఇటు మార్క్సిజం విక్రేతల చేతుల్లోనూ పెట్టుబడిదారీ 'ఉత్పత్తి'గా మారడం వల్ల సాహిత్యంలో సృజన క్షీణించి 'సామాజిక స్పృహ' నేతిబీరకాయలో నేయిగానే మిగిలిపోతున్నది. ఆశ్చర్యమేమీలేదు ఇది మార్క్స్ ప్రవచనమే. మనం బూర్జువా వ్యవస్థ సరిహద్దుల్లోపలే వున్నామింకా !!

## అధోజ్ఞాపికలు

1. Works Marx and Engels; from Karl Marx and World Literature, by S. S. Prawer, O. U. P., 1976; page 294
2. Engel's Letter to Bloch in September 1890; quoted in Marxism and Literature, by Raymond Williams, O.U. P., 1977, pages 79–80.
3. Engels, quoted in Marxism and Literature, page 200.
4. Marx in 'The English Middle Class', Marxism and Literature, page 201.
5. 6. Sartre in "The Purposes of Writing", 1960, quoted in Marxism and Literature, page 201.
7. Marxism and Literature, page 202.
8. Man and Society, a group of authors, Progress Publishers, Moscow, 1966, pages 161–162.
9. Ibid, page 163.
10. Marx and Engels : German Ideology Marxism and Literature, page 30.
11. Ibid, page 29.
12 Ibid, pages 35–42.
13. Ibid, pages 41–42.

14. Ibid, page 194.

15. The Communist Manifesto, quoted in Karl Marx and World Literature, page 143.

16. Ibid, page 142.

17. Ibid, page 310.

18. Ibid, pages 278-279.

19. Ibid, pages 287-288.

20. Ibid, pages 312-313.

21. Ibid, page 311.

---

# వలస వెళ్ళిన కోయిలలు

## తిరునగరి

వసంతం వచ్చిందని
కోయిలకు కబురంపాలనుకున్నాడు కవి
కొత్త పంచాంగం అంగట్లోకి వచ్చింది కాని
గుత్తులు గుత్తులుగా విరబూయలేదు మామిళ్ళు
పచ్చగా ఆకుపచ్చగా సింగారించుకోలేదు వనాలు
చెట్లు భారంగా నిట్టూరుస్తున్నాయి
గుట్టలు దీనంగా చూస్తున్నాయి
తుఫాను వరదల్లో కొట్టుకుపోగా మిగిలిన
నిరాశాజీవులవలె అక్కడక్కడా ఊగుతున్నాయి వృక్షాలు

అంగలారుస్తున్నారెందుకని సమీపించి
అడిగాడు చెట్లను కవి
చిన్నవోయిన మనస్సులతో
చెప్పసాగాయి చెట్లు

మానవజాతి మా జాతిని రూపుమాపుతున్నది
మమ్మల్ని మాడ్చి మసిబొగ్గు చేస్తున్నది
ముప్పాతిక మువ్వీసం జరిగింది మా వధ
మనిషి కెందుకోయీ మాపై క్రుధ ?

చల్లని నీడ మనిషికిస్తాము
స్వాదు ఫలాలు తినిపిస్తాము
బతికినంతకాలం మేము
మానవ జాతినే సేవిస్తాము
నోళ్ళులేని మూగజీవాలము
గొడ్డళ్ళకు బలియౌతున్నాము

చూడు కవీ ! నిన్నటి నీ మధువని నేడు ఎడారి
ఇక్కడ వసంతం ఎక్కడిది ? ఈనేల అనాకారి,

కవి హృదయం పగిలింది
కన్నీరు వేడిగా ఉబికింది

వనాలను సర్వనాశనంచేసి మనిషి
వసంతాన్నాహ్వానిస్తున్నాడీ నేలలోకి
వలస వెళ్ళిన కోయిలలు
మళ్ళా ఎందుకు వస్తాయి బీళ్ళలోకి

వనం లేక వసంతంరాదు
వసంతంలేక కోయిలలులేవు
ఆ కోయిలల పాటలు వినిపించక
ఆమని పాట వ్రాయనంది కవిలేఖిని
పాపం ! వలస వెళ్ళిన కోయిలలకు
వసంతం వచ్చిందని కబురంపాలనుకున్నాడు కవి.

బెంగాలీ మూలం శ్రీ హరినారాయణ చట్టోపాధ్యాయ

# తల్లి మనసు

కాశీలో గంగానదీతీరం. దశాశ్వమేధఘాట్ మెట్లమీద మెదల కుండా కూర్చొనివున్నాను. సాయం సమయం అయినా స్నానం చేయడానికి జనం వస్తూనే వున్నారు; పోతూనేవున్నారు.

ఉన్నట్టుండి నా పక్కన ఏదో పడిన చప్పుడైతే చూశాను. అది పదిపైసల బిళ్ళ! ఆ దానం చేసిన ఆమె కూడా అక్కడే నిలబడివుంది. ఆమెను అనవలసిన పనిలేదు; నా వేషమే అలావుంది!

'అమ్మా! మీరు నన్నుచూసి పొరపాటు పడ్డారు. నేను అడుక్కునే వాణ్ణికాదు! సాయంకాలపు గాలికోసం ఇలావచ్చి కూర్చున్నాను. ఇదుగో, మీ పదిపైసలు మీరు తీసుకోండి!' అని అన్నాను.

'మీరా?' అని ఆమె నిలువుగుడ్లేసి వణుకుతున్న కంఠంతో అన్నది.

ఆమె మొహంలోకి పరీక్షగా చూశాను. గుర్తుపట్టడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

'అమియా!' నా నోటినుంచి అకస్మాత్తుగా వెలువడింది. మరో క్షణాన నాలో గాంభీర్యం ప్రవేశించింది. మొహం మరోవైపుకు తిప్పుకొని అలాగే కూర్చున్నాను. ఇంతలో అమియ కూడా దగ్గరి కొచ్చి ఒక మెట్టుమీద కూర్చుంది.

'ఏమండీ? నన్ను గుర్తుపట్టలేదా? మొహం అలా తిప్పేసుకున్నారేమిటి?'

''గుర్తుపట్టాను గనుకనే మొహం తిప్పేసుకున్నాను.''

''నన్ను క్షమించరూ?'' అమియ ఏడవటం ప్రారంభించింది.

గట్టిగా ఒకమాట అనేద్దామని ఆమెవైపు చూసి ఆగి పోయాను.... అమియ వయస్సెంత వుంటుంది?... నలభైదాటి వుండవచ్చు. అయినా అందం చెక్కుచెదరలేదు. పెద్దపెద్ద కళ్ళు, ఎర్రటి పెదాలు... అలాగే వున్నాయి...

మాట్లాడ లేకపోయాను. అదేపనిగా ఆమెవైపు చూస్తూ ఉండిపోయాను.

''కాషాయ వస్త్రాలు కట్టుకున్నారు, సన్యాసం పుచ్చు కున్నారా?''

''సన్యాసం పుచ్చుకున్నా అది నీ కారణంగా మాత్రంకాదని గుర్తుంచుకో!''

'మనస్సును గాయపరచేలా మాట్లాడే మీ మాటల తీరు ఏ మాత్రం మారలేదు!''

మనస్సును గాయపరచడమా? అమియ గతం అంతామరచి పోయినట్టుంది. గాయపరచిందెవరు? రెండు సంవత్సరాల కుర్ర వాణ్ణి, ఇంటినీ, భర్తనీ వదిలి సంగీతం మాష్టరుతో వెళ్ళిపోయిం దెవరు? అలా వెళ్ళిపోవడంవల్ల భర్తమనస్సు ఎంత గాయ పడుతుందో ఆమె ఆలోచించిందా? ఎంత మంది ఎన్ని మాట అంటారో వూహించిందా? ఆ పసికందు ఏమై పోతాడోననికూడా ఆలోచించలేదే?...

లేచినిలబడ్డాను. అమియకూడా లేచినిలబడింది.

'మీరెక్కడుంటున్నారు?'

'గుదేలియాలో!'

'ఒంటరి నేనా?'

'కాదు. ఇంకో ఆయన కూడా వున్నాడు. ఆయనకు పెన్షన్ వస్తుంది. ఇంకేమైనా అడుగుతావా?'

'చాలా అడగాలనివుంది. కాని చెప్పేమనిషి వెళ్ళే తొందరలో వుంటే ఏ మడగను?'

వెనక్కు తిరిగి చూశాను. అవే కళ్ళు — పెద్దపెద్ద కళ్ళు! ఆ కళ్ళల్లో మమకారం మిలమిల లాడుతున్నది. పెదాలమీద మందహాసం తొణికిసలాడుతున్నది.

'ఇంకేమైనా అడుగుతావా?'

'కొంచెం సేపు కూర్చోండి!'

ఎదురుగావున్న అరుగుమీద కూర్చున్నా. అమియ కూడా దగ్గరగా వచ్చి కాళ్ళు ముడుచుకొని కూర్చుంది.

'మీరు మళ్ళా పెళ్ళి చేసుకున్నారా?'

'చేసుకున్నాను!'

'ఎంత కాలమైంది?'

'నువ్వెళ్ళిపోయిన రెండు సంవత్సరాలకు!'

'మంచి పనిచేశారు. భార్యలేకుండా జీవితం గడవటం కష్టమేకదామరి!' అమియ మరోవేపుకు మొహం తిప్పుకుంది. బహుశా గతం గురు కొచ్చినటుంది.

'మీ ఆవిడ సమీర్ అంటే ప్రేమగా వుంటుందా ?' అకస్మాత్తుగా ప్రశ్నించింది.

ఆమె ముఖం వైపుకు పరీక్షగా చూశాను. మాట్లాడలేదు ఇల్లు వదిలి వెళ్ళిపోయాక ఇంకా ఆ విషయం ఎందుకో ?

'మాట్లాడరేమిటి ?'

'ఏముంది మాట్లాడటానికి ? ఆ ప్రశ్నవేసే అధికారం నువ్వెప్పుడో పోగొట్టుకున్నావు !'

అమియ తలవంచుకొని కూర్చుంది. పమిటచెంగుతో కళ్ళు తుడుచుకుంది. 'తప్పు నా ఒక్కదానిదేనా ?' అని నెమ్మదిగా అన్నది.

'ఏ తప్పు ?'

'ఇల్లు వదిలి వెళ్ళిపోవడం !'

సిగ్గూ శరంలేకుండా ఆ మాట అన్నందుకు నాకు ఆశ్చర్యం వేసింది.

''ఇన్ని సంవత్సరాలు గడిచిపోయాకకూడా ఆ తప్పు నామీదనే వేయాలని చూస్తున్నావా ?'' అని కొంచెం కటువుగా అన్నాను.

''అలా అని నేనడంలేదు. దాన్నిగురించి ఇప్పుడు తర్జన భర్జన చేయడంవల్ల కూడా ప్రయోజనం లేదు. అయితే ఒకమాట అడుగుతున్నాను : నాకు మీరిచ్చిన ప్రేమ ఏ పాటిదో ఆలోచించండి! పెళ్ళయ్యాక ఒక పిల్లవాణ్ణి నాకందించి మీ బాధ్యత పూర్తయిందని మీరనుకున్నారు !''

'లేకపోతే ఉద్యోగం వదిలేసి పెళ్ళాం ముందుకూర్చోవాలా?'

అమియ నవ్వింది.

'పెళ్ళాం ముందు కూర్చుంటే సరిపోదు, ఆమెకు మనస్సును కూడా అందించవలసి వుంటుంది !'

'నీ మాట నాకర్థంకావటంలేదు అమూ !'

అకస్మాత్తుగా ఆ పాత సంబోధన వినేప్పటికి అమియ ఒక్కసారిగా ఉలిక్కి పడింది ఆమె శరీరం అంతా ఉన్నట్టుండి కంపించినట్టయింది — ఆ వయస్సులో కూడా !

★ ★ ★

స్మృతి పథంలో కలిసిపోయిన అనేకమైన అస్పష్ట చిత్రాలు కళ్ళముందు కన్పించసాగాయి. ఆ చిత్రాల తాలూకు రంగుకూడా మాసిపోయింది; ఆ మాసిపోయిన వాటికి ఇప్పుడు కొత్తగా రంగు వేయడం కూడా వృథాయే !

పెళ్ళిరోజు రాత్రే ఆమె స్నేహితురాళ్ళంతా అనేశారు : జంట సరిగాలేదని ! అవును, జోడు కుదరని మాటనిజమే ! ఈడూ జోడూ కుదిరే సంబంధం చూడాలంటే డబ్బుకావాలి. అంత తాహతు అమియ తండ్రి దగ్గరలేదు. ఆయన నెలసరి జీతం అరవై రూపాయలు ! పిల్ల అందంగా వుంటుంది గనుక ఏ రాజకుమారుడో ఏనుగుమీద వచ్చి చక్కా పెళ్ళి చేసుకెడతాడని ఆమె తండ్రి ఆశించిన మాట నిజం ! అయితే ఏనుగుమీద కాదుగదా, కంచరగాడిద మీద కూర్చొని కూడా ఎవరూ ఆమెకోసం రానేలేదు. రెండు పూటలా ఇంత తిండి బెట్టగలిగేవాడు దొరికితే చాలునని అమియ తండ్రి అంతటా గాలించాడు.

అలా గాలిస్తూవుంటే ఆయనకు నేను దొరికాను. వాళ్ళమ్మాయికి నేను తగినవాడనని ఆయన భావించాడు.

నాకు నా అనేవాళ్ళెవరూలేరు. కష్టపడి చదువుకున్నాను. కొంతకాలం ట్యూషన్లు చెప్పి కాలం గడిపాను. ఆ తరువాత హల్ బర్న్ అండ్ కంపెనీలో ఉద్యోగం దొరికింది ! అదిరంగుల కంపెనీ! నా రంగు నల్లగానే వుండిపోయింది. ఎరుపుకు తిరగనేలేదు.

పిల్లనచ్చింది. ఇచ్చిపుచ్చుకున్నే విషయంలో సమస్య అంటూ ఏదీ ఉత్పన్నం కాలేదు. ముహూర్తం నిర్ణయించారు. పెళ్ళి అయిపోయింది.

అయితే పెళ్ళి అనేది అయిపోయింది; కాని ఇద్దరి హృదయాలు మాత్రం కలవలేదని ఆ తరువాత చాలాకాలానికి గాని తెలియలేదు.

అమియకు అమితమైన కోరికలుండేవి ! ఏవస్తువూ ఆమెకు వచ్చేదికాదు. చిన్నఇల్లు, ఆదాయం తక్కువ ! ఆమె అవసరాలు తీర్చడానికి నా తాహతు చాలిందికాదు. అయినా ఆమెను సంతోషపెట్టేందుకు ఉదయం, సాయంత్రం వేరే చోట పనిచేయటం ప్రారంభించాను. ఉదయంపూట మెట్రిక్ చదివే కుర్రవాడొకడికి ట్యూషన్ చెప్పేవాణ్ణి ! సాయంత్రంపూట భగనీరాం శివపురియా దుకాణంలో లెక్కలు రాసేవాణ్ణి !

పార్ట్ టైం ఉద్యోగాలు చేసి సంపాదించే ఆదాయంకూడా అమియ అవసరాలకు సరిపోయింది కాదు.

రెండు సంవత్సరాలలోపే సమీర్ వచ్చేశాడు. అంతా తల్లి పోలికే ! ఆ కళ్ళు, ఆ పెదాలు, ఆ రంగు అన్నీ ఆమెవే ! నారూపం రాలేదు, బతికి పోయాడు కుర్రవాడు పుట్టిన తరువాత అమియ అవసరాలు తగ్గిపోతాయని, నా తాహతుకు తగినట్టుగా మసులుకుంటుందని ఆశించాను.

కొంత కాలం గడిచింది.

ఒక రోజున ఆఫీసునుంచి ఇంటికొచ్చేప్పటికి లోపలినుంచి గిటార్ సంగీతం విన్పిస్తున్నది. ఆశ్చర్యపోయాను. ఒక్క క్షణం బయటనే ఆగిపోయాను. లోపలికి తొంగి చూశాను. నేలమీద జంపఖానా వేసివుంది. దానిమీద ఒకతను కూర్చొని ఎంతో తన్మయత్వంతో గిటార్ వాయిస్తున్నాడు. రెండుబుగ్గలమీద అరచేతులుంచి అమియ ముగ్ధురాలై గిటార్ వాయిద్యం వింటున్నది.

నా దగు విని ఇద్దరూ తలెత్తి నావైపు చూశారు.

'రండి, రండి! ఈయనగారు శుభేన్‌బాబుగారు. సంగీతం మాష్టరు! పద్మాదీదీగారింట్లో సంగీతం చెబుతున్నారు. గిటార్ ఎంత బాగా వాయిస్తారని! మీరు కూడావచ్చి కూర్చొని వినండి!' అని అమియ అన్నది.

శుభేన్‌బాబుకు నమస్కరించాను. ఆయన కూడా ఎంతో మర్యాదగా నమస్కరించాడు.

'సంగీతం వినేంతటి తీరిక నా కెక్కడుంది? ఇప్పుడు వెంటనే బయలుదేరి శివపురియా షాపుకు వెళ్ళిపోవాలిగదా!' అని అన్నాను. నా సమాధానం విని శుభేన్‌బాబు ఎంతమాత్రం నిరాశ చెందలేదు. అయినా మర్యాదకోసం—'పోనివ్వండి! ఇవ్వాళ్ళ కాకపోతే మరో రోజు వినవచ్చు! ఉద్యోగం ముఖ్యంగదా! వెళ్ళిరండి!' అని అమియవైపుకు మొహం తిప్పి అన్నాడు.

ఆయనగారికి నొప్పి కలిగించే మాట ఏదైనా అనాలని నాకూ అనిపించింది, ఆ క్షణంలో! కాని అలా అనడంవల్ల ప్రయోజనం లేదనిపించి వూరుకున్నాను. వాయిద్యాలు, తీగెలు, రాగాలు—వీటిలో మునిగివుండే మనుషులకు ప్రాపంచిక విషయాలు పట్టవు!

శుభేన్‌బాబు రోజూ రావటం ప్రారంభించాడు. శుభేన్‌బాబు నుంచి శుభేన్ దాదా అయ్యాడు. ఆయనగారికి గిటార్ వాయిద్యంతోపాటు చాలా వాయిద్యాలు వచ్చు; పైపెచ్చు గాత్ర సంగీతం కూడా వచ్చు. అమియ సమయం, సందర్భంలేకుండా కూనిరాగాలు తీయటం ప్రారంభించింది. దీన్నిబట్టి శుభేన్‌బాబు ఈమెకు సంగీతం నేర్పుతున్నట్టు రుజువైంది. మంచంమీద కూర్చొని శివపురియా వాళ్ళ లెక్కలేవో చూస్తూవుంటే అమియవచ్చి పక్కన కూర్చొని ''ఎప్పుడూ ఈ ఖాతా పుస్తకాలతో కూర్చోవటం నాకేం బావుండలేదు!'' అంది.

''నిజమే మరి! నీకు బావుండదు! ఈ లెక్కలు చూడకపోతే మన కుటుంబ బడ్జెటులో లోటు వచ్చేస్తుందే మరి!'

'వచ్చే నెల ఉత్సవం రోజున నేను పాటలు పాడుతున్నాను! మీకు తెలుసునా?'

'నువ్వా?' ఆశ్చర్యపడ్డట్టు పోజు పెట్టాను.

''అవును నేనే! ఏమిటంత ఆశ్చర్యంగా వుంది మీకు? నా కంఠం చాలా శ్రావ్యంగా వుంటుందని, బహుమతి కూడా నాకే రావచ్చునని శుభేన్‌దాదా అంటున్నాడు. ఈ సంగీతోత్సవంలో కొత్త సంగీత కళాకారులకు పోటీలు జరుగుతున్నారు.'' క్రీగంటి చూపులు చూస్తూ అమియ అన్నది— ''నా పాట వింటారా? నెమ్మదిగా పాడతాను!''

బావుంది, ఇక్కడ నేను ఈమెగారి పాటవింటూ కూర్చుంటే అక్కడ మాభగనీరామ్ శివపురియా నా ఉద్యోగానికి మంగళహారతి పాడతాడు. అమియకు ఈ విషయమే చెబుదామని ఆలోచిస్తూ వుండగానే ఆమెకు నామీద కోపం వచ్చేసి కిటికీ దగ్గరకు వెళ్ళి నిల్చుంది. ఆ తరువాత ఎప్పుడూ మళ్ళీ నా పాట వింటారా అని అన్న పాపాన పోలేదు. ఆ తరువాత మ్యూజిక్ కాంపిటీషన్‌లో ఆమెకు బహుమానం వచ్చిందో లేదో కూడా చెప్పలేదు.

ఈ లోపున మరో ప్రమాదం వచ్చి పడింది. ఆ రోజున ఉదయంపూట ట్యూషన్ పూర్తి చేసుకొని ఇంటికి వచ్చేప్పటికి అమియ డాబామీద కూర్చొని సంగీత సాధన చేసుకుంటున్నది. సంగీత సాధనకు సమయం దొరకటంలేదని వంటచేయటానికి ఒకామెను ఏర్పాటు చేసింది. శుభేన్‌దాదా చెప్పాడట—గ్రామఫోన్ కంపెనీ వాళ్ళు ఇంటికొచ్చి కాంట్రాక్టు రాసుకుంటామన్నారని!

★ ★ ★

మరో ట్యూషన్ దొరుకుతుందేమోనని మూడు మాసాల పాటు కాలికి బలపం కట్టుకొని తిరిగినా దొరకలేదు.

అలాగే రోజులు గడుస్తున్నాయి.

ఒక రోజునరాత్రి పదిగంటలయినా అమియ ఇంటికి చేరుకోలేదు. కొంచెం గాభరాపడ్డాను. వంటమనిషిని అడిగాను.

'అమ్మగారు సంగీతం మాష్టరుగారితో వెళ్ళారు. ఎక్కడికి వెళ్తున్నదీ, ఎప్పుడు ఇంటికి తిరిగొచ్చేదీ ఏమీ చెప్పలేదు!' అని అన్నది.

పది గంటలు దాటిపోయింది. బయటికెళ్ళాను. కాని ఎక్కడికి వెళ్ళిందని వెదకాలి? వెళ్ళినచోటు తెలీదాయె! ఏమిటి చేయడం? కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరిగి చివరకు ఇంటికొచ్చేశాను. ఇంతలో సమీర్ ఏడవటం ప్రారంభించాడు. వాణ్ణి ఎత్తుకుందామని వెళ్తే అక్కడొక కాగితం కన్పించింది. అమియ సంగీతానికి సంబంధించిన కాగితమేమో ననుకున్నాను. అయినా ఏమిటోనని తీసుకొని చూశాను. భూమికంపించినట్టయింది. తలమీద పిడుగుపడినట్టయింది.

రెండేరెండు వాక్యాలు : ''శుభేన్‌తో వెళ్ళిపోతున్నాను. సమీర్‌నుకూడా తీసుకెళదామనుకున్నాను, శుభేన్ వద్దన్నాడు.''

మంచంమీద దభాలున కూర్చోబడ్డాను. భూమి బద్దలయినట్టనిపించింది నా గృహస్థజీవితం రెండుముక్కలైంది. సమీర్ వైపు చూశాను. నిశ్చింతగా నిద్రపోతున్నాడు. వాడికి గొడవేమీ తెలీదు గదా!

ఆ తరువాత నా పరిస్థితి గందరగోళమైపోయింది. అడిగే వాళ్ళకు సమాధానం చెప్పలేకచచ్చిపోయాను. ఒక్కొకళ్ళకు ఒక్కొక రకంగా చెప్పాను. 'పుట్టింటికివెళ్ళిందని చెబితే మరి పసివాణ్ణి వదిలేసి వెళ్ళిందే?' అని ప్రశ్న! 'రాత్రికి రాత్రే విషజ్వరంవచ్చి చచ్చిపోయిందంటే ఎప్పుడు చనిపోయింది, ఇప్పుడేగదా సంగీతం మాష్టరుతో చూశాం!' అని కొందరు! 'ఈ దుర్మార్గుడే చంపేసి వుంటాడు!' అని మరికొందరి అభిప్రాయం!

'ఏమో ఎక్కడికివెళ్ళిందో తెలియడంలేదు. మధ్యాహ్నం ఇంటినుంచి వెళ్ళింది, తిరిగి రానేలేదు!' అని చాలామందికి స్పష్టంగా చెప్పేశాను. లోకులు అడిగినదానికి ఏం చెప్పినా మనసులో మాత్రం బాధగానేవుంది. ఇలా జరిగినందుకు! ఏంచేయాలో

అర్థంకాకుండావుంది. ఆ సమయంలో అనుకోని విషయం ఒకటి ఆఫీసులో జరిగింది. హల్‌బర్న్ కంపెనీ బ్రాంచి ఒకటి మధ్య ప్రదేశ్‌లో ఒకమారుమూల ప్రదేశంలో తెరిచారు. క్లర్కుపోస్టు ఒకటి ఖాళీవుంది. ఎవరూ వెళ్ళటానికి ఒప్పుకోలేదు. నేను నాపే రిచ్చాను. నాకోర్కె నెరవేరింది. మొహం చాటుచేసుకోవడానికి ఈ అవకాశం దొరికినందుకు సంతోషించాను.

★ ★ ★

ఇవన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. వీటన్నిటిని ఇప్పుడు గుర్తుకు తెచ్చుకోవడంవల్ల ప్రయోజనమేముంది?

అమియవైపు పరీక్షగా చూశాను. కాలం ఆమెలో కొంత మార్పును తెచ్చిపెట్టింది. జుట్టు ఇప్పుడిప్పుడే తెల్లబడుతున్నది.

'మీ శుభేన్ ఎలావున్నాడు?' అకస్మాత్తుగా అడిగేశాను

కొంచెం కోపం వచ్చినట్టుంది.

'ఏమో, తెలీదు!' అని అన్నది, నెమ్మదిగా !

''తెలీకపోవడ మేమిటి?...నీకు తప్పకుండా తెలిసివుండాలి!''

''ఇల్లు వదిలివచ్చాక మూణ్ణెల్లపాటు కలిసేవున్నాం; నగలన్నీ అయిపోయాక ఆయనకూడా అయిపులేకుండా వెళ్ళిపోయాడు !''

'అయితే మరి ఇంతకాలంనుంచి ఎలా జరుగుతున్నది నీకు?' అని వెంటనే వ్యంగ్యంగా అనేశాను—''ఎందుకు జరగదులే! వయస్సు ఉంది. సంగీతంకూడా వచ్చు ! ఏమంటావు?''

''మీరంటున్నది నిజమే ! కాదని అనను ! అయితే ఒకసంగతి మాత్రం చెబుతున్నాను. నాకు పురుషులంటే విరక్తి పుట్టింది. ఒకరు తనువును ఆశిస్తే, మరొకరు తనువుకోసంవచ్చి మనస్సును ఆకాంక్షించేవారు!''

ఆ మాటలు విషతుల్యంగా వున్నప్పటికీ ఆలకించక తప్ప లేదు. అమియ చెప్పటం కొనసాగించింది— ''మీకోసం గాలించాను. ఎక్కడెక్కడికో ఉత్తరాలు రాశాను.కాని లాభంలేకపోయింది. ఎంతో మంది ఎన్నోఆశలు చూపించారు. కాని నేను లొంగలేదు. నిల దొక్కుకున్నాను. పురుషజాతిని బాగా అర్థం చేసుకోవడంవల్ల— వాళ్ళపట్ల ఆకర్షణ అనేది నాలో నశించిపోయింది!''

మనిషి చూడ్డానికి ఇంకా అందంగానే వుంది. అయినా ఇంకెంతకాలం? యౌవ్వనంలో వున్నప్పుడు ఎంత అనుభవించిందీ, ఎంత పోగొట్టుకున్నదీ, దాన్నిగురించి ఇప్పుడు బేరీజు వేసుకోవడం వల్ల ప్రయోజనంలేదు. గతాన్ని స్మృతికి తెచ్చుకొని బాధపడీలాభం లేదు. కాలం గడిచిపోయింది.

'నా పాప పంకిలమైన జీవితాన్నిగురించి తెలుసుకోవడంవల్ల ప్రయోజనమేముంది?...మీ సంగతులు చెప్పండి!' అని అమియ అన్నది.

'నా సంగతులా ? ఏమున్నాయి?'

''మీకొత్త భార్యకు మీరు బైరాగుల్లో కలిసిపోవడం ఇష్ట మేనా?''

'కాషాయవస్త్రాలు కట్టుకున్నవాళ్ళంతా బైరాగులేనని నువ్వెందు కనుకోవాలి? ఈ కాషాయవస్త్రాలు మనస్సును అదుపులో పెట్టుకోవడానికి ఉపకరిస్తాయి. అయినా నన్నాపడానికి నారెండో భార్య ఉంటేగదా ?''

'మీ భార్య లేదా ?'

''లేదు! ఆమె ఎవరితోనూ లేచిపోలేదు! ఆమె పరలోకానికి వెళ్ళిపోయింది! సరే, ఆ సంగతులన్నీ ఎందుకులే! ఇన్ని రోజుల్నుంచి నీ జీవితం ఎలా గడిచిందో చెప్పావుకాదు !''

''దగ్గర్లోనే వుంటున్నాను. రెండు నిమిషాలు నడిస్తే అక్కడికి చేరుకుంటాం. నా జీవితం ఎలా గడుస్తున్నదో, వచ్చి చూడండి!...వస్తారా?'' అని అమియ లేస్తూ అన్నది.

అమియ జీవితం ఎలా గడుస్తున్నదో, లేదా ఎలా నడుపు తున్నదో తెలుసుకోవడంవల్ల ప్రయోజనం లేదు. పెళ్ళిరోజున కట్టిన మంగళసూత్రాన్ని తెంచేసుకొని వెళ్ళిపోయింది. ఇప్పుడామె మంచి చెడులను గురించి ఆలోచించడం నా పనికాదు! కాని మనస్సు అనేది ఒప్పుకోదుగదా !

అమియ మాటలకు సమాధానం చెప్పకుండా నేనామెను అనుసరించాను. ఎక్కువదూరం లేదు. ఎదురుగా సున్నం కొట్టిన ఇల్లు కన్పించింది. దానిముందు 'ఆదర్శ విద్యాలయం' అనే బోర్డు వేలాడుతున్నది.

'జాగ్రత్తగా నడవండి! ఇక్కడొక పెద్ద గొయ్యి వుంది!' అని నడుస్తూనే అమియ అన్నది.

జాగ్రత్తగా నడుచుకోవడం అవసరమైతే ఈ వయస్సులో అమియ వెంట ఇలా ఇరుకుగొందులు సందులు దాటుకుంటూ వెళ్ళ వలసిన అవసరమే వుండేదికాదు! వెనకనుంచే తిరిగి వెళ్ళిపోవాలనిపించింది. అయినా ఆమెను అనుసరించాను.

చిన్న ఇల్లు. అంధకూపం. తలొంచుకొని లోపలికి వెళ్ళ వలసి వచ్చింది. ఒక మూలన మంచంమీద మురికిగా వున్న పరుపు కన్పించింది. మరోవైపున చీరె ఒకటి వేలాడుతున్నది. ఇదే అమియ ప్రపంచం! గతానికి ప్రస్తుతానికి వున్న వ్యత్యాసం కళ్ళ ముందు తారట్లాడింది. ఎంత భేదం?...ఎంత కళావిహీనంగా వుంది ఈనాటి జీవితం ?

నేలమీద కొన్ని పుస్తకాలూ, పలకలూ పడేసి వున్నాయి.

'ఇవన్నీ ఎవరివి ?

నవ్వి అమియ అన్నది—''నా విద్యార్థులవి! 'ఆదర్శ విద్యాలయం' అనే పేరుతో చిన్న పిల్లలకు స్కూలు పెట్టి నడుపు తున్నాను!''

'జీవితపు చివరి మెట్టుమీద నిలబడి పంతులమ్మ ఉద్యోగం చేస్తున్నావా? ఇలాగని ఎక్కడా ఏ నవలలోనూ చదవలేదు!''

''జీవితం నవలమీద ఆధారపడి వుంటే ఈ రోజున మీరు నన్నీరూపంలో చూసి వుండేవారు కాదేమో! ఈ పని నేను గత ఇరవయ్ సంవత్సరాలనుంచి చేస్తున్నాను. చాలాసార్లు జీవితంమీద విరక్తి కలుగుతూ వుండేది. కాని ఈ పసి పిల్లలు నన్నా పని చేయకుండా నివారించారు...అమ్మా అని పిలుస్తూ! అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది—నా సమీరే నా చెంగుపుచ్చుకొని నివారిస్తున్నాడేమోనని! ఆ రోజున నేను ఇల్లు విడిచి వచ్చేప్పుడు నన్ను నివారించే శక్తి సమీర్‌లో లేకపోయింది... ఈ రోజున వీళ్ళను వదిలి వెళ్ళటం కష్టంగావుంది! ఒక సమీర్‌ను వదిలి వందమంది సమీర్‌ల బంధనాల్లో బందీనయ్యాను!''

అమియ కళ్ళనుంచి కన్నీరు ఏకధారగా ప్రవహించింది. కృత్రిమమైన కన్నీరుకాదు—నిజమైన కన్నీరు. రాళ్ళు కూడా కరిగిపోయే కన్నీరు! నేను మాట్లాడకుండా కూర్చుండిపోయాను. అలాంటి స్థితిలో ఏం మాట్లాడినా బావుండదు.

కొంచెంసేపు మౌనంగావుండి —'ఒక సంగతి అడగనా?' అని అన్నది అమియ!

'అడుగు!'

'ఇప్పటివరకు ఎక్కడెక్కడో భోం చేశావు! ఈ రోజున మీరు నేను చేసే వంట రుచిచూడాలి!'

కాదనలేకపోయాను. అమియ కూరలు తరగటానికి కూర్చుంది. చేతులకు నాలుగేసి మట్టి గాజులు మాత్రమే వున్నాయి. గతం గుర్తుకొచ్చింది. మెడనిండా, చేతులనిండా బంగారపు నగలుండేవి! ఆమె నిండైన విగ్రహానికి ఆ నగలు ఎంతో అందాన్ని తెచ్చిపెట్టేవి!

మనస్ఫూర్తిగా వంటచేసి, ఎంతో గౌరవంగా వడ్డించింది. కూరలు ఎక్కువ లేకపోయినా ఆమె చూపిన ఆదరాభిమానాలు ఆ లోటును భర్తీ చేశాయి.

'అయితే నీకీ ఏర్పాటే బాగున్నదన్నమాట.' భోజనంచేస్తూ అన్నాను.

'ఏ ఏర్పాటు?'

'పిల్లలకు స్కూలు నడిపే ఏర్పాటు!'

'అలాగని అవలేను! మనిషి ఆలోచించేది ఒకటయితే జరిగేది మరొకటి! అంతా కాలమే నిర్ణయిస్తుంది!'

''ఒకవేళ ఆ కాలం వందమంది సమీర్‌ల బంధనాలను తెంచుకోమని ఆదేశిస్తే ఏం చేస్తావు?''

భోజనం వడ్డిస్తూ అమియ—'సమీర్ తండ్రి ఎలా ఆదేశిస్తే అలా నడుచుకుంటాను!' అని అన్నది!

అమియ పూరీలు వడ్డిస్తూవుంటే 'చాలు! చాలు!' అని అంటూ వుండగానే ఆమె చేతులు స్పర్శించడం జరిగింది. వృద్ధాప్యంలో కూడా యౌవ్వన దశలోవుండే వేడి వుంటుందని ఆ రోజునే తెలిసింది. రక్తసంచారం పెరిగింది!

'చేతికి ఎంగిలి అయినట్టుంది కడుక్కో!' అని నెమ్మదిగా అన్నాను.

''కడుక్కుంటే మీ స్పర్శ పోతుందా! ఉండనివ్వండి, అమ్మాత్రమైనా?'' అని అమియ పెళ్ళికూతురులాగా సిగ్గుపడుతూ అన్నది.

జీవితంలో అంతా అయిపోయిందనుకున్న తరువాత మళ్ళా ప్రారంభానికి వచ్చినట్టనిపించింది.

'గృహస్థాశ్రమంలోకి రావాలని నీకున్నదా?' అని అకస్మాత్తుగా అడిగేశాను.

విచిత్రమైన ప్రశ్నే ఇది! మూడువంతుల జీవితం పరిసమాప్తమైపోయింది. మళ్ళా గృహస్థాశ్రమమా ?

''ఉంది, రావాలనే ఉంది నాకు! ఆనాడు ఎంతో దివ్యంగా నడిచే గృహస్థ జీవితంలో చిచ్చుపెట్టుకొని వచ్చాను. ఆ బాధను మరచిపోయేందుకే ఈ పిల్లల్ని పెట్టుకొని పాఠాలు చెబుతున్నాను. మీరు నన్ను తీసుకెళ్తారా ?''

సుష్టుగా భోజనం చేశాక—ఈ భూమిమీద ప్రతి ఒక్కరికీ ఇట్టే క్షమించి వేయాలనేకోరిక కలిగింది.

''ఆఁ తీసుకెళ్తాను! ఈ వయస్సులో వెళ్ళి మళ్ళా మనం సంసారం ప్రారంభిద్దాం. శారీరకమైన ఆకర్షణలేదు. లోకుల అపనిందలతో పనిలేదు. ఆ భయం ఎప్పుడోపోయింది గతాన్ని లోకం మరచిపోయేవుంటుంది !''

'లోకులు గతాన్ని మరచిపోయి వుండవచ్చు. ఉన్నట్టుండి కాశీనుంచి ఒకస్త్రీని వెంటబెట్టుకొని వచ్చావా?' అని ఎవరైనా అంటే మీరేం సమాధానం చెబుతారు ?

''ఆ రోజున నువ్వు ఇల్లువదిలి వెళ్ళిపోయినప్పుడు ఏమేమి చెప్పానో, అదే ఇప్పుడు చెబుతాను. పారిపోయినభార్య తిరిగి వచ్చేసిందని చెబుతాను. అసలు ఇలా చెప్పవలసిన అవసరం కూడా లేదనుకుంటాను ! బైరాగిని నన్నెవరు అడుగుతారు ?''

అమియ వంగి కాళ్ళకు నమస్కరించింది.

'మీరు నిజంగా మనుషులుకాదండి, దేవతలు సుమా!' అని అన్నది !

లో లోపల నవ్వుకున్నాను. ఎవరైతే ఏం? మళ్ళా గృహస్థాశ్రమంలోకి వెళ్ళాలనే కోరిక కలిగింది !

★ ★ ★

కొంచెం సేపయ్యాక అమియ బయటికి వెళ్తూవుంటే అడిగాను—'' ఇంతరాత్రిపూట ఎక్కడికి బయలుదేరావు?''

సెక్రెటరీతో చెప్పేందుకు వెళ్తున్నదట! తిరిగి వస్తూ ఆటబొమ్మలు కొనితెచ్చింది. ఉండబట్టలేక అడిగాను— "ఇంకా సమీర్ బొమ్మలతో ఆడుకునే వయస్సులోనే వున్నాడని నీవుద్దే శ్యమా? వాడికి ఇరవై రెండుసంవత్సరాలునిండి ఇరవై మూడోఏడు రాబోతున్నది. వాడిపెళ్ళినిగురించి ఆలోచించవలసిన వయస్సు వచ్చేసింది!"

అమియ వాటిని పక్కన పెట్టేసింది.

"పక్కన పెట్టేశావేమిటి? తీసుకరా! సమూ పిల్లలకు పనికివస్తాయిలే!" అని అన్నాను.

గంటలో అమియ తయారైంది. ఆరాత్రి ఎక్కడైనా హోటల్‌లోవుండి ఉదయమే వెళ్ళిపోదామని నిర్ణయించుకోవడం జరిగింది.

సామాను తీసుకొని మేము బయటికొచ్చాం. అమియతలుపు గొళ్ళెంవేస్తూ వేస్తూ ఆగిపోయి—'నాదొక మనవి!' అని అన్నది!

'ఏమిటా మనవి?'

'సమీర్‌కు నేనెవరో చెప్పకూడదు!'

"నేను నిన్నుగురించి చెప్పకపోయినా వాడు గుర్తుపట్టేస్తాడు. ఇంట్లో నీపాత ఫోటో ఒకటివుంది. అప్పటికీ ఇప్పటికీ నీ మొహంలో మార్పేమీలేదు. గుర్తుపట్టేస్తాడు!"

'అయితే...'

'ఏమిటి, అయితే......'

'సమీర్ ఏమనుకుంటాడో?...'

"కొత్తగా ఏమనుకుంటాడు? అందరూ అనుకునేదే వాడూ అనుకుంటాడు—పారిపోయినభార్య తిరిగివచ్చిందీ అని! నువ్వు ఇంటినుంచి వెళ్ళిపోయాక నేను వాడిదగ్గర ఏ సంగతీ దాచిపెట్టలేదు. అన్నీ చెప్పేశాను!"

అమియ మూసినతలుపు మళ్ళా తెరిచింది.

'అయితే సమీర్‌కు అన్ని సంగతులూ చెప్పేశారా? శుభేన్‌బాబుతో వెళ్ళిపోయిన సంగతి కూడానా...?'

మొదటిసారిగా అమియ శుభేన్‌బాబు పేరు ఎత్తింది.

"ఇందులో దాచవలసిందేముంది? అందరికీ తెలిసిన విషయమే!"

'అది కాదండీ!' తలపైకెత్తి— "ఈ విషయం వీధిలోని వాళ్ళకు, బంధువర్గంలోని వాళ్ళకు తెలిసిన విషయమే కావచ్చు! ఎవరిముందూ నేను సిగ్గుపడను! కాని నా కొడుక్కి కళంకంతో కూడుకున్న నా మొహాన్ని ఎలా చూపను?...నావట్ల అతనికి వుండవలసిన ప్రేమాభిమానాలు లేకపోయాక నేను మీతో తిరిగి గృహస్థాశ్రమంలోకి అడుగుబెట్టిమాత్రం ప్రయోజనం ఏముంది చెప్పండి?" అని అన్నది.

నేను సమాధానం చెప్పడానికి ఉపక్రమించే లోపలే అమియ ఇంటి తలుపులు బార్లా తెరిచి లోపలికి వెళ్ళిపోయింది. వెళ్ళి మళ్ళా తలుపులు మూసుకొని లోపల గడియ వేసుకుంది.

తలుపు తెరవమని ఎన్నిసార్లు తట్టినా అమియ తలుపు తెరవనేలేదు. ఆమెను పేరు బెట్టి పిలిచాను — అనేక పర్యాయాలు! అయినా లాభం లేకపోయింది. బతిమలాడను. అయినా తలుపు తెరుచుకోలేదు. బహుశా ఆమె ఏడుస్తూ ఉండటంవల్ల నా ఒక్క మాట కూడా ఆమెకు విన్పించి ఉండకపోవచ్చు!

తెలుగు అనువాదం: శ్రీ దండమూడి మహీధర్



శ్రీ తిరుమల రామచంద్ర

# అనంతకృష్ణులకు అంజలి

అనేక వాఙ్మయాలలో తలస్పర్శి పాండితి, దాని మీగడ తరక అనదగిన సహృదయత, దాని బాహిరరూప మనదగిన కమ్మని కవిత, దానికి గమకమైన గాన గరిమ, వీటన్నిటి సమాహార మన దగిన సచ్చరిత్ర పటిమ, దాని ప్రతికృతి అయిన మహితాకృతి, దానిని ప్రస్ఫుటించే పరిశుద్ధాభిరుచి, దానితో బారలు సాచి స్పర్ధించే సదభి వ్యక్తి రాళ్లపల్లి అనంతకృష్ణుల అపురూప స్వరూప రేఖ - అంచెచాలు..



రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ

అనంతకృష్ణుల స్వరూపం ఇంత సరసోదారంగా ఆవిర్భవించడానికి కారణం మొదట వారి పితృపాదులు, పిదప వారి గురు పాదులు శ్రీ కృష్ణబ్రహ్మతంత్ర పరకాల యతీంద్రులు అని నా అభిప్రాయం. పితృపాదులయిన కర్ణమడకల కృష్ణమాచార్యులు అనంతకృష్ణులకు అక్షరాభ్యాసం చేయించి, తెలుగు సంస్కృత కావ్యాలు చెప్పారు. ''శాఖాచంక్రమణము ఎప్పుడును చేయక శ్లోకార్థ తాత్పర్యములను వారివలె ప్రశాంతముగ చెప్పగలుగుట ఉపాధ్యాయులలో ఎందరో సాధింపలేని సిద్ధి ... కావ్యనాటక రసానుభవము వారికెంత తీవ్రమో అంత అంతరంగమైనది, ఆధ్యాత్మికమైనది ... చక్కని కవితకు వారులోగినవారేగాని, బహిరంగముగ సాత్త్విక భావములు ప్రకటించుట వారి వాడుక కాదు. అదొక అసాధారణమైన ఆత్మసంయమము వారిది.'' అని తను పితృపాదులను ప్రశంసించారు అనంతకృష్ణులు. (నాగురువులు - అనంతకృష్ణశర్మ సన్మాన సంచిక)

పిదప శ్రీ చామరాజనగరం రామాశాస్త్రి అనే పండితుల వద్ద, పరకాల యతీంద్రులు శ్రీ కృష్ణబ్రహ్మతంత్రుల వంటి మహాపురుషునివద్ద అంతేవాసిత్వం అనంతకృష్ణులను గొప్పవ్యక్తిగా తీర్చినది. ఈ తీర్పునకు మరొక కూర్పు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డితో వారి చేర్పు. ''సాహిత్య సంస్కారమున నాకు కడపటి గురువు ఆయన. రామలింగారెడ్డిగారు నన్ను సమాన స్కంధునిగా చూచేవారు. నా దృక్పథం మారడానికి, ప్రత్యేకముగా తిక్కనపై అభిమానానికి ఆయనే కారణం'' అని అనంతకృష్ణులు ముక్త కంఠంతో చెప్పుకొనేవారు. ఇరుప్రక్కల మూడవ వ్యక్తికి చొరవ లేని ముగ్ధ మధుర సంబంధం వారిది.

పాటల పాతర అయిన తల్లి శ్రీమతి అలమేలు మంగమ్మ గారి ప్రోత్సాహంతో అనంతకృష్ణులలో కలిగిన సంగీతాభిరుచి శ్రీ బిడారం కృష్ణప్ప వంటి వైణిక గాయక సార్వభౌముని శిష్యత్వంతో తీగలు సాగి వారిని గాన కళా ప్రపూర్ణ, గాన సింధు, సంగీత కళానిధి బిరుద విరాజితులను చేసింది.

అనంతకృష్ణులు తమ 19వ ఏట1912 జూలై 2వ తేదీన మైసూరులో మహారాజా కళాశాలలో తొలిసారిగా స్థాపితమైన తెలుగు పండిత పదవిని మెట్టి, ముప్పయి ఎనిమిదేండ్లు పలువురు శిష్యులకు తెలుగు నేర్పి, తెలుగు సరస్వతికి పట్టం కట్టినారు. పిదప 1950 నుంచి ఏడేండ్లపాటు తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయంలో తాళ్లపాక వారి కీర్తనలు సంస్కరించి ప్రచురించారు, కొన్ని కీర్తనలను స్వరపరిచారు. స్వరపరచడం అనంతకృష్ణులకు వెన్నతో పెట్టినవిద్య. 1917లో రవీంద్రకవీంద్రుడు మైసూరుకు వచ్చినప్పుడు, పట్టుమని పాతికేళ్లయినా నిండని అనంతకృష్ణులు, రవీంద్రుడు భువనమనమోహిని, జనగణమన పాడుతూంటే, ఆ పాటలకు వెంటవెంటనే స్వరకల్పన చేశారట. రవీంద్రుడు "I can not imagine how this young Pundit follows me with notations" అని ఆశ్చర్యపడ్డాడట.

అనంతకృష్ణుల రచనా వ్యాసంగం విశ్వగుణాదర్శకర్త వేంకటాధ్వరి ''సుభాషితకౌస్తుభం'' పద్యాల తెనిగింపుతో 13వ




ఏట – 1906లోనే ప్రారంభమయింది. పిదప తారాదేవి, మీరాబాయి ఆదిగా కావ్య, నవలోపన్యాస విమర్శలు, సంస్కృతాను వాదాలు పుంఖానుపుంఖంగా వెలువడినవి. వారివన్నీ తేనె తెలుగు కూర్పులు, సాహిత్యపు తీర్పులు. తెలుగులోను, సంస్కృతంలోను, కన్నడంలోను సమాన స్థాయిలో సాగింది వారి రచన.

వారి తారాదేవి కథాకథన కౌశలానికి తెలుగు పలుకుబడుల ప్రయోగ పాటవానికి కాణాచి. మీరాబాయి అజరామరమైన కావ్యం. మహీశూర రాజ్యాభ్యుదయాదర్శ సంస్కృత చంపువు ఆధునిక వైజ్ఞానిక సంస్కృతికి, ఆశుకవితకు విజయం. వారి వేమన, నాటకోపన్యాసములు, సారస్వతోపన్యాసములు, గానకళ, గానకలె, సాహిత్య మత్తు జీవనకలె, రాయలనాటి రసికత మున్నగునవి విమర్శ వాఙ్మయానికి నికషాలు. "తత్త్వమును దెలిసికొనవలెనను నాశ, తెలిసిన దానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి నిబంధనమై ఇరుపక్కలందులు మరుగులేని మంచి పదునుగల చురకత్తి వంటి రచనాశక్తి, దానికి మెరుగిచ్చునట్టి సూక్ష్మదృష్టి, గాయపుమందు కత్తికే పూసి కొట్టినట్టు తిడుతూనే నవ్వించే హాస్య కుశలత వారి విమర్శకు మూలద్రవ్యాలు. వారి విమర్శ అద్వితీయము, అనను కార్యము. వారి గాథాసప్త శతసారము, సుందర పాండ్య విరచిత నీతి ద్విషష్టిక, నృత్తరత్నావళి మున్నగు అనువాదాలు, మూలసౌందర్యమును జిగేలు మనజేయు మూలసమాన స్కంధాలు. పలువురి గ్రంథాలకు వారు వ్రాసిన పీఠికలు రామణీయక పేటికలు. అభిమానులకు వ్రాసిన కమ్మలు సాహిత్యపు కమ్మ తెమ్మెరలు. వారేది వ్రాసినా, ఉన్నదున్నట్టు అచ్చు వేసుకొనదగిన అచ్చుకట్టు.

సంగీత సాహిత్యాలకు వారు చేసిన సేవను పురస్కరించుకొని పెక్కు సంస్థలు వారిని సత్కరించాయి. మైసూరు చతుర్థ సంగీత సమ్మేళనం అధ్యక్షతతోపాటు వారిని 1961లో గానకళాసింధు బిరుదం, 1969లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారి గాన కళాప్రపూర్ణ బిరుదం, బెంగళూరు గాయక సమాజం సంగీత రత్నాకర బిరుదం, 1970లో కేంద్ర సంగీత నాటక అకాడెమీ ఫెలోషిప్పు, 1974లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీ వార్షికోత్సవాధ్యక్షతతోపాటు సంగీత కళానిధి బిరుదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ విశిష్ట సభ్యత్వం, 1974లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ బిరుదు, అస్తమించే దినాన తిరుమల తిరుపతి ఆస్థాన విద్వత్పదవి వరించాయి.

"విద్యాదదాతి వినయం" అన్న సూక్తికి అనంతకృష్ణులు

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

/ స్థాపితం : 1908 /

గాంధీనగరం, విజయవాడ-3

ఇంట్లో అందరికీ ఆనందాన్ని ఇచ్చే శీర్షికలు! కథలు!! బొమ్మలు!!!

★ సాహిత్య విలువలున్న సీరియల్ కథలు

★ వైవిధ్యం వున్న కథానికలు

★ అన్ని తరాలవారినీ అలరించే "ప్రశ్నావళి" "ధర్మపథం" కార్టూన్‌లు మొదలైన వాటితో ఏవారానికి ఆ వారమే కొత్తదనాన్ని పుణికిపుచ్చుకుని మీకు అందుతుంది!

విడి ప్రతి వెల 75 పైసలు

సంవత్సర చందా (పోస్టుద్వారా) రు. 41-60 పై.

ఆరు మాసాలకు రు. 20-80 పై.

మీ స్థానిక ఏజంటుద్వారా తెప్పించుకుంటే ప్రతీవారం తెల్లారేసరికల్లా మీముందు వుంటుంది

రచనలు పంపే చిరునామా!

ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక
గాంధీనగరం, విజయవాడ 3.

ఇతర వివరాలకు:

మేనేజరు, ఆంధ్రపత్రిక
గాంధీనగరం, విజయవాడ 3.



కొలంగి వెంకటేశ్వరరావు
సమర్పించు
బాబు ఇంటర్నేషనల్స్

## ఏడడుగుల అనుబంధం

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
పి.లక్ష్మీదీపక్
నిర్మాత
K.S.రామకృష్ణ

ఆంధ్ర: అన్నపూర్ణ

అన్నమాచార్య వంశంవారు అన్నమాచార్యులు పూజించిన విగ్రహాలను భరించలేక ఒక భక్తునికి దానం చేయగా, మడిబట్టలతో వెళ్లి ఆ విగ్రహాలకు, అన్నమయ్య, తిరువేంగళనాథుల చిరుతలు, పావుకోళ్లు మున్నగువాటికి సాష్టాంగ దండప్రణామం సమర్పించి వచ్చిన వినయ సంపన్నులు, భక్తిసంపన్నులు అనంతకృష్ణులు.

ఈ సాహిత్య విమర్శ ప్రస్థానాచార్యులకు సాహిత్య పరమార్థం గురించి నిష్కృష్టమైన సిద్ధాంతాలున్నవి. ''సాహిత్య పరమార్థం అన్ని కళల పరమార్థమూ -అలౌకికానుభవం; చిత్తసంస్కారమూను. సాహిత్యం ప్రపంచానికి అద్దంగా వున్నదా, లేదా అన్నది చిన్న మెట్టు. ఉండినది, ఉండవచ్చునది, ఉండవలసినది అనేవి ఉత్తరోత్తరం బలీయాలు. దీనిని నైతిక ధార్మిక హార్దికమైన వాటికీ అన్వయిస్తాను. ఒక్కొక్క దానినుంచి మరొక్క దానికి వెళ్ళడమే నా ప్రయత్నం. ప్రయోజనాత్మకతకంటే, ఉన్నదున్నట్టు చూపడంకంటే, ఉండవలసినదిగా చూపడం పై స్థాయి'' అని నిర్వచించారు తపోధనులు.

అనంతకృష్ణులు నిరంతరం—కలకాలం — జీవితంలోను పులుగడిగిన ముత్యాలరాశిగా, సాయం తల్లికా గుచ్ఛంగా, తావులీనే అపరంజి పోతపోసిన విగ్రహంగా దర్శన మిస్తారు.

అనంతకృష్ణులు విమర్శకులుగా ఆంధ్రావళికి ర్శన దర్శన మిచ్చారోగాని, వారు ప్రవర్తింపజేసిన ప్రస్థానం అరుదశాబ్దాలుగా అవిచ్ఛిన్నంగా సాగుతూ సారస్వత రమకు అసదృశ నీరాజనంగాను, జిజ్ఞాసువు మ్నాయ మణిదీపంగాను వెలుగొందుతున్నది. వారు లుగా, అభినవ గుప్తులుగా సాక్షాత్కరిస్తారు.